శ్రీ కృష్ణదేవరాయ ఆంధ్ర భాషానిలయము
సుల్తాన్‌బజార్, హైదరాబాద్. దక్కన్

# ధర్మఖండనము

(ద్వితీయసంపుటము)

కోమలపల్లి భవానీశంకరేంద్ర
ప్రణీతపద్యకావ్యము



శ్రీ పిఠాపురసంస్థానాధీశ్వరుల యాజ్ఞ ననుసరించి

విమర్శకాగ్రణి

నడకుదుటి వీరరాజకవిగారిచే

పరిష్కరింపబడి

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలయందు
ముద్రింపబడినది.

1931.

శుభమస్తు

అవిఘ్నమస్తు

# ధర్మఖండము



## షష్ఠాశ్వాసము



శ్రీకరమౌళికళాంక
ప్రకటనవకౌముదీనిరాకృతలోకా
నీకాంధకారశమద
ర్వీకరరాజన్యవలయ శ్రీగిరినిలయా. 1

వ. అవధరింపుము వివిధపురాణకథాకథనకళాప్రావీణ్యుం డగు సూతుండు శౌనకాదిమునీంద్రుల కిట్లనియె నట్లు బృహస్పతి సురపతి కిట్లనియె. 2

క. ర[illegible]ఁ డైన హిర
ణ్యాక్షుఁడు డిగటార నతనియనుజుఁడు వంకే
[illegible]నితోఁ [illegible]
నాయుముఁడై కనకకశిపుఁ డాగ్ర[illegible]ర, 3

మ. హరిదేవాలయపంక్తిఁ ద్రోచి హరివే
షాన్వితులన్ శ్రీహరి
స్మరణాసక్తుల నూర్ధ్వపుండ్రతులసీ
సన్మంజరీధారులన్
బరమామర్షత నొంచె విష్ణుహితదం
భప్రక్రియన్ వేదశా
స్త్రరహస్యార్థము లుజ్జగించితిరి మీ
ర ల్దండ్యు లంచున్ వెసన్. 4

క. కమలాక్షునిభక్తుల రై
క్రమమున శివనిందసేయుకష్టులు మీరల్
శమనుఁడు దండించు మిమున్
శమనుఁడు నేఁ గాక యొండు శమనుఁడు గలఁడే. 5

ఆ. అనుచు విష్ణుభక్తు లగుమహీవిబుధుల
ఫాలభాగరచితభాసమాన
శృంగభంజనంబు చేసి బాధించె నా
దితితనూభవుండు ద్వేషపరత. 6

వ. అంతఁ గులవృద్ధులను బంధుమిత్రాదులను గనుంగొని
యిట్లనియె. 7

గీ. హరి మదగ్రజుఁ డగు హిరణ్యాక్షుఁ దునిమె
నతనిఁ గ్రమ్మఱఁ దునుమక యాఱ దీఱ

సంప్రోక్షాగ్ని తజ్జయోపాయ మరసి
తెలుపఁదగు మాకు మీరలు గలఫలంబు. 8

వ. అనిన విని వారలు దేవా! నీ వెఱుంగనికార్యంబు లెయ్యవి బలశౌర్యవంతుం డగు నీకు నింత విచారింప వలయునె యైనను మా నేర్చు తెఱంగున విష్ణుని జయించు నుపాయంబు దెల్పెద మని యిట్లనిరి. 9

సీ. అఖిలలోకంబులు వ్యాపించి విష్ణుండు
వెలయు నాత్మవిభూతి విలసనమున
సద్గోగణముల దేవాయతనంబుల
యజ్ఞవాటముల ఋష్యాశ్రమముల
బిల్వవటాశ్వత్థవృక్షనివహముల ను
మారామభూముల యతులయందు
వేదశాస్త్రపురాణవిద్యాధ్యయనధరఁ
బావనస్థలుల బృందావనముల
సత్యవంతులయెడఁ బ్రియభాషికలను
వ్రతపరాయణు లగు విప్రవరులయెడల
ధర్మపరు లగు క్షత్రియోత్తములయెడలఁ
దరల కుండును విష్ణుండు దనుజనాథ. 10

ఆ. పుణ్యతీర్థములను భూరిసాలగ్రామ
పూజనముల సత్త్వభూములందుఁ

వ. ఇత్తెఱంగునఁ జతుర్దశభువనంబులు జయించి తనవశంబు చేసికొని బ్రహ్మాండంబునకు శిక్షకుండును రక్షకుండును దానయై హరిం బరాజితుంగాఁ దలంచి యతనిపరాజయం బెల్లలోకంబులఁ జాటించి యుత్సవం బొనరించి నేన జగన్నాయకుండ నని తలంచుచు నెదురులేక మదంబునం బొదలుచుండె నిట్లుండి దురితవిపాకంబుకతంబున నొక్కనాఁడు నిజనందనుం డగు ప్రహ్లాదుని రావించిన. 18

క. హరిభక్తుఁ డఖిలశాస్త్రా
ర్థరహస్యవిదుండు పూర్ణరజనీకరకరో
త్కరవిమలుఁడు ప్రహ్లాదుఁడు
గురుగృహమునుండి వచ్చె గురుసన్నిధికిన్. 19

సీ. హరి రమాపతి సనకాదిమునిస్తుత్యుఁ
డని నెమ్మనంబునఁ దలఁచువానిఁ
కేశవాచ్యుతరామకృష్ణహరే యంచు
మించువేడుకఁ బఠియించువాని
జగము శ్రీహరిమయం బగు సత్యమని యెంచి
పులకాంకితాంగుఁ డై పొలుచువాని
ననిశంబుఁ దనుఁగాంచు సజ్జనుల నైనను
బ్రాజ్ఞులఁ గావించుప్రతిభవాని
తే. జలధిఁ దరఁగలువోలె నీజగము లెల్ల
విష్ణునం దుండు నంచు భావించువాని

విపులతరశంఖచక్రచిహ్నములవానిఁ
గాంచెఁ బ్రహ్లాదు నపుడు రక్కసులతోడ. 20

ఉ. ఆయన వచ్చువేళ నను
రాధనుఁ డెవ్వని నెందుఁ గాంచెఁ దా
నా యెడ వానియందు హరి
యాకృతి గానఁగనయ్యె విస్మయుం
డై యతఁ డంత నన్ను నదె
రా వెలిపింపఁగ విష్ణుఁ డీగతిం
బాయక యిట్టిబాలుఁడయి
వచ్చె నటంచుఁ దలంచె నెమ్మదిన్. 21

తే. వీఁడు హరిభక్తి మఱఁగెనొ వీనిఁ జూడ
హరిఁ గనుంగొనునట్టుల యయ్యె నతని
చిహ్నములు దాల్చి వచ్చె నద్గుణమహీడు
విష్ణుఁ డరుదెంచెనో వీనివెంటఁ దగిలి. 22

తే. చతురమతి వేదశాస్త్రము ల్చదివెనేని
సిరులు వఱలఁగ యువరాజుఁ జేయువాఁడ
నద్విరోధికి భక్తుఁడై మనలెనేని
వీని నిప్పుడె శిక్షఁ గావింతుఁ బట్టి. 23

వ. అని తలంచి భస్మచ్ఛన్నాగ్నిచందంబునఁ దేజరిల్లుచు
నెదుట నిల్చిన కుమారుఁ గనుంగొని యద్దనుజవిభుండు

గదిరె హరియే నిజంబు జగంబు మిథ్య
యనుమం దలపోయుచుండె నయ్యర్భకుండు. 34

ఉ. ఆదివిజారి సీరభటు
లందఱు నొక్కటం జేయుబాన వ్రి
చ్చేదమున కెంతమూపులజ
లంబు తెఱంగున వ్యర్థమయ్యె నా
వేదన యించుకైన బ్రభ
వింపఁగఁ జేయ కనల్పకోపమూ
నాదినిదూరుఁడై పరగు
నాతని కాపద లంటనేర్చునే. 35

సీ. మునియందుఁ గడఁదిమాలనియందు మనమృగ
గజమునందును మశకంబునందు
శత్రువర్గమునందు మిత్రవర్గమునందు
దీనునియందు భూజానియందు
మేదినీస్థలినందు మృదుశయ్యయందును
దారుపుత్త్రికయందుఁ దరుణియందు
స్తుతియందు శాపసంగతియందు సతివదా
న్యునియందు మతిలోభిజనునియందుఁ
తే. గాంచనమునందు లోష్టనికరమునందు
హీనవంశజునందుఁ గులీనునందు

చ. అనయముఁ గ్రూరకర్ముల మ
హార్యశిలాగణకర్కశంబు మా
మనము మదీయరూపము స
మస్తజగజ్జనభీతిదంబు మే
మనితరభేద్యవిక్రముల
మార్కొతెఱంగున నిట్టిమాకు నీ
యనఘునిసంగతిన్ మృదుల
తాకరలీలఁ దనర్చె హృద్గతుల్. 40

వ. అని తెల్పిన నతండు క్రోధరక్తాంతలోచనుండును గలు
షీకృతమానసుండు నై భ్రుకుటినిటలతటంబున నటింప
హరిచరణస్మరణపరాయణుం డగు నాశ్రాబకు రావించి
యతనితో నిట్లనియె. 41

మ. హరిసేవారతి మాని నం గొలువు పు
త్రా యౌవరాజ్యంబు బం
ధురకారుణ్యత నిచ్చెదం దనయు లెం
దుఁ ధర్మకాంతామతిఁ
ధరణిం గొల్వఁదగుం గురుం గురుఁడె తీ
ర్థం బర్థముఁ ధర్మముఁ
గురుఁడే భర్తయు హర్తయుం గ్రియయుఁ జె
క్కు ల్వల్క నిం కేఁటికిన్. 42

వ. అనినఁ బ్రహ్లాదుం డిట్లనియె. 43

బరగదు తత్పదాంబురుహ
భక్తి భవాబ్ధికి నావ యమ్మహా
పురుషుఁడు పత్త్రపుష్పఫల
పూజితుఁడై యిడు వాంఛితార్థముల్.

తే. గాత్రమాత్రంబునకుఁ దండ్రి కారణంబు
గాని విద్యాప్రదుండైన ఘనుఁడె తండ్రి
హితము సేకూర్చు నహితంబునే పడంచు
నతఁడు గెల్చునే బహుళపుణ్యములఁగోని.

వ. విద్యాశీలాదుల నుపదేశించునతండె తండ్రి దోషదూషి
తుండ వీ వెట్లు తండ్రి వనినం దండ్రి యిట్లనియె.

తే. ఏను దయఁ జన్ను మొసఁగి నిన్నే దకున్న
జీవనం బెట్లు గనుచుంటి చెనఁటి నీకు
వ్యక్తి యెందాఁక నిలుచు నీవంతదాఁక
నను భజింపుము చెడనేల యధమశీల.

వ. అనినం గొడు కిట్లనియె.

తే. జననిగర్భములో నున్న సమయమునను
వృత్తిఁ గల్పించె నెవ్వఁ డవ్విభుఁడు శివ
జీవనోపాయకల్పన సేయలేఁడె
మఱచి నిద్రించునో లేక మొఱఁగిచనునొ.

వ. అనిన హిరణ్యకశిపుండు నారాజ్యంబున నుండక యెచ్చటి
కేనియుం జనుమ్ము వనినఁ బ్రహ్లాదుం డిట్లనియె.

తే. ఇచట నుండుట యొండెడ కేఁగుటయును
నాకు నొక్కసమం బగు రాక్షసారి
యనిశమును సర్వగతుఁ డయి యచ్యుతుండు
వెలయు నతనికి నాకును వేఱు లేదు. 54

వ. అనిన నతండు మదీయుండైన ధనం బంతయుం గొని
ధర్మంబు నలుపుచు నావగతుపక్షంబు విడువు మనినఁ
బ్రహ్లాదుం డిట్లనియె. 55

ఉ. ఏమి యొనర్తు నిచ్చటికి
నేఁగుదు నెద్ది గ్రహింతు నింక నే
నేమి దొలంగువాఁడఁ బర
మేశ్వరుఁ డంతట నిండియుండ నా
శ్రీమహిళేశుసేవ మెయిఁ
జేకుఱు సౌఖ్యము లెందు నందునే
వేమఱు నాయనం బరిభ
వించుట పాతకహేతు వారయన్. 56

వ. అనిన నతండు దుఃఖంబుఁ దొలంగి సుఖి వగు మిట్టి
యసభ్యాలాపంబులు మాని హితవచనంబులు పలుకు
మనిన నబ్బాలుం డిట్లనియె. 57

తే. దుఃఖ మెటు గల్గు దొలఁగఁ బాపఁ దొలఁగవలయు
సుఖము గల్గిన మఱిగదా చొక్కవలయు

నాత్మసుఖదుఃఖహీనత నతిశయిల్లు
నాత్మయే హరి హరి నేన యసురవర్య. 58

వ. జగదీశ్వరుం డైన హరి నెఱుంగు మిదియ హితోపదే
శం బనిన దివిజవైరి యిట్లనియె. 59

క. నీవు కులీనుండవు వి
ద్యావిదుఁడవు ఖ్యాతియుతుఁడ వతులజ్ఞాన
శ్రీవిలసద్బుద్ధివి మే
ధావివి నీ కిట్టిభ్రాంతి తగునె కుమారా. 60

వ. అనినం బ్రహ్లాదుం డిట్లనియె. 61

మ. త్రిగుణాతీతుఁ హరిం భజించునతఁ డెం
తే సుప్రసిద్ధుండు జ్ఞా
నగరిష్ఠుండు గులీనుఁ డార్యుఁడు జగ
న్మాన్యుండు మేధావి యా
జగదాధారు నెఱుంగునాకు భ్రమ మే
చందంబునం జెందుఁ బొం
దుగ రూపభ్రమఁ జెందునే జగతి నెం
దుం శుక్తి విజ్ఞాతకున్. 62

వ. అనిన నతండు నీవు బాలుండవయ్యు నిర్భయంబున
నాయెదుటఁ బ్రేలుచున్నవాఁడవు నిన్ను శిక్షింతు శిక్ష
వలన ననేకగుణంబులు గల్గు ననిన డింభకుం డిట్లనియె. 63

ఆ. బాల్యయౌవనాదిభావము ల్మేనికిఁ
గాని యాత్మ కెపుడు గలుగ వరయ
భేదబుద్ధులకును భీతి సంధిల్లు ని
ర్భేదబుద్ధులకును భీతి గలదె. 64

వ. సర్వశిక్షకుం డైన పద్మాక్షునిచే శిక్షఁ గాంచి త్రిగుణా
తీతుండ నైతి నింక నాకు వెండియు గుణంబు లేచందం
బునం గల్గు ననిన విని దనుజభర్త యిట్లనియె. 65

క. మదబంధురసింధుర మదె
యుదయత నిను ద్రొంపవచ్చె నర్భక నీ వీ
యుదనం బఱవక నిల్చెద
వదిరా నినుఁ గాచు నెవ్వఁ డనుపమకరుణన్. 66

వ. అనినం బ్రహ్లాదుం డిట్లనియె. 67

పంచ. ప్రపంచభేదబుద్ధిఁ బ్రాణుఁ బాము గాఁగ నెంచు పా
దపారభీతిఁ బాయుఁగాక యద్వయోరునిష్ఠచేఁ
బ్రపూర్ణకాముఁడైన గల్గఁ బాఱిపోవ నేఁటికిం
గృపాకరుండు నన్నుఁ గాచుఁ గేశవుండు వేడుకన్. 68

వ. అనిన నతండు క్రోధఘూర్ణితనేత్రుండై యోరీ విష్ణు
సనాలంబించి బుద్ధిచాపల్యంబునం బ్రతికూలంబులు పలి
కెద ...ం ...ం డుండుఁ దెల్పు మనసునఁ బ్రహ్లాదుం
డిట్లనియె. 69

తే. ఆతృణంబాది బ్రహ్మపర్యంతమైన
యబ్జజాండంబునందుఁ దా నవిరతంబు
హరి పరేశుఁడు పరిపూర్ణుఁ డై వెలుంగు
సర్వగతుఁ డవ్యయుండు నిస్సంశయంబు. 70

వ. అన్నపుడు. 71

తే. హరి యొ సర్వగతుండు దా నయ్యెనేని
యతనిభక్తుఁడ వగుచు నీవలరు దేని
యీసభాస్తంభమునఁ జూపు మిప్పు డతని
ననుచు ధట్టించి పల్కె నయ్యసురభర్త. 72

తే. అంత భక్తార్తిహరుఁ డైన హరి హిరణ్య
కశిపు వధియింపఁ దలఁచి యాగ్రహము చెలఁగ
నాసభాస్తంభగతుఁడయి యపు డొనర్చె
ఘనఘనామేయగర్జ యక్కజము గాఁగ. 73

చ. వితతశిఖాకలాపములు
వెల్వడెఁ గంభమునం జటచ్ఛటా
తతనినదంబులన్ విలయ
దావకృశానునిరీతిఁ దత్సభా
పత్తు లగ్గు రక్కసులు లల్లలఁగి
పాఱఁ దొడంగిరి భీతిఁ జెంది య
గ్రపతిమనుజతంబునన్ దనుజ
పాలకుఁ డొక్కఁడు దక్క నందఱున్. 74

ఉ. ఆయెడ దేవసంఘము ల
హార్యసమానవిమానరూఢులై
యాయుధమాసురప్రభయ
మాత్మలఁ గోరి వసించి రొయ్యనై
హాయనపీఠి నంత నసు
రాంతకుఁ డుద్భవమయ్యె భక్తునిం
గాయ నయోమయం బయిన
కంబమునన్ నరసింహమూర్తియై. 75

శా. అంభోధుల్ గలఁగన్ శిలోచ్చయము లూ
టాడన్ దిశల్ వ్రీస ది
క్కుంభీంద్రంబులు త్రుళ్ళఁ గ్రుంగఁబడియెం
గుంభీనసస్వామి యు
య్యంభోజాప్తుఁడు మాసెఁ గ్రోధయుగుఁడై
ఘృష్టస్తంభసంభూతుఁడై
యంభోజాక్షుఁడు నారసింహవపురు
ద్యచ్ఛ్రీ విజృంభింపఁగన్. 76

వ. ఇట్లు ఘోరాకారుండును దంష్ట్రాకరాళవదనుండును నిశాతవజ్రనఖాయుధుండును గహాకహాట్టహాసత్రాసిత భువనత్రయుండును విలయధూమకేతుజ్వాలాజాలాభీలాంగుండును దుర్నిరీక్షుండును నై నృసింహావతారం బావిర్భవించిన. 77

తే. దితిజుఁ డత్తఱిఁ జిత్రపుత్త్రికతెఱఁగున
నుక్కు దక్కఁగియు ధైర్యసంయుక్తి కలిమి
ఖడ్గఖేటకహస్తుఁడై కవిసె నతనిఁ
బవనసఖుమీఁదఁ జను శలభంబువోలె. 78

శా. తత్కుంజరుఁ బట్టి తెచ్చి నరహ
ర్యక్షుండు దిగ్భిత్తులన్
ఘూర్ణాక్షిచ్ఛవి నిప్పు లుప్పతిల నూ
రుస్థాయిఁ గావించి త
త్కుక్షిచ్ఛేదన మాచరించె నఖర
క్రూరాసిధారాహతిన్
రక్షించెన్ భువనంబు లిప్పు డని గీ
ర్వాణుల్ ప్రశంసింపఁగన్. 79

శా. భక్తోక్తిప్రతిపాలనార్థి యయి శుం
భన్నారసింహాకృతిన్
నక్తంచారి గతాసుఁ జేరి త్రిజగ
న్నాథుండు గోధ్రంబునన్
రక్తం బొక్కుట దిక్కుల న్నినుచుచున్
రాగిల్లి తద్రక్తసం
సిక్తాంగుం డయి పొల్చె నంత విలయా
ర్చిర్వాశిచండంబునన్. 80

చ. అభిరతి నప్సరోపసిత
లాడిరి తోడనె దుందుభు ల్గుభుల్
గుభు లని మ్రోయఁజేయుచును
గ్రొన్ననవాన లెసంగ నిర్జరుల్
సభమున నిల్చి సన్నుతి రయి
నర్చిరి పంకజనాభుఁ బద్మినీ
విభుఁడు ప్రభం జెలంగెఁ దెలి
విం దనరారె సమస్తదిక్కులున్. 81

క. అనరకేసరి యప్పు డ
స్దానవునిం ద్రుంచి దిగ్వితానము లడలన్
దా నద్భుతగతిఁ గ్రోధము
మానక విలయదవదహనుమాడ్కిఁ జెలంగెన్. 82

వ. అనిన నింద్రుండు హిరణ్యకశిపునిం ద్రుంచియు నరహరి మరలం గ్రోధి యగుటకుం గారణం బెయ్యది యానతి మ్మనిన గురుం డిట్లనియె. 83

ఆ. తనదుభక్తుఁ డైన దనుజార్భకుని యార్తి
దలఁచుచునికిఁ గ్రోధకలితుఁ డయ్యె
నచ్యుతుండు తనయునార్తిఁ దలంచిన
తండ్రి క్రోధి యగుచుఁ దనరునట్లు. 84

వ. సాత్త్వికియు, రాజసియు, తామసియునన భక్తి మూఁడు విధంబులై పరగు నందు. 85

శా. శంభుద్వేషులు దోషదూషితులు హిం
సాతత్పరుల్ క్రోధులున్
శుంభత్కర్మవిదూరులున్ బుధజన
స్తోత్రక్రియాదూరులున్
రంభగ్రస్తులు నైన భక్తులు సురేం
ద్రా! శ్రావకుల్ విష్ణుఁ డా
దంభాచారుల దుష్కృషూరులవలెం
డాఁ గన్గొనున్ నిష్కృపన్. 86

మ. ఫలకాంక్షారతిఁ గర్మము ల్సలిపి ద
ర్పక్రోధమానోద్ధృతులై
యలవోకన్ హరిపూజసేయుచును భో
గాసక్తులై యుండువా
రు లలిన్ రాజసభక్తు లెంతయును గ్రూ
రు ల్వాసవా వారి స
న్నలినాక్షుం డగుణాఢ్యపుత్త్రిలగతిం
జాటించు నెల్లప్పుడున్. 87

మ. నిరహంకారులు నిర్వికారు లనఘుల్
నిర్మత్సరుల్ సత్యవా
[illegible]
నిర్దంభవేషుల్ నితం

తరవిజ్ఞానులు హ్రీసమేతులు సదా
సందుల్ ధరణి సాత్త్వికుల్
హరి తద్భక్తుల సత్కుమారులవలెన్
హర్షించి కాంచుం దయన్. 88

ప్రహ్లాదుండు సాత్త్వికభక్తియుక్తుండు గావున హరికి
బ్రియుం డయ్యె నంత సురగణంబు లాప్రహ్లాదుని లక్ష్మీ
దేవిం బురస్కరించుకొని వచ్చి యానరసింహదేవుని
నిట్లని స్తుతియించిరి. 89

జగదుద్భవస్థితిసంహారకారిణే
ఫాలేక్షణాయ తుభ్యం నమోస్తు
సకలభూతగ్రహోచ్చాటనహేతవే
ఫణిభూషణాయ తుభ్యం నమోస్తు
నిత్యాయ విష్ణవే నీరజబంధుచం
ద్రాగ్నినేత్రాయ తుభ్యం నమోస్తు
పరయంత్రహరణాయ హరయే విషాగ్నిన
ర్వనిషూదనాయ తుభ్యం నమోస్తు
వ్యాఘ్రచర్మాంబరాయ తుభ్యం నమోస్తు
భయదదంష్ట్రాయుధాయ తుభ్యం నమోస్తు
ప్రబలదైత్యాంతకాయ తుభ్యం నమోస్తు
పాహి నో నారసింహ తుభ్యం నమోస్తు. 90

తరవిజ్ఞానులు హీ్రసమేతులు సదా
నందులౌ ధరణి సాత్త్వికులౌ
హరి తద్భక్తుల సత్కుమారులవలెన్
హర్షించి కాంచుము దయన్. 88

క. వర్ణింపఁదగు సాత్త్వికభక్తియుక్తుండు గావున హరికిన్
బ్రియుం డయ్యె నంత సురగణంబు లాప్రహ్లాదుని లక్ష్మీ
దేవిం బురస్కరించుకొని వచ్చి యానరసింహదేవుని
నిట్లని స్తుతియించిరి. 89

సీ. జగదుద్భవస్థితిసంహారకారిణే
ఘోరేక్షణాయ తుభ్యం నమోస్తు
సకలభూతగ్రహోచ్చాటనహేతవే
ఫణిభూషణాయ తుభ్యంనమోస్తు
నిత్యాయ విష్ణవే నీరజబంధుచం
ద్రాగ్నినేత్రాయ తుభ్యం నమోస్తు
పరయంత్రహరణాయ హరయే విషాగ్నిన
ర్పనిషూదనాయ తుభ్యంనమోస్తు
వ్యాఘ్రచర్మాంబరాయ తుభ్యంనమోస్తు
భయదదంష్ట్రాయుధాయ తుభ్యంనమోస్తు
ప్రబలదైత్యాంతకాయ తుభ్యంనమోస్తు
పాహి నో నారసింహ తుభ్యంనమోస్తు. 90

తే. గీ. మీనకచ్ఛపకిటినర మృగతనువులు
దాల్చి తేఁక వటుభృగుకులోత్తంసరామ
ఖలజినోత్తమకల్కిరూపములు దాల్చఁ
గలవు జగములు మనుప రక్కసులఁ దునుమ. 91

వ. దేవా భవదీయవదనగుహానిర్గతశిఖిశిఖాసందోహంబులు
లోకంబులకు బాధ యొనరించుచున్నయవి దేవకంటకుం
డగు హిరణ్యకశిపుండు నిహతుం డయ్యె దేవకార్యంబు
సఫలంబయ్యె నింక నీయుగ్రకోపం బుపసంహరింపుము
శరణాగతుల మగు మమ్ము మనిచి జగంబులకు శుభంబు
గలిగింపు మని యనేకవిధంబులం బ్రస్తుతించి దండప్రణా
మంబు లాచరించిన దరస్మితసుందరవదనారవిందుండై
యద్దేవుం డిట్లనియె. 92

క. ఈదనుజుఁ దునుముటకుఁ బ్ర
హ్లాదహితార్థముగ నే నయస్తంభంబుం
భేదించి యవతరించితి
నో దేవతలార భీతి యుడుగుఁడు మీరల్. 93

తే. గీ. అనుచుఁ బల్కి ప్రసన్నత నలరు నమ్మ
హాత్ముఁ డావలికులు వెక్కి నబ్జగేహ
యుటఁ దదీయాంగసంగసుఖానులబ్ధి
సురల కభయప్రదుం డయ్యె హరియు నంత. 94

పృథ్వి. మహార్ఘులు ప్రహృష్టులై మహితవేదసూక్తంబులన్
మహామతి నుతించి రమ్మనుజకేసరిన్ వార్ధిజా
సహాయు సురదుందుభుల్ చదల మ్రోసెఁ గల్పావనీ
రుహచ్యుతసుమావళీరుచిరవర్షసామగ్రితోన్. 95

క. ఆదేవుఁ డతులకృపఁ బ్ర
హ్లాదునిఁ జేరంగఁ జీరి యసురాధిపుఁ డు
న్మాది హతుఁడయ్యె నిమ్మెయిఁ
బా దగుతనపూర్వకర్మపరిపాకమునన్. 96

ఉ. యాచకు దాతఁ జేయు నతి
హర్షితు దుఃఖితుఁ జేయు నంతయున్
నీచుని రాజుఁ జేయుఁ దరు
ణీనవమన్మథు వృద్ధుఁ జేయుఁ దాఁ
గాది దృఢాంగు రోగయుతుఁ
గా నొనరించు నమాన్యు మాన్యుగా
నేచి యొనర్చుఁ గాలగతి
హేళిమెయిం దురితక్రమోద్ధతిన్. 97

తే. అట్టికాలాత్మకుఁడ నేన యదియుఁ గాక
యాత్మ యంతటఁ బరిపూర్ణమై వెలుంగ
బాహ్యబాధకవృత్తు లేవగిదిఁ బుట్టు
నవియు మాయాకృతంబులై యలరుఁగాక. 98

వ. కావున నీవు నందిగ్రి వగపకుండు మని పలికి యరుణార.

విద్ధసుందరం బగు నిజహస్తంబున నతనియంగంబు నిమిరి
కృతార్థుం గావించి దైత్యదానవరాజ్యంబునకుఁ బట్టాభి
షిక్తుం గావించి సురగణంబులం గనుంగొని మీరలు
నిజస్థానంబులకుం జని సుఖంబున నుండుండు యుష్మ
త్కృతంబైన స్తోత్రంబున కేను బ్రీతుండ నైతి నీస్తో
త్రరాజం బెవ్వండు పఠియించు నతండు దురితవిముక్తుం
డగు నని యానతిచ్చి మఱియు నిట్లనియె. 99

చ. స్థిరమతి నెవ్వఁ డేనియు నృ
సింహ నృసింహ నృసింహ యంచుఁ దా
నిరవుగ నెల్లవేళ జపి
యించు నతండు నృసింహమూర్తియై
పరగును వానిఁ గన్గొనినఁ
బాఱుఁ బిశాచనిశాచరగ్రహో
త్కరవరమారికాగణము
దద్దయు భీతిలి ఘాతకోట్లతోన్. 100

మ. అరి మిత్రం డగు దుష్టనాగచయముల్
హారంబులై చెల్వగున్
బరమాపద్వ్రతతు ల్దొలంగు శుభసం
పల్లాభసంసిద్ధి యౌ
నరపాలుం డతివశ్యుఁడై మెలఁగు న
న్నున్ ముక్తి పాణిస్థితిం

బోరయున్ శ్రీనరసింహనామపఠనం
బొల్పొందు మర్త్యాళికిన్. 101

వ. అని యానతిచ్చె నని చెప్పి గురుం డిట్లనియె. 102

తే. నరులబంధంబు లూడ్చుట నారసింహుఁ
డనఁగ విఖ్యాతిఁ జెలువొందె నమ్మహాత్ముఁ
డానృసింహపదస్మరణాఢ్యు లైన
మర్త్యు లనిశము పూజ్యు లమర్త్యులకును. 103

తే. మఱి నృసింహాయుతాష్టరీమనుజపంబు
సేయుమనుజున కిష్టార్థసిద్ధు లెసఁగు
ననఘులీల నృసింహాష్టవి పఠించు
నట్టినరుఁడు జీవన్ముక్తుఁ డగు నిజంబు. 104

తే. ఘననృసింహాభిధాన పవిత్రకృతిఁ గార్త్తవీర్యు
నవనిజాలత్కరణనహేతుఁ డై పరశుఁ డను
నాత్మఁ దలఁచినఁ జోరబాధాదు లణఁగి
మార్గమున లాభలబ్ధి వర్ధిల్లు నిశ్చయంబు. 105

ఆ. ఈనృసింహచరిత మేప్రొద్దు భక్తితో
వినుచునుండు నట్టిమనుజవరుఁడు
నిఖిలదురితతతుల నిరసించు స్వర్గలో
కమున నధివసించు నమలచరిత. 106

వ. అనిన నింద్రుం డిట్లనియె. 107

క. ఉరువైరాగ్యాన్వితుఁడై
పరగియు దైత్యమణి యైన ప్రహ్లాదుఁడు శ్రీ
హరిదత్తరాజ్యరమ యే
కరణిం బాలించెఁ దెల్పఁగాఁ దగు ధిషణా. 108

వ. అని యడిగిన గురుం డిట్లనియె. 109

ఉ. ఆతఁడు రాజ్యలక్ష్మిఁ గని
నంతన తొంటివిరక్తి డించి తా
నాతతి నింద్రియప్రతతి
నాఁపఁగఁజాలక భోగలోలుఁడై
భూతల మేలుచుండె సిరి
పొంపిరివోవఁగఁ జిత్తనిగ్రహ
ఖ్యాతిఁ జెలంగ శర్వునకుఁ
గాక పొసంగున యొండుదేహికిన్. 110

తే. అవని దున్నక పండె ధేనువులు పిదికెఁ
బాలు, జలవహ్నితస్కరబాధ లెడలెఁ
బౌరు లెల్లరు హర్షసంపదఁ జెలంగి
రవనిఁ బ్రహ్లాదుఁ డేలు నయ్యవసరమున. 111

ఉ. భాసురదివ్యమాల్యపట
భవ్యవిభూషణభూషితాంగుఁడై
యాసవశర్కరాజ్యపల
లాంసలుఁడై రమణీమణీరతి

వ్యాసవిలాసతన్ మలయు
జాగరుచర్చఁ దనర్చి తా నవి
ద్యాసముపేతుఁడై పావత
నాతఁడు భోగరసప్రమత్తతన్. 112

తే. అతనికి విరోచనుం డను * నాత్మజాతుఁ
డొదవె నతనికి బలి యమ్మహోద్ధతునకు
బాణుఁ డుదయించె నీగతి బలిసి రసుర
లోకపుఁ బోకపుఁడై జగముల నొదుపఁజాలి. 113

ఉ. తక్కటిదైత్యపుంగవు ల
తండ్రిబలోద్ధతిఁ దత్సహాయులై
తక్కక యుద్ధకాంక్ష నతి
దర్పితులై పొదు రెండు లేక యే
దిక్కునఁ జారలై మెలఁగ
దివ్యులు †దానవమానవాధముల్
పొక్కుచుఁ దొంగి రెంతయును
బూర్వగతిన్ భయవిహ్వలాంగులై. 114

క. నానాభావనమన్వితు
లై నిత్యము భోగభుక్తి నలరుచు తర్వా
ధీనమతి నుర్వి నుండిరి
దానవులు హిరణ్యకశిపుతనుజు లనంగన్. 115

* నాత్మజాండు, వృషపర్వుడు. † [illegible]

వ. అయ్యవసరంబున నొక్కనాఁడు. 116

ఉ. చారుతటిల్లతాలలిత
శారదమేఘ మనం గఠారశృం
గారజటాచ్ఛటాకలిత
గౌరతనుద్యుతి చెంగలింపఁగా
నారదుఁ డేఁగుదెంచె గగ
నంబుననుండి సమీరణాహతిం
దారి విపంచి మించి హరి
తత్త్వమహత్త్వము లుగ్గడింపఁగన్. 117

తే. పింగళజటాప్రభాజాలపీతచేల
మృగమదాసితవల్లకీశ్రీశమూర్తి
దనరెఁ దత్పాండురాంశుసుధాసముద్ర
మధ్యశయనక్రియామేయమహిమ చెలఁగ. 118

క. కృష్ణాజినోత్తరీయుం
దుష్ణాంశుప్రతిమతేజుఁ డురుతరవిద్యా
నిష్ణాతుఁ డఖిలవంద్యుఁడు
కృష్ణస్మరణాఢ్యుఁ డతఁడు కృతకృత్యుఁ డిలన్. 119

తే. అటు యదృచ్ఛాగతుండగు నట్టిదివ్య
మునికిఁ బ్రహ్లాదుఁ డెదురుగాఁ జని నమస్క
రించి యుచితాసనం బిడి యుంచుభక్తి
నాతిథేయార్ఘ్యసత్క్రియ లాచరించె. 120

చ. అతిథిగృహాగతుం డయిన
యప్పుడు యుష్ణకాలవేళ యప్పుడు
పితృమునివర్యతిథ్యసుర
బృందసమాగమవేళ యప్పుడు
మతులకుఁ జేయుఁ డర్చలు త
మాహ్వయకేశ్వరుఁ డెందుఁ దత్తిర
స్కృతి సుకృతంబు నాయువును
శ్రీయు హరించు మనుష్యకోటికిన్. 121

ఆ. అతిథిపూజఁ దనిపి యలరించు నేగృహి
యతనిగృహము సద్గృహాఖ్య నమరు
నట్లు విముఖుఁ డైన నమరులు మునులును
విముఖు లగుదు రింక వేయు నేల? 122

క. కావునఁ బ్రియోక్తిడుం డ
ద్దేవమునిం బూజనల్పి ధృతి వంతుష్టుం
గావించి యంత బలద
ర్పావిలమతి నిట్లు లనిమె నారనితోడన్. 123

క. సూర్యగతిఁ లోకముల న
వార్యగతిన్ సంచరించు వలఁతివి నీ వా
యార్యమతి నీదెయుంగని
కార్యగతు ల్గలుగ వినఁగంబుఁ డయుందున్. 124

వ. సచరాచరంబైన త్రైలోక్యంబును సుకల[illegible]

రక్షోగణంబులలోన న న్నెదిరించువీరుం డొక్కరుండును లేఁడు కలిగనేనియుఁ జెల్పుము వానిం జయించెద నిజ్జగంబుల కేన ప్రభుండనై శిక్షణరక్షణంబు లాచరించుచు సర్వవంద్యుండ నై వర్తిల్లుదు సమానాధికరహితుండ నిగ్రహానుగ్రహదక్షుండ నేన యని గర్వంబుగాఁ బలికిన విని యమ్ముని తనమనంబున. 125

ఆ. ఇతఁ డభేదబుద్ధియుతుఁ డయ్యు హరిభక్తుఁ
డయ్యు రాజ్యమత్తుఁ డైనకతన
జ్ఞానహీనుఁ డయ్యె జగతి నైశ్వర్యమ
త్తునకు జ్ఞానసిద్ధి యొనరు నెట్లు. 126

తే. సంగమాత్రన జ్ఞాన మడంగిపోవు
ననినచో రాజ్యలక్ష్మీమదాంధుఁ డైన
నరున కేరీతి నబ్బు జ్ఞానంబు నడఁచు
వస్తు వొక్కటి సిరికంటె వసుధఁగలదె. 127

వ. రాజ్యధనోన్మాదనిమిత్తంబునను స్త్రీద్యూతాసననిమిత్తంబునను గులరూపవయోవిద్యానిమిత్తంబునను వినాశకారణం బై మదం బుదయించు నివృత్తజ్ఞాన నైరాగ్యుం డగు నితనికిఁ దత్త్వమార్గం బుపదేశించి బోధింప నేల పాషండపాపాచారదూషకజార చోర పిశున రాజ్యశ్రీ ధన స్త్రీమత్తకోపనుల బోధించిన భస్మన్యస్తహవ్యంబును జలలిఖితాక్షరంబునుంబోలె నిరర్థకం బగు శ్రీమదాంధు

నకు దారిద్ర్యంబు పరమౌషధం బని విచారించి యున్నా
రదుం డిట్లనియె. 128

తే. అసదృశైశ్వర్యందరి వైకుంఠ మనఁగ నొక్క-
వీడు చెలువొందుఁ దత్పతి విష్ణుదేవుఁ
డతఁడు రక్షఃకులాంతకుఁ డహితగర్వ
భంజనుఁడు భక్తలోకైకరంజనుండు. 129

ఉ. అతఁడు శంఖచక్రధరుఁ
డామరమౌళిచిరత్నరత్నవి
ఖ్యాతగభస్తిరంజితప
దాంబుజుఁ డంబుదనీలవిగ్రహుం
డాతతశౌర్యశాలి శర
ణాగతవత్సలుఁ డంబుజాతసం
జాతసుతుం డశేషదను
జప్రభుమర్దనుఁ డెన్ని చూచినన్. 130

ఆ. మఱి హిరణ్యకశిపు మధుకైటభుల హిర
ణ్యాక్షు నుక్కడంచె నదియుఁ గాక
యతఁడు జగములందు వ్యాపించి యుండు ము
నీంద్రచిత్తనిలయుఁ డీశ్వరుండు. 131

శా. దేవద్రుప్రకరప్రకీర్ణమును సం
దీప్తాచ్ఛరత్నాలయ

శ్రీవిస్ఫూర్తి నిరస్తసోమతపనా
ర్చిర్మాలి తేజంబునై
భావాతీతమహోచ్చకాంచనమయ
ప్రాసాదసంకీర్ణమై
యా వైకుంఠము వేల్పు సన్నుల కజే
యంబై జగద్వంద్యమై. 182

కం. ఘనసారమృగమదాదులు
వినుమీ రాసులయి పొల్చు విష్ణునిపీటన్
ఘనతరరత్నవిమానము
లనుపమగతి లెక్క కెక్కుడై విలసిల్లున్. 183

మ. హరిణీనేత్రలు సింహమధ్యలు శుకీ
వ్యాహారిణుల్ కంబుకం
ధర లంభోదవినీలవేణులు శర
ద్రాకేందుబింబాననల్
కరిణీయానలు పల్లవోష్ఠలు తటి
ద్గౌరాంగు లాప్రోలిసుం
దరు లావృత్తపయోధరల్ నటనగాం
ధర్వప్రవీణల్ గడున్. 184

వ. కడిందిబలంబు గలదేని యచ్చటికిం జని సాధింపు మని పల్కిన నద్దేవమునిం జూచి యతం డవ్వైకుంఠపతి నల్ల గెల్చెద విజయానందసందోహశాలి నగు నన్ను వీక్షింపు

మని పల్కి యతని ననిచి మణికాంచనమయంబును
ముక్తావితానసంయుక్తంబును రత్నతోరణాభూషితంబును
గంబరాగశిలాబద్ధరంజితంబును రత్నసోపానమండితం
బును యోజనాయామవిస్తారంబును త్రిభువనసారవస్తు
ప్రశస్తవిభవలంబును తేజోమయంబును నైన నిజసభాభ
వనంబున రత్నసింహాసనాసీనుండై యొక్కయెడ సనక
సనందన వసిష్ఠ వాలఖిల్య పులస్త్య పులహ క్రతుము
ఖ్యులును నొక్కయెడ యక్ష గంధర్వ దేవగణంబులు
నొక్కయెడ మహీపాలురును నిజముఖవిన్యస్తదృష్టులై
ప్రాంజలిసగౌరవంబులరీతిం గొలువ వేత్రహస్తులు
సాహోనినాదంబుల నాచ్చరింపఁ బేరోలగం బుండి
రక్కసులం జూచి యిట్లనియె. 185

తే. ఏను వైకుంఠపురముపై నిప్పుడు దాడి
వెట్టి తద్విభు గెల్చి యవ్విభవవితతిఁ
గొని యథేప్సితభోగంబు లనుభవింతు
నీయుపాయంబు నారదుఁ డెఱుఁగఁ జెప్పె. 186

క. లోకంబుల బలవంతుఁడు
నాకంటె నొకండు గల్గె నా విని చిత్తం
బాకరఁగి సుస్థితం బగు
జోకగ సుఖనిద్ర యెట్లు చొప్పడు నాకున్. 187

వ. అని పలికి. 188

క. అభియాతిగర్వభిద్దుం
దుభి సబలుఁగఁ బనిచి దంతి తురగరథాళీ
సుభటావృతుఁ డై దనుజ
ప్రభుఁడు గదలె నతులబలపరాక్రమ మెలయన్. 139

వ. అర్ణవపరివృతుం డైన వరుణుండునుంబోలె ననేకసహ
స్రాక్షౌహిణీయాతుధానబలపరివృతుండై చని నాకంబును
సత్యలోకంబును నతిక్రమించి విష్ణులోకంబైన వైకుం
ఠంబుఁ దఱిసి తత్పురోపకంఠోపవనంబుల నకుంఠితో
త్కంఠ దీపింప విడిసిన. 140

తే. అపుడు పురవాసు లాతెఱం గరసి కోట
గవను లిడి తాళము లొ్యిచి ఘనతరాయు
ధార్గళంబులు గట్టిగా ననువుపఱిచి
ద్వారసంరక్షణస్థితిఁ దనరి రంత. 141

తే. ఉపవనంబులు భంజించి యుగ్రదనుజు
లపుడు శతయోజనోన్నతం బైనకోట
యెక్కఁజాలక యాచుట్టు నొక్కమొగిని
విడిసి యుక్కునఁ బీడ గావింపఁ గాంచి. 142

వ. తత్పురరక్షకు లైన పార్షదవీరవరు లనేకకోటు లశనిప్రా
యంబు లైనయంగారంబులు వర్షించుశతఘ్నిప్రముఖ
శతసహస్రాయసపరుషయంత్రంబులు పన్నియు లోష్ట
పాషాణవర్షం బగు దంచనంబు లెత్తియుఁ దప్త తైలకటా

హంబులు నిలిపియు ననేకసైన్యంబులఁ బ్రాకారంబుల
చుట్టు రక్షణార్థంబు నిలువ నియమించియు వ్యూహ
నాథు లగు ప్రద్యుమ్నానిరుద్ధవాసుదేవసంకర్షణులరయు
ద్ధకుం జని యిట్లనిరి. 143

మ. ఘోరాకారులు లంబనాసికు లతి
క్రూరు ల్మషీవర్ణు లం
గారాక్షుల్ వికృతైకకర్ణచరణు
ల్గవ్యూతితుంగాంగకుల్
శూరు ల్దైత్యులు జంగమాద్రు లన నె
చ్చోనుండియో వచ్చి ప్రా
కారప్రాంతవనాంతరద్రుమతతుల్
ఖండించి రత్యుగ్రతన్. 144

క. వాహిను లంతటఁ బోవక
బాహాబలలీల వెలయఁ బ్రాకారం బా
రోహించి ఘోరయంత్రిక
లాహతులను నొచ్చి చుట్టు నలమిరి వఱచియుఁ. 145

క. ఆరాక్షసనేన లకూ
పారముగతి నవధి లేక భాసిల్లి చతు
ర్ద్వారంబు లందు నిల్చి ర
పారబలుల్ దృఢకవాటపాటనపటిమన్. 146

ఆ. పూర్ణశీతభానుపొలుపున ధవళాత
పత్ర మబ్బలాధిపతికి నమరె
వ్యజనవీజనముల వలరెడు నద్దురా
త్మకు నుపేక్ష సేయఁ దగునె మీకు. 147

వ. అని తెల్పిన వార లిట్లనిరి. 148

తే. వెఱవకుఁడు పురరక్షఁ దేమఱక సల్పు
డితఁడు ప్రహ్లాదుఁ డను దైత్యపతి రమేశ
దత్తసామ్రాజ్యుఁ డయ్యుఁ బ్రమత్తుఁ డయ్యె
నతులభోగమదోన్మత్తుఁ డగుటకతన. 149

క. శ్రీమదాంధ్యసుదాంధులు
కామాంధులు నొక్కటే యకార్యముఁ గార్యం
బేమియుఁ గానరు సౌఖ్యం
బీమహిఁ గోరుదురు హితుల నెల్లఁ గంగల దే. 150

వ. రాక్షసులకు నధర్మగుణంబు లై నద్దికం బని పల్కి వార
లప్పుడ యసంఖ్యాతబలసమన్వితులై చని పురరక్షను
లం దలపడి రంత. 151

క. సరిపోరి రుభయసేనలు
శరముద్గరపరిఘపరశుశస్త్రాస్త్రములం
గరి కరి హరి హరి యరదం
బరదము భటుఁడు భటుండు నతిరోషమునన్. 152

వ. అంత వాసుదేవుండు ప్రహ్లాదునిఁ బ్రద్యుమ్నుండు
విరోచనుని సంకర్షణుండు బలి ననిరుద్ధుండు బాణుని
మార్కొని ద్వంద్వయుద్ధం బొనరించి యనేకశస్త్రా
స్త్రంబుల నొప్పించి విరథులం గావించి సమరపరాఙ్ము
ఖులం జేసి తక్కటిసేనలకుం గవిసి వజ్రంబునం గదలి
తరుమండంబులం ద్రొంచులీలం బడవైచి విజయంబు
సేకొని మరలి పురంబున కేతెంచి వ్యూహనాథులు
లక్ష్మీకాంతునకుఁ దద్వృత్తాంతం బాద్యంతంబును విన్న
వించిన నబ్భగవంతుం డిట్లని యానతిచ్చె. 153

మ. నరసింహాకృతిచే హిరణ్యకశిపు
న్మర్దించు నవ్వేళఁ ద
త్పరివారంబగు దైత్యబృందములు మ
త్ప్రాంతంబున నిల్వలే
క రయోదగ్రతఁ బాఱి రాఖిలులు లో
కంబు ల్వాతం గుంద దు
ర్భరబాధాకరులైరి మీఱి భువికిన్
భారంబు సరద్ధిల్లఁగన్. 154

తే. వారి నేరితిఁ దునుమంగ వలయు నొక్కొ
యనుచుఁ దలపోయ నారదమునివరేణ్యు
ప్రేరణంబునఁ బ్రహ్లాదుఁ డీరసమున
భోగమదమత్తుఁ డగుట వేవేగ వచ్చె. 155

క. ఈదనుజపభుఁ డగుప్ర
హ్లాదుఁడు మద్భక్తియుక్తి నలరియు రాజ్య
శ్రీదప్పితుఁడై జ్ఞానం
బేది బలాన్వితుఁ డగుచు నిట్లరుదెంచెన్. 156

వ. కల్యాణగుణాస్పదు లైన మద్భక్తులకు నేన గతి దుర్గతిం
బొంద నర్హులు గారు కావున మీరలు మదీయం బైన
యాయుధపంచకంబుఁ గొని చని ప్రహ్లాదుండుదక్కఁ
దక్కినరక్కసుల నుక్కడంచి యతనిపై శంఖోదకంబు
చల్లి సుజ్ఞానవంతుం జేసి చనుదెం డనిన వారలు నట్ల
మరలి వచ్చునెడ. 157

సీ. అసురాధిపతియు నిజానీకినుల నెల్లఁ
బురిగొల్పి వారితోఁ బోరొనర్పఁ
గదిసి యథాపూర్వగతి ద్వంద్వయుద్ధమ్ము
విలసిల్లె గజముల బృంహితములు
వాజిఘోషలు రథవరనేమినినదంబు
వీరులయట్టహాసారవంబు
పృథుధనుష్టంకారభేరీవిరావముల్
గగనదిగంతరగహ్వరములు
నిండ శరకుంతముద్గరభిండివాల
తోమరాద్యాయుధంబులఁ దుములసమర

మాచరించిరి యిరువాగు నపుడు బలర
జోంధకారంబు దిక్కుల నాక్రమించె. 158

సీ. అపుడు వ్యూహాధినాయకులు రాక్షసయూథ
నాథులఁ గ్రోధసనాథు లగుచుఁ
గొందఱు నందకకూరధారాహతిఁ
గొందఱు శంఖనిర్ఘోషనిహతి
శార్ఙ్గధనుఃక్షిప్తశరవృష్టిఁ గొందఱ
నటఁ గొందఱ సుదర్శనాభిహతిని
బ్రతతకౌమోదకీప్రహతులఁ గొందఱఁ
బరిమార్చి ప్రహ్లాదు విరథుఁ జేసి
దర్పితుని వానిఁ బుత్రపౌత్రప్రపౌత్ర
సహితముగఁ గట్టి తెచ్చి పార్షదులు వొగడ
విజయమంగళశాహాళవితతి మొరయ
జితవిరోధులు డించిరి క్షితిభరంబు. 159

తే. అంత లజ్జితుఁ డైన ప్రహ్లాదుఁ జూచి
వాసుదేవుఁడు దరహాసభాసురాస్యుఁ
డగుచు నీజ్ఞాన మెచ్చట నడఁచి తౌర
భోగమత్తుఁడ వై మూఢబుద్ధిఁ దనరి. 160

క. అని శంఖతీర్థజలమా
యనస్త్రైఁ జల్లుటయు ననఘుఁ డై యతఁ డజ్ఞా

సనివృత్తుఁ డయ్యె మధుభం
జనుకృపఁ గనుహారలకును జడమతి గలదే. 161

వ. ఇట్లు జ్ఞానవంతుండై ప్రహ్లాదుండు వాసుదేవునిం గనుం
గొని దేవా నాయపరాధంబు క్షమియింపుము దానవు
లకు బుద్ధి గలదే వారలు ధార్మికు లని విశ్వసింపం
దగదు చాపల్యంబును బాపకారిత్వంబును స్వామిద్రో
హంబును నసహిష్ణుత్వంబును మొదలైన సహజగుణంబులు
దురాత్ములకు ధర్మగుణంబును స్నేహంబును వాత్సల్యం
బును బంధుత్వంబును గలుగనేర్చునే యని దండప్రణా
మం బాచరించి యతనిచే ననుజ్ఞాతుండై నిజరాజ్యం
బున కేతెంచి పుత్త్రుం డగు విరోచనుని రాజ్యంబున
కభిషిక్తుం జేసి వీతరాగుండై హరిపూజ సేయుచుఁ గృతా
ర్థుం డయ్యె నిది ప్రహ్లాదుచరిత్రంబు దీని వినినం జది
విన సర్వపాపంబులు దొలంగు నని చెప్పిన. 162

తే. విని బలాసురదమనుఁ డో యనఘవర్య
శ్రీవరాహనృసింహులచేతఁ బొలిసి
దితిజు లిద్దఱు నేమైరి తెలియఁజెప్పు
మనినఁ జిత్రశిఖండినందనుఁడు పల్కె. 163

క. వారలు వెండియు దానవు
లై రావణకుంభకర్ణు లనఁ బుట్టుదు రి.

ద్ధారుణిఁ గైకసి యను సుర
నారీమణికిం బులస్త్యునకుఁ గ్రూరాత్మల్. 164

క. వారలకు ననుజయై తగు
దారుణముఖి శూర్పణఖ మదనగురుభక్తి
శ్రీరమ్యుఁ డంత గల్గు ను
దారుండు విభీషణుండు దత్సోదరుఁడై. 165

ఆ. కడిఁది కుంభకర్ణుకాయంబు త్రిశతయో
జనసమున్నతంబు శక్ర వినుము
బ్రహ్మకడకు నొక్కపర్వకాలంబున
జనకుతోడ నరుగుచునుఁ దలఁచు. 166

ఉ. ఆతనిఁ జూచి బ్రహ్మయు భ
యాతురుఁడై కను తెల్ల మూసి నీ
వేతటి వచ్చినట్టివని
యెయ్యది తెల్పు మనంగ నబ్జసం
జాతునితోడ నిర్దయ రొ
సంగు ఘటశ్రవుండు తోడఁబోయి తా
నాతఁడు నిద్ర యిమ్మనిన
నబ్జజుఁ డట్ల యొసంగె నప్పుడున్. 167

ఆ. అపుడు వానిజనకుఁ డతిదుఃఖితుం డైన
నబ్జగర్భుఁ డీతఁ డాతనెల్ల

క్రొక్కారెడు లేచు నురుభుజబలయుతుం
డనుచు నిల వొసంగఁ జను నతండు. 168

ఉ. రావణకుంభకర్ణులు ది
రంబుగ నుగ్రతపంబుసేసి వా
ణీవరుచే వరంబుగొని
నిర్జరమానవదానవావళిం
జేపడి నుక్కడంతు రట
శ్రీదుని గా దని యాతఁ డేలు లం
కావరపట్టణంబు గొని
క్రౌర్యమునన్ వసియింతు రచ్చటన్. 169

ఉ. ఆవరపట్టణంబు మణి
హార్మ్యవితానవిరాజితంబు న
ప్రావరణప్రకాండసము
దంచితకాంచనచిత్రగోపురం
బావృతసింధుబంధురము
నై విలసిల్లి త్రికూటనామక
గ్రావమునం జెలంగు సుర
రాజ సురాసురదుర్విభేద్యమై. 170

ఉ. ఆదనుజాధినాథునిప్రి
యాంగన మంగళగాత్రి యొప్పు నాం

దోదరి నాఁగఁ దత్సుతుఁ డ
మోస్నతుఁ డింద్రజిదాహ్వయుండు ని
న్నాదనుజుండు గెల్వఁగలఁ
డాదశకంఠునియూథపుల్ ప్రహ
స్తాదు లవక్రవిక్రమస
మగ్రు లుదగ్రబలాఢ్యు లెన్నఁగన్. 171

ఆ. నిజసమాను లైన రజనీచరావళి
బలసి తను భజింపఁ బంక్తికంఠుఁ
డఖిలలోకములకు నార్తి యొనర్చ ని
ర్జరులు విష్ణుకడకు నరిగియంత. 172

క. నతులు న్నుతులుం జల్పిన
వితతకృపాదృష్టి వారి వీక్షించి జగ
త్పతి గుశల మడుగ రావణ
కృతబాధలు దెల్పుదురు రమేశ్వరుతోడన్. 173

చ. దనుజుని యుల్నదాగతి స
దా కసవ్రూఁదుచు నంబుదంబు లిం
పునఁ గలయంపిఁ జల్లు శిఖి
పొందుగఁ బాక మొనర్చుఁ జందురుం
డనుపమతాపహారి యగు
నాఁగి నిదాఘమునందు మాల్యముల్

ద్దనుజునియెడ భయమేఁటికి
వినుఁడీ రచియింతు నౌక్యవృత్తాంత మిఁకన్. 178

ఉ. పూతమనీషి పంక్తిరథ
పుత్త్రుఁడనై జనియింతు రామవి
ఖ్యాతిఁ జెలంగి లక్ష్మణస
హాయతఁ గౌశికు యజ్ఞపాలసం
జాతతఁ జేసి గౌతముప్రి
యాంగన శాపవిముక్తఁ జేసి నే
సీతఁ బరిగ్రహింతుఁ బుర
జిద్వరచాపము వంచి మెల్పునన్. 179

తే. పరశురామునిఘనబాహుబలముఁ గుంచి
దూషణుని ఖరుఁ ద్రిశిరునిఁ దుంచి యంట క
బంధుఁ బొలియించి పంకజబంధుతనయు
నేలి వాలి జయించి యింపెసఁగ నంత. 180

ఉ. భ్రాతృసమేతు నాదివిజ
బాధకు రావణు సంహరించి సా
కేతపురంబుఁ జేరి ముని
కీర్తితకీర్తిఁ జెలంగి పొంగి నే
ఖ్యాతనయాన్వితుండ నయి
భూతల మేలుదుఁ బన్నొకండువే

లాతతవత్సరంబు లట
నాత్మపదంబున కేఁగుదెంచెదవ౯. 181

వ. అని పలికి భగవంతుం డంతర్ధానంబుచేయు, నిక్కడ వాల్మీకి రామాయణంబుగా రచియింపఁగలం డారామాయణశ్రవణపఠనంబుల దురితముక్తియు శుభావాప్తియు నగు నివ్వాల్మీకి యఖిలజగద్ధితార్థంబు తపంబుసేయుచున్నవాఁ డితనివలన భయంబు వలవ దని యనేక విధంబుల బోధించిన గురునివాక్యంబు లాకర్ణించి హృష్టచిత్తుండై సురపతి భీతిఁ దొఱంగి యగ్గురుం బూజించె ననిన విని శౌనకుండు రామాయణశ్రవణపఠనఫలంబుపదేశింపు మనిన సూతుం డిట్లనియె. 182

ఆ. వేదవేద్యుఁ డైన విష్ణుండు దశరథ
పుత్త్రుఁ డగుచుఁ బుడమిఁ బుట్టుకతనఁ
బొల్చె వేదవితతి రామాయణాకృతి
వామలూరుజన్మువలనఁ గలిగె. 183

క. గాయత్రీమంత్రాన్విత
మై యిరువదినాల్గువేల సమరిన శ్రీరా
మాయణము వినినఁ జదివిన
శ్రీయుతులకు నఘము డింపుఁ జెందు శుభంబుల్. 184

వ. ఇందుల కుదాహరణం బైన యొక్కయితిహాసంబు గల దది యెట్లనిన. 185

ఆ. విప్రవర్యుఁ డొకఁడు వేదవేదాంగపా
రగుఁడు గలఁడు దొల్లి రామభక్తుఁ
డామహామహుండు రామాయణంబు ప
ఠించు ననిశమును భుజించు వెనుక. 186

చ. అతఁడు ధనార్జనమ్మునకు
నై నిజశిష్యసమేతుఁడై ద్విజ
వ్రతతులఁ గూడి పోవుచు న
రణ్యపదంబున నొక్కచోట న
చ్ఛతరజలాంచితం బయిన
చారుతటాకతటంబునందుఁ దా
నతులబుభుక్ష నన్నవచ
నార్థము నిల్చెఁ గృతాత్మకృత్యుఁడై. 187

ఆ. వండి యుచితనియతి వడ్డింపుకొనువేళ
నచటివటతరువును నాశ్రయించి
మెలఁగు బ్రహ్మరాక్షసులు యతిరూపముల్
దాల్చి వచ్చి రపు డుదగ్రబలులు. 188

శా. కక్షాలంబితదండకుండికులు స
త్కాషాయవస్త్రావృతుల్
ద్రాక్షాతీతవచస్కు లచ్ఛతనులి
స్త్రస్వచ్ఛభూతుల్ యతుల్

వృక్షచ్ఛాయల నిల్చి యక్షసరముల్
నే పాణులం ద్రిప్పుచున్
భిక్షాం దేహి యటంచుఁ జేరి రఘురా
ట్పృథ్వీసురాభ్యాశమున్. 189

తే. యతికరంబున జల మిడి యంత భిక్ష
నొసఁగి నెండియుఁ దగ జల మొసఁగనలయు
నటఁ దదన్నము సురతుల్యంబు తజ్జ
లంబు లంబుధిసమము లై డంబు మీఱు. 190

క. కావున యతులకు నబ్జా
దేవుఁడు భిక్ష యిడి తృప్తిఁ దేలిచి తానుం
బావన మతి భుజియించె ధ
రావిబుధులతోడఁ దత్సరఃప్రాంతమునన్. 191

వ. అంత నతండు వాల్మీకికృతంబైన రామాయణంబు పఠి
యించుటకు నవ్వటభూరుహప్రాంతంబున నాసీనుండై
యున్నంత. 192

ఆ. మనము వీరి మిఱ్ఱింగ ననువు విచారింపఁ
దార వచ్చి యిచటఁ దారసిల్లి
రీవటాంతికమున నిది కార్యసిద్ధికిఁ
గారణంబు మనకుఁ గలిగె భుక్తి. 193

క. అని బ్రహ్మరాక్షసులు తమ
మనముల నూహించి వారి మన్నిగొనఁగ న

ల్లసఁ జనుచో నవ్విప్రుం
డనఘుఁడు రామకథఁ జదువ నాయితపడుచున్. 194

ఆ. [illegible] సేమముచే
[illegible]లోకమానసీయు
[illegible] రాము
మానోఁ గొలుచుఁ గీర్తింతు నిష్ఠుడు. 195

ఉ. రంగదభంగమాగళిత
రంగభుజంగముల నింగిగంగ నా
లింగన మాచరించుకొను
లీలఁ జెలంగెడువార్ధి దాఁటి సీ
తాంగనశోకభీకరద
వాగ్ని వెసన్ హరియించి లంకఁ ద
త్సంగతి నిగ్రహించు సుర
సన్నుతుఁ గొల్చెద నాంజనేయునిన్. 196

క. ఎచ్చట రామునికథ దగు
నచ్చట సుఖవారిపూరితాత్ముం డగుచున్
నిచ్చలు భక్తిన్ మ్రొక్కెడు
నచ్చతురుని వాయుపుత్త్రు నభివర్ణింతున్. 197

ఆ. అనుమ నాండిఁ జదువ యతిపేషధరు లయి
చేరి విప్రవరులచెంత నున్న

పాఱుటసుర లెల్లఁ బఱచిరి భీతిచే
నసిలసూనుపేరు వినినమాత్రి. 198

క. హనుమంతునకుం బీఠం
బనువుపఱచి చదువఁదొడఁగె నతఁడు పవిత్రిం
బును ముక్తిదంబు నగు రా
మునిచరితం బఖిలభూతములు వెఱఁగొందన్. 199

తే. శ్రోతృజనరంజనప్రౌఢి నాతఁ డిట్లు
చదువుచున్నంతఁ దత్కథాశ్రవణకలన
నలరి బహుపాన్మహానోకహంబు డిగ్గి
వేగ చనుదెంచె బ్రహ్మరక్షోగణంబు. 200

శా. న్యగ్రోధావనిజాతసంశ్రయులు బ్ర
హ్మఘ్నుల్ మహాకాయు ల
త్యుగ్రాకారులు విప్రవేషు లఘుక
ర్మోద్యుక్తు లత్యంతసూ
క్ష్మగ్రీవాఢ్యులు బ్రహ్మరాక్షసు లుద
గ్రస్ఫూర్తి సేవించి యు
ష్యగ్రక్షోణి వసింప విప్రులు భయ
భ్రాంతాత్ములై రందఱున్. 201

వ. అంత నందుఁ బెద్ద యగు రక్కసుం డవ్విప్రునకు నిట్లనియె.

చ. వెలవఁగసేల మీతు ప్రభృతి
పీసురసత్తము యిప్పుఁ గాంచి యి

త్రజ్ఞ భవదుక్త రాఘవక
థాశ్రవణంబునఁ గాతుసత్వముల్
దొలఁగితి మింక మే మమర
దూతవినీతవిమానపంక్తి లిం
దలమును నెక్కి పోయెదము
నాకమునన్ వసియింప నింపునన్. 203

క. శ్రీరామాయణపఠనా
పారీణు న్నిన్నుఁ గాంచి భాషించి చనం
గోరి యురు కెంచితిమి నీ
కారుణ్యమె మముఁ బవిత్రగాత్రులఁ జేసెన్. 204

వ. సత్పురుషులతోడ సంభాషించుటయుఁ దత్సహవాసం
బును స్వర్గాపవర్గంబులకుఁ గారణం బగు దురితవిము
క్తియు నగు నిందులకు నేనె దృష్టాంతం బనిన విని
యవ్విప్రుండు మీ రెట్టికర్మంబున నిట్లు బ్రహ్మరాక్షసు
లైతి రని యడిగిన వారు డిట్లనిరి. 205

ఆ. వె. ఓమహానుభావ నే మును వేదశా
స్త్రార్థవిదుఁడనైన యువనిసుతుఁడ
లేమిచేత నోగిలి భామినీపుత్త్రులఁ
బ్రోవ వెరవు లేక పొలుపు దఱఁగి. 206

వ. తులాచార్యుండనై పదియార్వురుఋత్విగ్జనంబులు నేను
దులాపూరుషంబు పరిగ్రహించి యనంతధనవంతుండ

నై నితాంతలోభాక్రాంతమతిఁ బ్రివర్తిలుచు.     207

చ. అతిథులఁ బూజఁ దన్ప నిల
యాగతులైన యతీంద్రులన్ దిర
స్కృతి యొనరింతు నంజలియుఁ
జేయక కేవలదర్శవేళలన్
బితృతతికి న్నిపాపజల
బిందుల నైనను దృప్తినల్ప నె
నతులితలోభదీనమతి
నై ఖలవృత్తి మెలంగుదుం దగన్.     208

ఉ. శ్రీదవినోదసంపదఁ గు
సీదమహావ్యవహారమేదురా
మోదముసందడిన్ ధనస
ముత్కరవాంఛఁ జెలంగి [illegible]
వేదము శాస్త్రముం జదువు
వేడుక యూడిచి పుణ్యతీర్థయా
త్రాదులు దేవతార్చనము
నగ్నిసపర్యయుఁ జేయ మానితిన్.     209

క. గాయత్రి వేయిమారులు
పాయక నిత్యము జపింపఁ బాపము లడఁగున్
గాయత్రీమంత్రమునకు
నేయెడ నెక్కుడగుమంత్రి మిలపైఁ గలదే.     210

చ. పది జనియించు నేకజని
పాపము నూఱు జనింపఁ బూర్వజ
న్మకృతము వేలంగు గరి
మంబున వేయిటినిం జనించినం
గను రుయుగత్రయోపచిత
కల్మషము న్బొలఁగించు మంగళా
స్పద యగు వేదమాత ఘన
పాతకజాలవనాగ్నికీలనౌ. 211

ఆ. వె. అనఘ వేదజనని యైనగాయత్రిక
సాధ్య మైనపాపచయము గలదె
యాజపంబు నల్పు నతఁడు జీవన్ముక్తుఁ
డధియుఁ జేయనేర నైతి నకట. 212

వ. ఉగ్రదానప్రతిగ్రహంబుకంటెం గర్మవర్జనంబునం బా
పంబు ద్విగుణంబయ్యెఁ దత్కారణంబున బుద్ధ్యైకసహి
తంబుగా బ్రహ్మరాక్షసుండనై యిమ్మఱ్ఱి నాశ్రయించి
దురంతక్షుత్పిపాసాతురతం బరిభ్రమించుచుండితి. 213

క. ఇట మునుపట నొకనాఁడి
వ్వటనికటము చేర విప్రవర్యుఁ డొకఁడు వ
చ్చుటయుం గనుఁగొని యేము
లిట మతి నతని వధింపఁ దలఁచితి మంతన్. 214

క. అపు డతఁడు జితేంద్రియుఁడుం
జపశీలుఁడు ధర్మయుతుఁడు సదయాత్ముఁడు గ
ర్మపరుండు నగుటఁ జేరక
యపారభీతిం దొలంగి యరిగిరి కొనన్. 215

వ. శ్రుతివిరుద్ధకర్మంబులును విధిహీనం బగుకర్మంబులుఁ జే
యువారలఫలం బనుభవించుచుందుము మఱియు. 216

తే, గీ. అలికి ముగ్గు ఘటింపని యవనియందు
జనులు భుజియించు నన్నరసంబు మేము
మున్ను మెసఁగుదు మన్నిరసాన్నమంత
జనులు భుజియించిపోవుదు రనఘవర్య. 217

వ. ఇ ట్లున్నవారము బ్రహ్మకల్పంబునందుం బాయని మా
దురితంబు రామాయణశ్రవణకారణంబున నష్టం బయ్యె
నని పల్కి యవ్విప్రులు గనుంగొన దారుణశరీరంబులు
విడిచి దివ్యదేహంబులు ధరియించి విమానంబు లెక్కి
నాకంబునకుం జని రంత నాభూసురుండు నచ్చెరువు నొం
దుచు యథేచ్ఛం జనియె నని సూతుం డాకింగించిన. 218

తే. గీ. అంత నాశౌనకాదు లోయనఘచరిత
రావణుఁడు కుంభకర్ణుఁడు రాముచేతఁ
బొలిసి యెచటఁ జనించిరి తెలుపు మనిన
సూతు డి ట్లని పలికెఁ బ్రఖ్యాతఘనత. 219

క. ధారుణిఁ బుట్టిరి వెండియు
వారలు శిశుపాలదంతవక్త్రాహ్వయులై
వారిఁ దునుమ యదుకులమున
శ్రీరమణీశ్వరుఁడు పుట్టె శ్రీకృష్ణుండై. 220

వ. శిశుపాలుండునుదిరినేత్రచతుర్భుజంబులతోడ నుదయించిన,

ఆ. ఎవ్వఁ డెత్తుకొనఁగ నివ్వాలు వికృతవే
షం బడంగు నతఁడె చంపు వీని
ననిన నారదోక్తి విని తల్లి యుండఁగ
చేతి కిచ్చుచుండెఁ జెలువదాని. 222

క. ఒకనాఁడు గృష్ణుఁ డయ్యీ
ర్భకు నంటఁగ నెక్కుడగు కరంబులు నిటలాం
బకమును నడంగె హరి వా
నికి నరి యగు నని తదంబ నిజమతిఁ దలఁకన్. 223

తే. హరికి మేనత్త యైన యాహరిణనేత్ర
తనయు మనుపు మటంచుఁ బ్రార్థన మొనర్పఁ
గ్రమగతి శతాపరాధముల్ గుడు రాణసత్తు
ననుచు నానతి యొసఁగె నాయనఘమూర్తి. 224

సీ. హరి దేవకీపుత్రుఁడై నందగోకులం
బున నిల్చి పూతన మనికి మాన్చి
శకటతృణావర్తబకమహాఘగరవ
త్సాదులం దునిమి దావాగ్ని యార్చి

కాళియాహిఁ బుఁ దోలి కేల గోవర్ధన
గిరి మెత్తి ధేనుకాసురు వధించి
జంగమస్థావరసకలప్రపంచంబు
వేణుగానామృతవృష్టిఁ దన్పి
సద్వశామధ్యమత్తగజంబువోలె
సఖలగోపాంగనావృతుఁ డగుచుఁ దనరి
యర్కకన్యాతటాంతవనాంతరమున
రాసకేళిమహోల్లాసభాసి యయ్యె. 225

వ. అనిన విని శౌనకాదు లాగోపకాంతలు మోహాక్రాం
తలై హరిం గూడి క్రీడించుటకుఁ గారణం బెయ్యది
దెల్పు మనిన సూతుం డిట్లనియె. 226

క. నీలేందీవరసురవర
నీలఘనశ్యాము రాము నిర్జరనుతు సీ
తాలక్ష్మణయుతుఁ గనుఁగొని
శ్రీలక్ష్మియు మునులు మోహశీలితమతు లై. 227

వ. ఒక్కనాఁడు దండకారణ్యవాసి యగు నద్దేవునిసన్నిధి
కేతెంచి యిట్లనిరి. 228

శా. నీసౌందర్యవిలాసభాసురతనూ
నిర్వంచనాలింగనా
శ్రీసౌఖ్యం బెదఁ గోరి వచ్చితిమి ని
ర్ణిద్రానురాగోద్ధతిం

ప్రాసూనాంబకశంబబాణహతి ధై
ర్యస్ఫూర్తి యూఁటాడె మ
మ్మోసత్త్వశ యనంగసంగరసము
ద్యోగాబ్ధి నోలార్చునే. 229

ఆ. అనినఁ జెవులు మూసికొని రాముఁ డమ్ముని
నరులఁ జూచి పురుషుఁ బురుషుఁ డెందుఁ
గనయునింత గలఁడె ననని జాతిభ్రంశ
కాఖ్యమైన దురిత మది తలంప. 230

వ. అదియునుంగాక బాల్యంబునం బలాత్కారంబున నజ్ఞా
నంబునం జేయంబడు పాపంబునకు నిష్కృతి గలదు
గాని బుద్ధిపూర్వకంబుగం జేసిన పాపంబునకుఁ బ్రాయ
శ్చిత్తంబు గలుగనేరదు విశేషించియు మీరు మునిశ్రే
ష్ఠులు జ్ఞాననిధులు నగుట నిట్టివిరుద్ధమనోరథంబు మీకుం
గొఱగాదు తపోధనంబు రక్షించుకొనుండు చనుం డని
పల్కిన వార లిట్లనిరి. 231

ఆ. నీయనుగ్రహమున నిఖిలబంధమ్ములు
నూడిపోవు నింక నొండుబంధ
మెట్లు గల్గు మాకు నే మెట్టు లయినను
నిన్నుఁ జెందెదము వినీలదేహ. 232

తే. ఈశ్వరుఁడ వవ్యయుండవు శాశ్వతుఁడవు
సర్వగతుఁడవు గర్తవు సర్వసాక్షి

వసథు నీయాత్మ మెఱుఁగని యపూర్వ బుద్ధి
మామనోరథ మీడేర్చి మనుపవలయు. 283

క. అనిన విని రాఘవుం డా
మునులం గని యాదిపురుషుఁడగు కృష్ణుఁడనై
జనియింతు వఘువు మీరా
రినకోరిక దీర్చి మీకుఁ బ్రీతి ఘటింతున్. 284

క. మునులార మీరు గోపాం
గన లయి జనియించి నన్నుఁ గవయుఁడు మీరుం
గన వెల్ల ధేనుగణమై
గనిమెదరు మదీయకరుణఁ గల్యాణమతిన్. 285

తే. అని పలికి పద్మపద్మయాసనముఁ జూచి
నీవు రుక్మిణివై జనియించు మధుర
యువనిపుల గెల్చి నినుఁ బెండ్లి యగుదు నందు
నగు మదీయాంగసంగసౌఖ్యంబు నీకు. 286

వ. అది గావున నేకపత్నీవ్రతస్థుండనైన నే నిన్నుఁ బ్రీతిప్పుడు
వరియింతు ననినఁ గోపించి లక్ష్మీదేవి యిట్లనియె. 287

ఆ. నీమనోహరాంగనిత్యసౌఖ్యంబు నే
నభిలషింప నన్నుఁ నాదరింప
వైతి నీమనంబు రాతిది నీవును
రాయివై వసింపు రఘుకులేశ. 288

వ. అనిన రామభద్రుం డిట్లనియె. 289

శా. నీలేందీవరదామసన్నిభ! వినుమా
 నీపల్కు తథ్యంబుగా
సాలగ్రామశిలాకృతి న్నెలఁగెడన్
 శశ్వత్పవిత్రస్థితిన్
మేలై సర్వజగద్ధితార్థముగఁ ద
 న్నిర్మాల్యలేశాప్లుతిం
జాలం గల్గు నశేషతీర్థసలిల
 స్నానక్రియాపుణ్యముల్. 240

మహాస్రగ్ధర. ఆసాలగ్రామదానం బఖిలభువనదా
 నాదిపుణ్యైకతుల్యం
బానక్తి న్నను శంభుం డజుఁడును నిజమ
 ధ్యస్థితిన్ లీలఁ గ్రాలన్
భాసిల్ల న్నిచ్చ లంటన్ బలసి తవుల ని
 ష్పాట నీటం దొలంపం
దానవ్యుచ్ఛిద్ధవృత్తిం దనరు నెపుడు త
 త్ప్రస్తరం బంబుజాక్షా. 241

ఆ. అట్టి దివ్యశిలకు నావాహనంబు ను
ద్వాసనంబు లేదు తదభిషేక
జలకణంబు తత్ప్రసాదంబు పాదజా
దులు గ్రహింపఁదగదు జలజనేత్ర. 242

వ. అని పల్కి రామదేవుండును వారల నందఱ ననిచి యుక్తే

చ్ఛం జనియెఁ దత్కారణంబునం గృష్ణుండు ప్రేతలం
గూడి క్రీడావినోదంబులం గ్రీడించె నంత. 243

క. కంసప్రేరితుఁ డగుచు నృ
శంసుఁడు కేశి యను రజనిచరుఁ డశ్వంబై
హింసామతి రాఁగ యదూ
త్తంసుఁడు ఖండించి వైచెఁ దత్తనువు ధరన్. 244

ఆ. అంతఁ గృష్ణుఁ బిల్వ నక్రూరుఁ డక్రూర
మతిఁ జెలంగ నందు మందిరమున
కరుగుదెంచెఁ గంసుఁ డనుపంగ గోదోహ
నావసరమునందు సర్వగతిని. 245

క. అక్రూరచరితుఁ డగుహరి
యక్రూరునిప్రార్థనమున నగ్రజయుతుఁడై
విక్రమసంపద వెలయ మ
హాక్రూరునిఁ గంసుఁ దునుమ నరిగె మధురకున్. 246

ఉ. హరిరథాధిరూఢుఁ డయి
యంబురుహాంబకుఁ డంబుదాభుఁ డ
క్రూరుఁడు తోడ రా మధుర
కుం జనుచు న్నిజవిశ్వరూప మిం
పారఁగఁ జూపి యాతనిఁ గృ
తార్థునిఁ జేసెఁ గళిందనందనీ

సారససంచరన్మధుప
జాలసమంచితగానలోలుఁ హై. 247

తే. అంత సాయాహ్న సమయంబునందుఁ దత్పు
రాంతికోపవనావని నధివసించె
వనజనయనుఁ డవ్వార్త కంసునకుఁ దెల్పి
చనియె నక్రూరుఁ డాత్మీయసదనమునకు. 248

క. అరుణోదయమున సీరియు
హరియుం గృతకల్యకృత్యు లయి నిరతిశయ
స్ఫురణంబున నా మధురా
పురికిం జని రాజమార్గమున వచ్చుతఱిన్. 249

మ. మదమత్తద్విపరాజయానల లన
న్మాణిక్యభూషాఢ్యలన్
సదనన్మధ్యల సంచరత్తుహినకృ
ష్ణద్యుమ్నభృదచ్ఛాంగలన్
మృదులశ్యామపిశంగవాసల దర
స్మేరాస్యలం దత్పురీ
సుదతుల్ సూచిరి రామకృష్ణుల సుధాం
శుబద్ధరోచిష్ణులన్. 250

ఉ. వీథుల వీథులందు నలి
వేణులు వేణువినోదిఁ జూచు చం

భూధరచుంబిచంద్రమణి
పుంజితరంజితహైమవిస్ఫుర
త్సౌధము లెక్క వారికను
దమ్ములు శోభిల నల్లగల్వలన్
మాధవుఁ డేఁగుదేర గరి
మంబునఁ దోరణ గట్టిరో యనన్. 251

క. అజ్ఞాతగంధి యపు డొక
కుబ్జాంగన గంధసారకుంకుమపరిపూ
ర్ణాబ్జమణిపాత్రి మరుణక
రాబ్జంబునఁ బూని చనఁగ హరి సరసోక్తిన్. 252

క. సేమం బొదవు స్నీకుం
గామిని మా కిమ్ము యక్షకర్దమ మన న
బ్భామిని మదిఁ బొదలి యదు
గ్రామణి సౌందర్యగరిమ గని విస్మితయై. 253

తే. చక్కఁదనమున వన్నెకు నెక్క దీవ
యలఁదుకొ మ్మని యొసఁగె నయ్యలరుఁబోఁడి
సాంద్రచందనచర్చానుచర్చఁ దేలి
హరియు నయ్యింతిఁ గరుణించు నాత్మఁ దలఁచె. 254

తే. అది స్వభావముచే నింతి యదియుఁగాక
దాసి యాచారవర్జిత దాని కొసరి

శ్రీవిభునిఁ బంచనముస నర్చించుసుకృత
మానసరోజాక్షిభాగ్య మే మనఁగవచ్చు. 255

తే. వాఙ్మనఃకర్మధర్మైకవర్తనమున
నలరి నిర్మలబుద్ధిచే నలిననయనుఁ
బూజసల్పినఁ గోర్కు లప్పుడ ఫలించు
గంద మొసఁగి త్రివక్రియుం బొందినట్లు. 256

తే. పూర్వజన్మంబునందు నపూర్వలీల
నెంత దప మాచరించెనో యీత్రివక్రి
కాకయుండిన భగవంతుఁ గంతుజనకు
నీశ్వరు గౌఁగిలింగి సిరిగంద మొట్లొసంగు. 256

చ తనదొరయానయుం దొలఁగి
తగ మాఱి వేఁడిన మానుషస్థితిం
దనరఁగ గంధ మిచ్చి వని
తామణి తా మనిశం శుభాత్మయై
యొసఁగి యదూత్తమోద్యమున
మున్నుతభక్తి మెలంగెనేని యా
మ్మనుజ నుమాధవుండును ర
మాధవుండుం గృపఁ జేవత్రికుందుగ్గె. 257

క. పై దలిపదమునఁ బదమిడి
యాదటఁ దచ్చుబుకసీమ వంగుళు లిడి తా

శ్రీదయితుండు నిగుడించిన
మోదంబున నదియు రుచిరమూర్తి వహించెన్. 258

తే. కుబ్జవంకలు దీర్చి కోర్కు లొసఁగి
యబ్జనాభుండు గంసునియంబరములు
మడఁకలుగఁ జేసికొని వచ్చు చాకురజకు
నడిగె మాకిమ్ము చేలమ్ము లనుచుఁ బ్రీతి. 259

వ. అరజకుండు రామకృష్ణుల కిట్లనియె. 260

ఉ. కోరఁగఁ జన్నె దుష్టమతిఁ
గోకలు బాలిశులార మీర లా
భీరులు గ్రామ్యవస్తువుల
పేరు నెఱుంగరు మీకు వన్య మా
హార మసారవల్కలము
లంబరముల్ వనచారు లౌట నీ
సారెకుఁ దప్పుఁ గాచితి వె
నం జనుఁ డిర్వురు జీవితార్థులై. 261

క. రాజార్హ దివ్యవస్తువు
లోజం గామింపఁగూడ దురుబుద్ధులకున్
రాజప్రతికూలకళా
యోజన తత్పుత్రమిత్రియుఁ మానఁదగున్. 262

క. నృపమంత్రిత కార్యంబుల్
కపటస్థితి బయలుసేయఁగా వలవదు త

స్థితిఁ బొలుపొందు నీచపశు
జీవనముల్ గడు మేలు వెండి సం
తతవిషభక్షణవ్యథయుఁ
డాఁ గడు మే లగు నెల్లభంగులన్. 106

వ. అనఘరింపుఁ డది యట్లుండె నట్లు గుఱిమ్మరునారదుం
జూచి కరుణాకరుండును భక్తవత్సలుండును నగు భగ
వంతుండు వృద్ధబ్రాహ్మణరూపంబునం జనుదెంచి వీణాయ
యున్నచో బ్బెటింగించి మాయాయవనికాపసరణం
బొనరించిన నతండును బ్రకృతిస్థుండై యనేకవిధంబులఁ
బ్రస్తుతించె నంతఁ బరిణయవీక్షాగతచతుర్దశలోకనివా
సులకు వివిధమణిభూషణాదు లొసంగి సత్కరించి యనిచి
గోవిందుం డారుందరుల నందఱం గూడి క్రీడింపం
దొడంగె వెండియు. 107

క. నాయింట నుండుఁ గృష్ణుఁడు
నీయింటం గలఁడె తెల్పు నెలఁత యనఁగఁ దా
నాయింటికిఁ జూపున్ సతి
శ్రీయుత సుఖపృచ్ఛసేయు శ్రీవల్లభునిన్. 108

చ. ఒకసతితో రమించు మఱి
యొక్కసతిం గడగూడి పల్కు నొం
డొకతరుణీమణిం గలసి
ద్యూతి మొనర్చు విలాసలీల వే

నొకసతిగేహసీమఁ దన
యుం గృప లాలన మాచరించు నొం
డొకసతికిం గృహోపకర
ణోత్కరముల్ ఘటియించు నర్మిలిన్. 109

సీ. ఒకయింటఁ బుత్త్రిని నుపలాలన మొనర్చు
నొకయింట భోజనయుక్తి నొనరు
నొకయింట సుతవివాహోద్యుక్తిఁ ద్రిమ్మరు
నొకయింట మధుమధురోక్తిఁ దనరు
నొకయింట గానరసోత్సాహరసికుఁ డౌ
నొకయింట సుఖనిద్ర యొనరఁ జేయు
నొకయింట సద్ధ్యాతి ముముక్షుపోషకుఁ డగు
నొకయింట సద్గోష్ఠి * నోలి మెలఁగు
షోడశసహస్రయువతులతోడ నిట్లు
క్రీడలాడుచు నుండె నాకేశవుండు
తన్మహత్త్వ మెఱుఁగంగఁ దరమె కమల
జాదిసురవరులకు సనకాదులకును. 110

క. ఈపావనకథఁ జదివిన
నోపికతో వినిన శుభసమున్నతిఁ జెలయుం
బాపసముచ్చయ మణఁగుం గుఱ్ఱా
శ్రీపతికారుణ్య మెలయు క్షితి మనుజులకున్. 111

---

*నోలి మెలంగు—పాఠాం.

సీ. అంత బాణాసురు నని గెల్చి తత్పుత్త్రి
యగునుషాకన్యక నర్హసరణి
నాత్మపౌత్త్రుండైన యనిరుద్ధునకుఁ బెండ్లి
గావించి యట ద్వారకాపురమున
నక్రూరవసుదేవహలధరోద్ధవముఖ్య
హితవృద్ధజనపురోహితసమేతుఁ
డై సుధర్మాఖ్య సభాంతరాళంబునఁ
జెలఁగి సింహాసనాసీనుఁ డగుచుఁ

గొలువు గూర్చుండి కవిబుధగోష్ఠి నలరు
నాయదూత్తముఁ బుండరీకాక్షుఁ జూడ
నమరనాయకుననుపున నరుగుదెంచె
నారదుఁడు గానవిద్యావిశారదుండు. 112

క. ఆనారదునకు వైద
ర్భీనాథుఁడు పూజ యాచరించినఁ బ్రీతుం
డై నుతియించి పదంపడి
యానిర్జరమౌని యిట్టు లనియె మృదూక్తిన్. 113

తే. దేవ శిశుపాలునాజ్ఞచే ద్విజులు మఖము
లాచరింపక దుర్మార్గు లైనకతన
క్షుత్పిపాసార్తిఁ గలఁగిరి సురగణములు
తత్పురోడాశభుక్తిచేఁ దనరలేమి. 114

తే. దేవ పంచమహాయజ్ఞతృప్తి లేమి
నఖిలమునిపితృసుర లనాహారకలన
నలఁగిరి ద్విజాళి స్నానసంధ్యావిహీను
లగుచు శ్రుతియుక్తవిధదూరు లగుటఁ జేసి. 115

క. భూదేవకర్మముల బ్ర
హ్మాదిసురలు తృప్తినొంది యతులితజవస
త్త్వాదిసమన్వితులై రో
గాదు లడఁగి దీప్తదేహు లగుదురు కడిమిన్. 116

ఉ. బాలిశబుద్ధి యైన శిశు
పాలుఁడు వేదవిరుద్ధకర్ములన్
లాలన మాచరించి మద
లంపటవృత్తి చెలంగు దాన దే
వాలయదేవతాప్రతిమ
లర్చ యొనర్పుజనంబు లేమి బ్రా
హ్మాలి మహిం బడెన్ ద్విజు ల
మాన్యత నొందిరి కర్మహీనులై. 117

వ. కావున నప్పాపాత్ముని సంహరించి లోకంబులు రక్షింపు
మని పురందరసందేశం బెఱింగించి యద్దివ్యముని వెం
డియు నాకలోకంబునకుం జనియె నంత నమరసభామ
ధ్యంబున నున్న పాండురా జతని కిట్లనియె. 118

తే. ఓమహాత్మ యుధిష్ఠిరభీమవిభుఁడు
నకులసహదేవనాములు నాదుసుతులు
నున్న శతశృంగపర్వతమున వసించి
రిపుడు వారిచ్చటికిఁ జని తెలుపఁగఁ జెపుమ. 119

వ. దేశాంతరగమనోద్యోగుండ నయ్యుఁ బుత్త్రమోహంబుఁ దొ-
ఱంగఁజాలకున్నవాఁడఁ గావునం దద్వృత్తాంతంబుఁ
దెల్పు మనుటయు నారదుం డిట్లనియె. 120

సీ. నీతనూజాతు లవారితోత్సాహుల
మానసంయమిసేవ్యమాను లగుచు
జనసేవమేతులై శతశృంగగిరినుండి
కరిపురి కేతెంచి కరము వేడ్క
సురసరిత్తనయవిదురలాలనంబులఁ జే
గురుకుమారాదులతోడఁ గూడి క్రీడ
లాడుచు నుండి రయ్యవసరంబున వార
లందఱిలోపల నధికబలుఁడు
బలయుతుం డాటఁ గాంచి పాండవుఁ దలంచి
వ్యాళములచేతఁ గఱపించి క్ష్వేళ మిడియుఁ
గృష్ణరక్షితుఁ డగువాని గెలువలేక
యాత్మలోఁ గుందె ధార్తరాష్ట్రాగ్రజుండు. 121

వ. ధృతరాష్ట్రుండును బుత్త్రమోహంబున దుర్యోధనుఁడు
సేయుకృత్యంబులు నివారింపఁడయ్యె నంతఁ గృపాచార్య

నొద్ద రాజకుమారు లందఱు విలువిద్యఁ గఱచుచునుండి
రయ్యెడ. 122

ఉ. పాండవకౌరవౌఘములు
పట్టణబాహ్యవనాంతరంబునం
గందుకకేలి సల్పునెడఁ
గాంచనరత్ననిబద్ధమైన యా
గంతుక మొక్కనూతఁ బడఁ
గాంచి తదుద్ధరణం బొనర్చ ద్రో
ణుం డను విప్రముఖ్యుఁడు ధ
నుష్కలితోరుపృషత్కపంక్తులన్. 123

ఆ. వేదశాస్త్రముఖ్యవిద్యాన్వితుని ధను
ర్వేదవిదుని ద్రోణు నాదరించి
భీష్ముఁ డాత్మపౌత్త్రబృందంబునకు నెల్ల
కార్ముకాదివిద్యఁ గఱపఁ బనిచె. 124

చ. అతఁడును రాజసూనులకు
నందఱకున్ వివిధాస్త్రశస్త్రసం
తతు లుపదేశ మిచ్చి ప్రథ
నప్రతిబాధ్యులఁ జేసి యంత ను
ద్ధతబల*వంతుఁ డైనద్రుపద
దక్షితిపాలకుఁ బట్టి తేర నం

*బత్తు — పాఠాం.

చిత్రగతిఁ బంచె వీరభట
  సింధురసైంధవబంధుకోటితోడ. 125

తే. తొల్లి తను నవమానించె ద్రుపదుఁ డనుచుఁ
బగ మనంబున నిడి వానిఁ బట్టి తేర
గురుఁడు పనిచినఁ బాండవకురుకుమారు
లందఱుఁ దదాజ్ఞఁ దలమోఁచి యరిగి రంత. 126

వ. ద్రుపదభూనాథురాజధానియైన కాంపిల్యనగరంబునకుం
జని యతనితోఁ బవరం బొనర్చి కర్ణసహితంబుగాఁ
బరాజితులై మరల నరుగుదెంచి రంత నర్జునుం డొక్క-
రుండును ద్రుపదుం బట్టి తెచ్చుటకుం బ్రతిజ్ఞచేసి చని
వానితో మహాయుద్ధంబుచేసి రోధించి పెడకేలు గట్టి
గురునకు దక్షిణగా నిచ్చిన. 127

సీ. గురుఁడును ద్రుపదుఁ గన్గొని యుల్లసములాడి
  విడిచిన నవ్వు డప్పుడమితేఁడు
తదు లజ్జితుండయి కాననంబున కేఁగి
  యచట దుష్కరతపం బాచరింప
హరుఁడు ప్రసన్నుఁడై యడుగుము వర మన్నఁ
  గుంభసంభవు గెల్చు కొమరు నొకని
నర్జునునకుఁ బత్ని యగుపుత్త్రి నొక్కతె
  నడిగి తద్వరమున ననలకుండ

మున జనించు ధృష్టద్యుమ్నుఁ [illegible]
గృష్ణ యనుకన్యఁ గాంచి ప్రహృష్టచిత్తుఁ
డయ్యె నయ్యింద్రతనయు బాహాపరాక్ర
మంబుఁ గొనియాడి రఖిలజనంబు లుర్వి. 128

చ. కరిపురవాసు లందఱును
కర్ణసుయోధనముఖ్యు లం దిర
స్ఫురణ మెసర్చి యర్జునుని
సాధితసద్గురుకార్యశౌర్యధీ
గరిమ నుతింపఁ జొచ్చిరి ని
కామముదన్వితచిత్తవృత్తులై
కెరలిన వీఁడు నన్నయిన
గెల్చు నటంచుఁ దలంచె ద్రోణుఁడున్.

క. సురసరిదాత్మజుఁ డప్పు డ
న్నరునిభుజాబలమునకు మనంబునఁ దగ న
చ్చెరు వంది నాదుపిమ్మట
నరిసూదనుఁ డితఁడె యనుచు నభినందించెన్. 180

ఉ. ఈవిధి నిందఱీసగాను [illegible]
యించఁగఁ గర్ణసుయోధనాదియో
ధావళి సిబ్బితిల్లఁగ [illegible]
[illegible] ధృతరాష్ట్రుఁడ న

త్యావిలచిత్తులై తెలుప
నాతఁడు పుత్త్రమతానువర్తియై
భావమునం దలంకి యట
పాండుతనూజులఁ జీరి యిట్లనున్. 181

ఆ. భూరితేజులార వారణావతపుర
వరమునకును మీర లరుగుఁ డదియు
నఖిలవైభవాఢ్య మై సస్యసంపూర్ణ
మగుచు ధర్మకృజ్జనాప్తి నలరు. 182

మత్త. వారణావతపట్టణంబు నివాసయోగ్యము మీకు నో
ధీరవిక్రములార మీర లతిత్వరం జని యందు నిం
పారఁ దద్విశదాఖ్యపాలనపర్వహారి నింపుఁ డనంగ న
వ్వీరు లప్పురి కేఁగి రక్కురుధీరముఖ్యనియోగతన్. 183

సీ. అపుడు సుయోధనుం డతికుటిలోత్సుకుఁ డై
సౌబలకర్ణదుశ్శాసనాది
మంత్రిదుర్మంత్రనిమంత్రణ వారణా
వతపట్టణంబున జతుగృహములు
రచియింపఁ బనిచె నారాజన్యు లయ్యిండ్ల
నేమఱియున్న దహింపఁదలఁచి
యంత సత్పాండవు లాలక్క యిండ్లలో
నధివసింపఁగ విదురానుమతిని

ఖనకుఁ డొక్కఁడు ధర్మజుకడకు *వచ్చి
క్రోధకీలితుఁ డైన దుర్యోధనుండు
సేయుదుర్మంత్ర మంతయుఁ జెప్పి వారు
వెలువడఁగ నొక్కబిలము గావించె నచట. 184

వ. కృష్ణాంగారకచతుర్దశినాఁటి నడురేయిఁ దద్బిలద్వారంబున జననీసహితులైన పాండవుల వెలువరించి ఖనకుం డరిగెఁ దదనంతరంబ యాలాక్షాగారంబున వారలు నిద్రించియున్నవార లని తలంచి. 185

చ. తొడరి సుయోధనప్రహిత
దూతజనంబులు తద్గృహంబు లు
బ్బడర దహించి రట్టితఱిఁ
గారసి పౌరులు సంభ్రమించి య
జ్జడమతు లైన సూతసుత
సౌబలకౌరవనాథముఖ్యులం
గడుకొని నిందసేయుచు ని
కామశుగార్తిఁ గలంగి రయ్యెడన్. 186

ఆ. అయుతదంతిసత్త్వుఁ డనిలతనూజుఁడు
నడువలేక నిదుర జడత నొందు
సోదరులను దల్లి నాడట మోచుక
యరిగెఁ జీకటనక యతిరయమున. 187

---

* కలిగి—పాఠాం.

చ. అనిలసుతుండు గందున మ
హావిపినంబున వీతభీతుఁడై
యనిలజవంబునన్ శ్రమము
నాఁకలి దప్పియుఁ జెంద కేఁగెఁ దాఁ
జనునెడ నూరువేగహతి
సాలలతావళి మ్రొగ్గి డిగ్గనం
బొనుఁగువడం బదాహతుల
పొందునఁ బ్రిస్తరపంక్తి నుగ్గుగన్. 138

తే. ఇట్లు యామద్వయంబున నిరువదేను
యోజనంబులుం గడచి సూర్యోదయావ
సరమునం దొకవటతరుచ్ఛాయ డించె
నన్నదమ్ములఁ దల్లి నయ్యనిలజుండు. 139

ఉ. అంత హిడింబ నాఁగ నొక
యాసురకామిని యేఁగుదెంచి దు
ర్దాంతబలాఢ్యు భీము నవ
తామరసాయతచారులోచనుం
గంతుమనోహరాంగుఁ గని
కాంతవకుంతనివీడితాంగియై
చింతఁ గలంగి యాయనకుఁ
జేతులు మోడ్చుచు నల్ల నిట్లనున్. 140

సీ. అనఘ యివ్వని హిడింబాసురుం డనునొక్క
  యసుర గెలందు సాయగ్రజుండు
భక్షణార్థము మిమ్ముఁ బట్టి తెచ్చుటకు న
  న్నినిచిన నిచటికి నరుగుదెంచి
నవయౌవనాంగుఁ గందర్పప్రతికాశ
  లావణ్యగణ్యవిలాసకలితు
నినుఁ గాంచి మోహించి నిలిచితి నాదుప్రా
  ణంబులు నీయధీనములు చేసి
కావున మనోజబాధితఁ గావు నన్ను
నిప్పు డాకూర్రదానవు నేపడంచి
కాననస్థలి నిష్కంటకప్రసిద్ధిఁ
దనరఁ జేయుము నీకు భద్రంబు లొదవు. 141

వ. అని పల్కునెడ. 142

ఉత్సా. అనుజ రాక మసలె ననుచు నసుర గినిసి దాని న
మ్మనుజవరుల నొక్కపెట్ట మన్పఁగానఁగఁ జేర న
య్యనిలసుతుఁడు వానిఁ దాఁకి యతులముష్టిహతుల న
ద్దనుజుతోడఁ బోరుసల్పె ధైర్యశౌర్యశాలియై. 143

వ. ఇట్లు కొండొకదడవు ఘోరయుద్ధంబుచేసి. 144

ఆ. అంత ముద్గరాభిహతి దధిభరభాండంబు
వగుల నడఁచులీలఁ బవనపుత్త్రుఁ

దశనికల్పము ల్పైపాతి హిడింబాసురుఁ
* మస్తకంబు వ్రచ్చి మడిచె నపుడు. 145

క. విజయం బీగతిఁ గైకొని
విజయాగ్రజుఁ డగ్రజునకు వినతుం డగుచున్
నిజజననియాజ్ఞచే నా
రజనిచరాంగన వరించి రతిఁ గరఁగించెన్. 146

వ. అప్పు డదియును. 147

మ. అచలప్రాంశువిశాలవిగ్రహుని శ
స్త్రాస్త్రౌఘనిష్ణాతుఁ గా
మచరుం బంక్తిశిరోఘసన్నిభు మహా
మాయున్ బలోదగ్రు రా
త్రిచరాగ్రేసరు వజ్రకర్కశతనున్
ధీరున్ గభీరున్ ఘటో
త్కచుఁ డన్ పుత్త్రునిఁ గాంచె భీముఁడలసన్
ద్రాఘిష్ఠబాహార్గళున్. 148

వ. అంత. 149

చ. జతుగృహము దహించి విల
సద్గతి ధార్తరాష్ట్రులు పోయి తెల్పఁ దు
ర్మతి యగు కౌరవప్రభుఁ డ
మ్మాతమ్ములు దానును సంతసించెఁ బ్రీ

* మస్తకం బగల్చి—పా॥

స్తుతమతు లైన పాండునృప
సూనులసేమము విన్కిఁ జేసి స
న్మతి విదురుండు సంతసిలి
మాటి మదిం దదుదంత మంతయున్. 150

సీ. అంత వేదవ్యాసువనుశాసనమునఁ బృ
థాత్మజు ల్విప్రవేషాఢ్యు లగుచు
రహి నేకచక్రపురముఁ జేరి యందొక
భూవిబుధాలయంబున వసించి
వేదము ల్చదువుచు విప్రగేహంబుల
భిక్షము ల్గైర నాపృథయు నందు
సగము భీమున కిడి సగము దా రేవురు
భుజియించుచుండ నప్పురజనములు

భసితసంఛన్నపావకప్రతిము లైన
వారిఁ గన్గొని ధారుణీభారహరణ
చతురమతు లైనదేవాంశసంభవు లని
తలఁచి పరమాన్నభిక్షలఁ దనిపి రెలమి. 151

ఆ. అట్లు భీమసేనుఁ డందఱు దెచ్చిన
సరసభుక్తరాశి సాము దినియు
నుండుఁ దృప్తి నొంద కుపవసించినగతిఁ
దుండిలుండు గాన దోఁగు నొంది. 152

సీ. అయ్యగ్రహారంబునందు బకాభిఖ్యుఁ
డసుర యజస్రంబు నవనిసురుల
దినము నిల్వరున నొక్కనిఁ దిను నవ్వార్త
విని పాండవులు వానిఁ దునుమున నువు
మది విచారించి యొక్కదినంబునందు ని
జావాసదుండైన యవనిసురున
కాబకారాధనం బావశ్యకంబైన
యగ్రజానుజ్ఞచే ననిలసుతుఁడు
విప్రపుత్త్రుని మరలించి వివిధభక్ష్య
భోజ్యములు పెక్కు యన్నసంపూర్ణమైన
శకట మారోహణముచేసి చనియె దనుజుఁ
గడపి భూసురసమితి రక్షింపఁబూని. 153

వ. ఇక్షులామరీచిరామఠసంస్కృతవ్యంజనాన్వితంబును భక్ష్య
పూర్ణంబును నైన యన్నశకటం బెక్కి చని బకాసుర
స్థానంబు చేరి యయ్యన్నంబు భక్షించుచుండె నాసమ
యంబున. 154

తే. రక్కసుఁడు భీమసేను తెఱంగుఁ గాంచి
దండతాడితభోగిచందమునఁ గనలి
దండిహరివాయువులలో నొకండు గాని
యితఁడు మనుజుండు గాఁ డని యిచ్చ నెంచె. 155

చ. అడరెడురోషభీషణత

నత్తులు నిష్ఠురత నుప్పతిల్ల న

క్కడు వెనఁ గాలఁ దాఁచుటయుఁ

గొంకక రక్కసుడిక్కఁ జూడ క

వ్వడముడి యిత్తుఖండము ల

వారణ మొక్కఁడు వారణేంద్రులై

పడి మొనసెం దదన్నము ల

వంబును జిక్కక యుండ మొందుగన్. 156

ఉ. ఈవిధి నిట్టముప్ప భుజి

ఘ్నించి మహాజవసత్త్వశాలియై

పావని వానిఁ దాఁకి దృఢ

పార్ష్ణిహతిన్ వెసనొంచె సంత న

ద్దేవవిరోధియుం దిరిగి

దీకొనిమొం డగ నిట్టు లిద్దఱున్

భూవర ! తుల్యవిక్రములఁ

బోరొనరించిరి భీమవైఖరిన్. 157

వ. ఇత్తెఱంగునం గొంతదడవు మల్లయుద్ధంబు సేసి. 158

మ. వృకతుండుం డతిరోషదీప్తుఁ డయి దో

ర్వీర్యం బవార్యంబుగా

బకునిం గిటణఁగిరటి గొబ్బునొది వి

పక్షిస్తుత్యవారిక్రమోఁడై

యకలంకస్థిరకీర్తిశాలికి సభా
తారాపతికిఁ జెప్పెక్కి యం
బకు సమ్మోదమునర్చి తమ్ములను సం
భావించె నెమ్మిం జగన్. 159

ఆ. ఏకచక్రనగరి నేగతి ద్విజులకు
హితముఁ గూర్చి వార లెలమి నుండి
రంత ద్రుపదనృపతి యాత్మజాతకు స్వయం
వరము సాటఁ బంచె నరవరేణ్య. 160

తే. అమ్మహోత్సవమునకు రాజ్యమునఁ గల్గు
నరవరేణ్యులు కాంపిలినగరమునకుఁ
జనిరి చతురంగవాహినీసహితు లగుచుఁ
దరుణి వరియించునాసచేఁ దత్క్షణమున. 161

సీ. కౌంతేయు లేకచక్రపురావనీసుర
సహితులై విప్రవేషములతోడ
సన్నాహులగుచు నరుగుచు మార్గమ
ధ్యమున నంగారపర్ణాభిధాను
గంధర్వు నిర్జించి కాంపిలీనగరంబు
చేరి యందొక కుంభకారసదన
మున వసియించి రయ్యవసరములలోన ధీ
మంతునిఁ గాంచి యాబ్రాహ్మణుండు

మఘవసన్నిభుఁ డీతఁ డీమత్స్యయంత్ర
భేదనం బొనరించి యీపృథునితంబ
బింబఁ బాంచాలనృపకన్యఁ బెండ్లియాడు
ననుచుఁ బలికిరి తమలోన నార్యజనులు. 162

ఆ. అపుడు ద్రుపదనృపతి యంబరతలమున
యంత్రమత్స్య మొకటి యనువుపఱిచి
తాళతరుసమానధనువును శరములుఁ
జూపి నిఖిలరాజసుతులఁ జూచి. 163

సీ. ఈవిల్లుమోపెట్టి యెవ్వఁడేనియు నేను
మార్గణంబుల యంత్రమత్స్యలక్ష్య
భేదనం బొనరించుఁ బేర్మి నాతండె నా
కన్యకు వరుఁ డని కడఁగి పలుక
నృపతు లాకాంతఁ బరిగ్రహింపఁగఁ బూని
యావిల్లుమోపెట్ట నలసులైన
నంత నర్జునుఁ డొకయంబకంబున మత్స్య
యంత్రంబు భేదించి యాశుభాంగిఁ
గొనియెఁ దదనంతరమ కర్ణకురుకులేశ
ముఖ్యనృపు లోర్వఁజాలక పొనసి పోర
భీమవిజయులు తద్వీరబృందములఁ బ
రాజితులఁ జేసి యుగ్రితరాజిలోన. 164

ఉ. ఆవిధి గెల్చి యొక్కఫల
మబ్బె నటంచు నరుండు చెల్వ వీ
రేవ్రరుఁ బంచికొం డని య
హీనదయామతిఁ బల్కి యంత రా
జీవదళాక్షిఁ గృష్ణఁ గని
చిత్తమునం గడు విన్ననై పృథా
దేవి దలంకె భీముని యు
ధిష్ఠిరునిం గవలం దలంచుచున్. 165

ఉత్సా. భీమబలులు పాండుసుతులు భిక్ష లెత్తి తేర నా
శ్రీమనోజ్ఞవేషఁ గృష్ణఁ జీటి కరంతి యిందులో
సామ భీమున కిడి కడమసగము నాలుపాళ్ళుగా
నోమి సేయు మనుచుఁ బల్కె నున్నయాద్వరుం డనన్.166

క. ఆగుణవతియును నట్లు వి
భాగము లొనరించి యిడఁగఁ బవనసుతుం డి
చ్ఛాగతి భుజియించియుఁ దా
నోగిరమున కాససేయుచుండు బుభుక్షన్. 167

ఉ. వీరలు రాజనందనులొ
విప్రులొ సత్వరలీల నేఁగి నీ
వారసి రమ్మటంచు ద్రుప
దావనిభర్త తనూజుఁ బంప న

వీరవరుండు పాండవుల
మృత్యువు కాలునకుండి గాంచి యీ
ధీరులు భూరివిక్రములు
దేవసమాను లటంచు నెంచుచున్. 168

శా. అన్యవ్యూహభిదానుచింతనము దా
హార్యోహాశోహావిధుల్
జన్యోపాయము నస్త్రశస్త్రనియతుల్
జానొందఁ గౌంతేయు ల
న్యోన్యంబు న్వచియింపఁ బొంచివిని తా
నయ్యూమినిన్ వీరు రా
జన్యుల్ భూసురవేషధారు లని ధృ
ష్టద్యుమ్నుఁ డెంచెన్ మదిన్. 169

వ. మీవేషంబుల విపరీతత్వంబును భాషావిశేషంబుల రాజ
త్వంబును దోఁచుచున్నయది యట్టియమానుషకర్మకర
ణంబు విప్రజాతికిం గలుగున ధైర్యగాంభీర్యాదిగుణం
బులకతన క్షత్రియు లగుట సిద్ధంబు మీర లెవ్వ రని
యడిగినఁ బాంచాలనందనునకు ధర్మనందనుం డిట్లనియె. 170

ఆ. ఏను ధర్మజుండ నీతండు భీముండు
వాఁడు విజయుఁ డల్లవారు గవలు
వినుము జ్ఞాతిజనులు వేధింప విప్రరూ
పమున నిటులి వచ్చితిమి రయమున. 171

విప్రుడు పవిత్రుఁడయ్యెం బర
మేశ్వర నీవరుడే నటంచు నా
ద్రుపదమహీతలాధిపుఁ డ
దుత్కృష్ణుని పూజ యొనర్చె వేడుకన్. 176

శా. విద్వద్వందితుఁ డంబుదాసితమహా
వేషుండు గృష్ణాజినాం
చద్వ్యాసుండు సమస్తవేదపటలీ
శాస్త్రార్థసంధారణా
చిద్విద్యావిభవుండు పింగళజటా
శ్రీభాసురాంసుండు కృ
ష్ణద్వైపాయనుఁ డాపృథాత్మజులఁ గా
న న్వచ్చె సచ్చేటికిన్. 177

శా. పారాశర్యమహామునిన్ ద్రుపదభూ
పాలుండు వీక్షించి స
త్కారం బింపుగఁ జేసి నీదుపదప
ద్మశ్రీపరాగాప్తిఁ జ
న్నారం బావనమయ్యె మద్గృహము ధ
న్యం బయ్యె మద్వంశముల్
నీరాకన్ మునివర్య యనుచుఁ బొగడ
న్నిర్జిద్రిహార్ద్రోన్నతిన్. 178

కృష్ణమృగశాబలోచనఁ
గృష్ణ నొసఁగఁ బాండవులకుఁ గృప చెలువొందన్. 184

ఉ. ఈవిధి ధర్మజప్రముఖు
లేవురు సాత్యవతేయునాజ్ఞచే
ద్రోవదిఁ బెండ్లి యై ద్రుపదు
ప్రోలి వసింపఁగ నత్తెఱంగు చా
రావళి చెప్పఁగా విని సు
కాత్మజుఁ డైన సుయోధనుండు చిం
తావిలమానసుం డయి వి
భాంతరసంస్థితుఁ డై రయంబునన్. 185

క. ద్రోణకృపభీష్మవిదుర
ద్రౌణిశకునికర్ణసోమదత్తశలాద్య
క్షీణప్రాజ్ఞామాత్య
శ్రేణిం గని పల్కెఁ గార్యశీలితమతి యై. 186

తే. వింటిరే పాండవులు విప్రవేషధారు
లగుచు ద్రౌపదిఁ బెండ్లాడి రనఁగ వింటి
వారిఁ గెల్చునుపాయంబు మీర లర్థి
మద్హితార్థు లై తెలుపుఁడు మనల కిపుడు. 187

వ. అనిన శాంతనవుం డిట్లనియె. 188

క. కృతపుణ్యులఁ బాండవులం
గృతకమతిన్నీవు సేయుకీడు దవులయ్

కృతమగులు యటఁ ధర్మ
స్థాపనయు యనంగ వినుము ధరణినాథా. 189

ఉ. ఎచ్చటఁ బాండవాత్మజు ల
హీనగతిన్ వసియింతు రింపుగా
నచ్చట వర్షము ల్గురియు
నచ్చట భూరుహము ల్ఫలించుఁ దా
నచ్చట భూమి సస్యవతి
యై కడు సొంపగు ధేనుసంఘముల్
నిచ్చలు నచ్చటం బిదుకు
నిర్మలదుగ్ధము లధ్యయస్థితిన్. 190

తే. వితతధనధాన్యసంపద విఱ్ఱవీఁగి
ప్రజలు ధర్మాభినిరతులై బ్రతుకుఁ గాంతు
రఖిలవిప్రులు వేదశాస్త్రానురక్తి
నుండుదురు వారు వసియించునుర్వియందు. 191

సీ. దివిజసన్నిభులు కౌంతేయులు మును సేవ
సేయుకృత్యంబులఁ జిక్కుపడిరె
కాంపిలీనగరిలోఁ గలన ద్రుపదుని గెలి
గెలువఁడే నృపతులఁ గ్రీడి మొనలఁ
యతనిశౌర్యంబు నీ కగపడినదియె మఱి
ట్లత్యంతబాహాబలాఢ్యులైన

యమ్మహామహులకు హరి మాతులేయుండు
సతతంబు భద్రము ల్సంఘటించుఁ
దత్సహాయంబుకలిమి గంధవహాదిప్త
హుతవహోగ్రపరాక్రమశోభ్యుదయతేజు
లైరి పాంచాలపతియుఁ గన్యాప్రదాత
యగుట నుజ్జ్వలగతిఁ దత్సహాయుఁ డయ్యె. 192

వ. మఱియును. 193

మ. నరనారాయణు లాదిమాను లరవిం
దభవోద్భవప్రార్థనన్
ధరణీభారము వాపఁ బుట్టిరి నితాం
తక్షేమసంశోభితుల్
నరుఁ డప్పార్థుఁడు నందనందనుఁడునూ
నారాయణుం డమ్మహా
పురుషుల్ సౌహృదవృత్తి వర్తిలుదు రిం
పు ల్మీంపి యన్యోన్యమున్. 194

ఆ. విను మజాతశత్రుఁ డనఘుఁడు ధర్మజుఁ
డతని కహితవీరు లవనిఁ గల్గ
రట్లు గల్గెనేని యభివృద్ధి నొందరు
వానిమహిమ యెన్నవశమె చెప్పుమ. 195

ఉ. భీముఁడు భీముఁ డాజుల గ
భీరపరాక్రముఁ డర్జునుండు సం

తేయులకు వెఱచితివి నీ
కాయుర్వృద్ధి యగు నింటి కరుగుము వేగన్. 200

చ. వెఱచినవారిమాటలు వి
వేకధురీణులు విందు రేల్ల ము
న్నెఱుఁగవె పాండునందనులఁ
గృష్ణుఁడు నా ద్రుపదుండుఁ ద్రోణుడున్
నెఱిఁ జనుదెంచి రేనియును
నే నొకకోలన వారినెల్ల నే
డ్తెఱ నుఱుమాడి నైచెదఁ గ
ఠిందిమగంటిమి యుల్లసిల్లఁగన్. 201

వ. అనిన యప్పలుకులకుం గనలి కృపాచార్యుం డిట్లనియె. 202

తే. కర్ణ నీ వెట్లు వల్కెదే గంగపట్టి
నతనికిని నీకు గిరిసర్షపాంతరంబు
ద్రుపదుఁ బట్టంగ నేఁగిన యప్పుడు నీదు
శౌర్య మేమాఱె కరిగె నిజంబు సెప్పుమా. 203

వ. నరపాలపరిషన్మధ్యంబునం బెద్దలం బరిభవింప వలంతివి
గాని సంగ్రామరంగంబునఁ జలాయితుండవు గాక ధనుః
కౌశలంబు వెల్లడిసి నిలువంగలిగితివే యని పలికినం
గ్రోధించి దండధరాకారంబుగలిగి కోపించి కానీనుం డిట్లనియె.

ఆ. భూమిసురుఁడ వీ వపూర్వవిప్రియుండవు
గలఁడె సభల నీకుఁ గార్య మొకటి.

నోరు ఖడ్గధారఁ గువలయాధీశ్వరుల
రాజ్యభారఁ గోరు నవనిసురుఁడు. 205

మత్త. బాలు బాలుఁడు వృద్ధు వృద్ధునిఁ బ్రస్తుతించుజగంబునన్
బాల వృద్ధుఁడ వౌట నీగతి సంస్తుతించితి భీష్మ నీ
బాలిశత్వము చెల్లునుర్వ్యుఁ గృపా నృపాలసభాస్థలిం
జేరి చేల తలంగు నీకిది పిండివంటలరాశినే. 206

క. అని పలుకుసూతసూనునిఁ
గనుఁగొని దండాహతాహికైవడి నైజి
గ్గన లేచి క్రోధి యుండఁగ
విన నాతనిఁ బల్కె రోషవివశుం డగుచున్. 207

ఆ. వృద్ధసేవ నల్పువిధమును బ్రాజ్ఞత
లేదు నీకు నొక్కలేశమైన
నోరి! కురునృపాలు ద్వారంబునందుఁ గా
తేయకంబుగీతిఁ గూయు దిట్టు. 208

వ. అని పల్కం బోలు వెటికి రాధేయుని పోయిగమకించిన
దుర్యోధనుండు లేచి కృతాంజలియై దేవవ్రతకుంభసంభ
వాశ్వత్థామకృపాదులకుం బ్రియంబుఁ జెప్పి యాకలహం
బు మాన్పె నంత విదురుండు ధృతరాష్ట్రున కిట్లనియె. 209

ఉ. నీతివిదుండు నీరుఁ డవి
నింద్యచరిత్రుఁడు వృద్ధసేవి వ్రి

క్రిందను జైత్రవంబునఁ బు
రంబు ప్రవేశ మొనర్చి రాన్నృపుల్. 215

ఉ. ధీయుతు లత్యుదారులు యు
ధిష్ఠిరముఖ్యులు కుంభజన్మగాం
గేయకృపాంబికేయుల క
కృత్రిమభక్తి నమస్కరించి రా
ధేయసుయోధనాదుల న
తిప్రమదంబున గౌరవించి తా
రాయెడ నుండి రార్యనిచ
యం బనుకంప బహూకరింపఁగన్. 216

క. ఈ తెఱఁగున వారలు కం
జాతాక్షసమేతు లగుచు సభనుండఁ దటిన్
నీతివిదుఁడు విదురుఁడు ప్ర
ఖ్యాతఫణితిఁ బలికె నంబికాసుతుతోడన్. 217

సీ. నీతమ్ముఁ డగుపాండునృపసుతుల్ సత్యప్ర
తిజ్ఞులు నీకు విధేయు లుర్విఁ
బ్రాజ్ఞులు శౌర్యోజ్జ్వలులు ధర్మజ్ఞు
లతులపరాక్రము లార్యహితులు
నగుట దజ్జనకాంశ మగురాజ్య మొసఁగి వా
రలఁ గూడి మనుము నిర్వ్యాజకలన

నిది భీష్మగురుకృపకృష్ణముఖ్యులకు స
మ్మతమును ధర్మక్రమంబుఁ దలఁప
గర్ణదుర్యోధనప్రభంజనకలితమై సు
యోధనానల నిఖాయశ్వయోరువిపిన
మంతయు దహించుఁ గావున నయ్యరువుర
బుద్ధి వినక కౌంతేయులఁ బ్రోవు మనఘ. 218

క. కావునఁ గుంతీసుతులకు
నీ విందప్రస్థనగర మిమ్ము సుఖేచ్ఛన్
భూవర తనయాన్వితుఁడ
వై వెలయుము కీర్తిశోభివై విశ్వమునన్. 219

చ. అని విదురుండు చెప్పుటయు
నాధృతరాష్ట్రుఁడు కుంభజన్మశాం
తనవకృపాదిసజ్జనవి
తానము లుల్లసిలంగఁ బాండునం
దనులకు నర్ధరాజ్యము ము
దంబున నిచ్చె ననంతరంబ యా
య్యనఘు లశేషబాంధవస
మన్వితులై చని రాద్యసమ్మతిన్. 220

క. ఇంద్రవిభవమున నీగతి
నింద్రప్రస్థంబు చేర నేఁగఁగ నదియున్

రుంద్రమృగాకీర్ణంబై
సాంద్రలతాగుల్మసాలసంవృత మగుటన్. 221

వ. కనుంగొని ధర్మనందనుం డిట్లనియె. 222

మ. ధృతరాష్ట్రుం డతిలోభమోహితుండై భా
గీరథీకూలవనో
స్థితి నీకానన మిచ్చె జ్ఞాతిజను లి
స్సీ జ్ఞాతినద్రవ్యభాక్
స్మృతి సైరింపఁగ నోపువారె పలుకుల్
నవ్యామృతాసారముల్
మతి దీప్తాగ్నియుపో సగోత్రులకుఁ ద
న్మాహాత్మ్యము లెవ్వంతలే. 223

ఆ. ఇమ్మహోగ్రవిపిన మెల్ల పురంబుగాఁ
జేయువాఁడ ననుచుఁ జింతఁ గలఁగి
యంబుజాయతాక్షు నడిగిన నమ్మహా
పురుషుఁ డనియె ధర్మపుత్త్రుతోడ. 224

క. నను నెఱిఁగి పూజసల్పిన
యనఘులకున్ వాంఛితాఖిలార్థము లబ్బున్
వినుము నను మించువాఁడం
బెనయఁగ నెవ్వాఁడు గల్గునే విశ్వమునన్. 225

తే. అనఘ మధ్యాహ్నవేళ సమాగతుఁ డగు
నతిథి ననుఁ గా నెఱుంగుము వాని బూజ

సేయు ధర్మాత్ముఁ డుజ్జ్వలశ్రీసమృద్ధిఁ
బ్రబలు నతిథిని మించుపాత్రంబు గలదె. 226

తే. విభవము కొలంది నొసఁగక వితతలోభ
కలితుఁ డగు మానవుండు దుర్గతులఁ జెందు
మఱియు నాతండు నూఱుజన్మములదాఁక
నతిదరిద్రతచేఁ గుందు నవనినాథ. 227

తే. కొంచె మైనను ఘన మైనఁ గుటిలపడక
పాత్రభూతున కిచ్చుట పాడి మనుజుఁ
డన్న జలదానకుశలవాక్యములఁ దెల్పి
యాచకులయాస దీర్పంగ నగు నృపాల. 228

క. పాత్రపరిదానమహిమకు
ధాత్రీశ్వర యల్ప మైన దా నధికంబౌఁ
బాత్రంబ సేని వన్ను న
కృత్రిమగతిఁ బూజసేయు మిచ్చెదఁ గోర్కుల్. 229

చ. అనవుడు వన్యమూలక ఫ
లాజ్యపయోదధిముఖ్యదివ్యవ
స్తునికర మిచ్చి ధర్మజుఁడు
తోయజనాభునిఁ బూజసేసె న
య్యనఘుఁడు ప్రీతుఁ డై యపుడ
యామరవర్గముఁ జూచి పాండునం

దనులకు నొక్కపట్టణ మగు
దారగతిఁ బ్రజయించు మీ వసఁగ. 280

క. అపు డాతఁడు నింద్రపు
స్థపురము నిర్మించె శిల్పచాతురిచే నిం
ద్రపురవరలక్ష్మి మిగిలిన
యపరిమితశ్రీసమృద్ధి నలరారంగఁ. 281

ఉ. హస్తిపురంబు దానిపది
యూజనపాలునుఁ బోలకున్న ద
వ్యస్తుసమృద్ధిచే నిటమొ
స్వర్గపురం బని సర్వభూభుజుల్
ప్రస్తుతిచేసి రన్నగరిఁ
బాండునృపాలక! యంత ద్వారకా
వాస్తునియూనఁ గైకొని భ
వత్సుతు లందు వసించి రొప్పుచున్. 282

ఆ. అట్టు లప్పురమున ననుపమైశ్వ
కలితు లగుచుఁ దనరి రలఘుకీర్తి
ధరణినాథ నీదుతనయుల కిజగ
త్రయి నసాధ్య మొద్ది తలఁచి చూడ. 283

వ. అని తెల్పిన పాఠకునకుఁ బాండుభూపా లిట్లనియె. 284

ఆ. కర్మదూరులకును ధర్మేతరులకు స్వ
ర్గంబు చేరఁగారాదు బ్రహ్మపుత్త్ర

గముగతి సలుపుచు నయ్యా
గము సేయఁగఁ బూని మానిఁ గని యిట్లనియెన్. 288

ఆ. పుత్రుఁడు సేయుధర్మ మునరంగ నన్యున
కెట్లు పొందు నన్మునీంద్రచంద్ర
తలఁప నితరునకును ఫలమిచ్చునేనియుఁ
గర్త కెట్లు ధర్మగరిమ వెలయు. 239

క. సర్వజ్ఞుండవు నీవుదక్కం దక్కినవా రెవ్వ రీసంశయంబు
వాపవే యని యడిగిన నతనికి నారదుం డిట్లనియె. 240

తే. ధర్మసూక్ష్మంబుఁ జెప్పెద ధర్మరాజ
వినుము తథ్యంబు నీపల్కు వేఱ యొకఁడు
సేయుపుణ్యంబు లితరులఁ జెంద దైనఁ
దనయుఁ డొనరించు సుకృతంబు జనకుఁ జెందు. 241

చ. తనయుఁడు సల్పుసత్క్రియకుఁ
దండ్రియ కర్త యగున్ జగంబునన్
మును పతి భార్యగర్భము న
మున్నత వైఖరిఁ జొచ్చి పుత్త్రుఁడై
జననము నొందుఁ దాన విల
సద్గతిఁ దండ్రియునూ కుమారుఁడై
తనుపగు వార లిద్దఱకు
భేదము లేదు తలంచి చూచినన్. 242

తే. గీపమునఁ బుట్టు వేఁడొండుదీపమట్లు
జనకునివలనఁ దనూజుండు సంభవించు
నట్లు గావున ధర్మాత్ముఁ డైనసుతుఁడు
తండ్రిఁ దరియింపఁగాఁ జేయు ధరణినాథ. 243

క. తనయుం డఘసంహరణుఁడై
జనకునిదుర్గతులఁ జెర్చు జనములు సుతులన్
మును పెక్కండ్రం గోరుదు
రనఘా యం దొకఁడు సుకృతి యగునో యనుచున్. 244

క. పాపముసేయరు పాజ్ఞులు
పాప మిహాముత్రవైరి పాపాత్మునితో
నేపొందఁ జెలిమిజేసిన
యాపురుషుఁడు తత్సమానుఁ డగు నిక్కముగన్. 245

సీ. అఘకర్ముఁ డగువాఁడు యమలోకమున కేఁగి
యందు నారకదుఃఖ మనుభవించి
వెండియు ధరఁ బ్రభవించి తద్వాసన
నసి కుందుచు నుండు నెట్టు లనిన
నసిపత్త్రవనవాసి యగునట్టి మనుజుండు
వికలాంగుఁడై ప్రభవించుఁ జూవె
తప్తతైలకటాహనుప్తుఁ డామర్త్యుండు
రాజయక్ష్ముఁ గృశించు రాజతిలక

మఱి నిరుచ్ఛ్వాసగతుఁడైన భూసురవృందము
శ్వాసరోగాఢ్యుఁ డగు నిట్లు జగతిఁ బుట్టి
భూరిపూర్వాఘసంస్కారకారణమునఁ
బాప మొనరించుఁ గ్రమ్మఱఁ బంచజనుఁడు. 246

సీ. కావునఁ జిత్తవాక్కర్మకృతంబైన
పాపంబుఁ బాపంగఁ బ్రాదితంబు
గౌతమీపుష్కరగంగాదినదులలోఁ
క్షేమంగఁ దగు నట్లు చేసినీని
వేఁచినగింజల వెస నంకురంబులు
గలుగనిగతిఁ బ్రాగ్జన్మకలుష
వాసన యణఁగు భూవల్లభ యట్లు ప్రా
యశ్చిత్తశుద్ధాత్ముఁ డగునరుండు
వెండి దురితంబు లొనరింప కుండవలయు
ధర నహంకారధనలోభదర్పకలనఁ
గలుష మొనరించి మరల దుర్గతి వసింపఁ
గలుషభోగవిరామంబు గలుగ దెపుడు. 247

తే. నీవు హరిభక్తుఁడవు ధర్మనిపుణమతివి
రాజసూయంబు సేయుము రాజవర్య
యజ్ఞకర్మంబు ధర్మంబునందుఁ బెద్ద
యఖిలలోకాధిపూజ్యుఁ డయ్యజ్ఞకర్త. 248

శా. సామామ్నాయనినాదమేదురమఖీ శా
లాశోకవనఖండమాశ్రిత
స్తోమస్థానము భవ్యసౌధవిభవా
కాంతాతిక్రాంతనాభ్యాగత
శ్రీమన్నిర్జరసంఘసంకులము నై
చెన్నొందుచున్నంబు శ్రీ
రామాజాని కనంతహర్షకరమై
రాగిల్లు సర్వేశ్వరా. 249

తే. భాస్కరునియందుఁ దెలిదీవి బదరికావ
నమునఁ గలశాబ్ధి వైకుంఠనగరి మాని
చిత్తముల నుండుకరణి భక్తమధువృందము
నవనవాటిక నుండు నెన్నంటియుంబు. 250

వ. కావున మఖం బొనరించి హరిం బ్రీతాత్ముఁ జేయుమని
చెప్పి నారదుం డరిగిన. 251

ఉ. ఆయతతేజుఁ డైనముని
యాసతి జన్నము సేయఁబూని తా
నాయెడ ధర్మసూనుఁడు త
దధ్వరకార్యము నిర్వహింపఁ జ
క్రాయుధుఁడే సమర్థుఁ డని
యాత్మఁ దలంచి యనంతరంబ యు

తోయజనాభునిం బిలువ
దూతజనంబులఁ బంచె నర్మిలిన్. 252

తే. ద్వారవతి కేఁగి వారలు వాసుదేవుఁ
గాంచి ధర్మజుఁ డనిపినక్రియము దెల్ప
నపుడు శిశుపాలుపై దండయాత్రసేయఁ
బయనమై యున్న పెన్నుందు బలునిఁ జూచి. 253

క. ఆర్య సుహృత్కార్యము సుర
కార్యంబును నొక్కసారి గదిరెన్ ధీచా
తుర్యమునఁ దెల్పు మిం దే
కార్యము సేయంగ నగు జగద్ధిత మనుచున్. 254

తే. అనిన విని యాప్రలంబదైత్యారి వల్కె
నిపుడు శిశుపాలుఁ డెగటార్చు టదియు మేలు
ప్రబలతరుఁ డగునభియాతి పైని గలుగ
నిదురవచ్చునె కంటికి నీరజాక్ష. 255

క. హాలహాలి నజాండభాండం
బులు చక్కడఁచెద నరాతిఁ బొడుచుట యరుదే
నిలుపుము సేనలఁ జైద్యుం
బొలియించెద సేన యరిగి పురుషప్రవరా. 256

వ. అని పలికిన. 257

క. అద్ధీరవరుని నడిగిన
పద్ధతిఁ దను నడుగఁ గార్యభాగజ్ఞుండై

బుద్ధిం గీష్పతి కైన యగు
నున్నవుఁ డిట్లనిరా నయ్యదూద్వహులతోడన్. 258

ఉ. ఆర్యుఁడవు తేజమున జలధి
యంబులు గోరినమాడ్కి విశ్రుతో
దర్కమహోఘలఙ్ఘుఁడవు
తామరసాయతనేత్ర నీవు మ
త్కర్కశభాషణాశ్రవణ
కాంతు రొనర్చితే నీదుసన్నిధిం
దర్కశలాపరిపీణుఁ డగు
దైవతమంత్రియుఁ బల్కనేర్చునే. 259

ఉ. వినను నాకుఁ బోలినకి
య న్విపరీతము ముఖంబు సేయఁగాఁ
బూనిరి పాండునందనులు
భూనుతవైఖరిఁ దత్క్రియాతనం
భాన మొనర్చు తే లోకఁడు
దక్షుఁడు గల్గునె నీవుదక్క నీ
మేనమఱందు లార్యజన
మిత్రులు వారలఁ బ్రోచు టొప్పగున్. 260

వ. కౌంతేయులు నీయధీనులు గావున నచ్చటికిం జని తదీయా
ధ్వరకార్యభారంబు వహింపందగు నదియునుం గాక. 261

ఉ. పంకజపత్త్రనేత్రి శిశు
పాలుఁడు సచ్చటి కేఁగుదెంచుఁ గా
లంకపగర్వదుర్వహాబ
లంబున నిన్నుఁ దిరస్కరించి ని
శ్శంకఁ జెలంగు రాజవరి
షద్గతు నాఖలచిత్తు మత్తు నా
వంకను తుత్త్రింపరాదె సుర
వార ముదారముదగ్రఁ జేలఁగన్. 262

క. కావున ధర్మజుపాలికిఁ
బోవుట నీతి యని తోఁచెఁ బొలుపొందఁగ నా
భావంబున నట మీఁదట
దేవరచిత్తంబు సర్వదేవప్రవరా. 263

వ. అని తెల్పిన. 264

క. ఉద్ధవుని మెచ్చి లోకశు
భోద్ధనసంధాతి పురుషోత్తముఁ డయ్యా
గోద్ధరణసిద్ధమతిచే
సద్ధర్మజుపాలి కరిగె సామాత్యుండై. 265

వ. అప్పుడు. 266

ఉత్సా. భ్రాతృసహితుఁ డగుచు ధర్మరాజు వాసుదేవు వి
ఖ్యాతభక్తిఁ బూజసల్పి యాగకరణవాంఛ నా

కీర్తిం జనించెఁ దన్మహీయధర్మ మీవు సం
ప్రీతి నిర్వహింపు మనుచుఁ జెప్పె నేఁడె నాయనఘా. 267

వ. కృష్ణదేవుండును విశ్వంభరాభారహరణంబునకు నిదియె
బీజం బని విచారించి యిట్లనియె. 268

ఆ. అనఘ రాజసూయయాగంబు సేయంగఁ
దలఁచితేని విశ్వధాత్రిఁ గలుగు
నవనిపతుల గెల్చి యాగిగోసనలయు ని
య్యదియె ధర్మమునకుఁ గుదురు తలఁప. 269

క. మున్ను జరాసంధనృపుఁడు
మన్నింగొనఁగవలయు వాఁడు మడియక నృప నీ
జన్మమున హవిర్భాగము
లన్నిర్జరు లంద రతిభయాన్వితు లగుదుర్. 270

క. అని పల్కి ధర్మనందను
ననుమతిఁ గొని పవననందనార్జునయుతుఁడై
చనియెన్ భూసురవేషం
బున హరి మగధాధినాథుపొంత మడంపన్. 271

క. అద్వారంబున నరిగి గృ
హద్వారముఁ జేరి యమ్మహాత్ములు మువ్వుర్
విద్వన్మాత్రను నిలిచిన
నద్వారస్థితుఁడు చెప్పె ధరణిపుతోడన్. 272

సీ. ఆజరాసంధుఁడు ననిశంబు భూసుర
వరులఁ బూజ నొనర్చువాఁడు గాన
నలరి చిత్తంబునఁ దలఁచె నిట్లని వీరి
వాంఛితార్థము లియ్యవలయు నిపుడ
వైశ్వదేవక్రియావసరసమాగతా
తిథివర్గములయాశ దీర్పఁ బాడి
సమయసంప్రాప్తుల విముఖులఁ గావించు
జీవనంబునకంటెఁ జావు మేలు
లలితమాధుర్యధుర్యఫలంబు లొసఁగి
తరువులైనను బ్రాణులఁ దనుపుచుండు
నది తదీయస్వభావంబ యాగుణంబు
మాదృశుల కెల్ల బోధింప మతము గాదె. 273

వ. అని తలపోయుచుండె ననిన విని శౌనకుండు సూతున
కిట్లనియె. 274

ఆ. అఖిలధర్మవితతి నవనిపై నిలుపంగ
నవతరించినట్టి యంబుజాక్షుఁ
డతిథిపూజ సల్పు నతిధర్మయుతుఁ డగు
భూపు నేల దునుమ నిచ్ఛయించె. 275

వ. అని యడిగిన సూతుం డిట్లనియె. 276

సీ. పరదారహరణంబు పరవంచనంబును
నిజకులోచితకర్మనిరసనంబు

సాధిష్ఠసద్బృందసంపరిత్యాగంబు
సంతతదుర్జనసంగ్రహంబు
సకలజగజ్జాలసంక్షోభకరణంబు
భూరినిజోదరపూరణంబు
సనిమిత్తహింసనపాపానుచింతనములు
నిర్దయత్వము వృద్ధనిందనంబు
నెవ్వనికి నైజగుణము లాహీనమనుజుఁ
డెట్టిసుకృతంబు సల్పిన నేపడంగు
భస్మవిన్యస్తహవ్యంబుభంగి యగుచుఁ
గరటిభుక్తకపిత్థంబుకరణి యగుచు. 277

వ. జరాసంధుండు జగత్సంతాపకరుండై దుర్వృత్తిం బ్రవ
ర్తించుఁ గావున నద్దేవునికారుణ్యంబునకుఁ బాత్రుండు
గాఁ డనన్యు నది యట్లుండె నట్లుతం డప్పురుషప్రకాండుల
డగ్గఱం జని ప్రాంజలి యై యాతిథేయం బైన యిష్టా
న్నం బొసంగి సంతుష్టులం గావింపుదం గొనుం డని
ప్రార్థించిన వానికిఁ గృష్ణుం డిట్లనియె. 278

మ. సురవిద్వేషివి సర్వభూభుజుల నం
క్షోభింపఁగాఁ జేయు ది
ద్ధరకున్ దుర్భరభారభూతుఁడవు ని
త్యాదృష్టి వీక్షాపణో

త్కారముల్ సమ్యగ్రాదు మాకుఁ గదు నిం
ద్యంబైన నీయన్న మే
కరణిన్ గ్రాహ్యము నీమనం బిరవు ని
ష్కారుణ్యసంపత్తికిన్. 279

తే. సత్కులీనతయును ముదుసలితనంబు
సిరియుఁ గలిగిన దుష్టుండు శిష్టుఁ డగునె
సాధుసజ్జనమానసశల్యతుల్యుఁ
డైనమనుజుండు సాధు వెట్లనఁగఁ బరగు. 280

వ. అనిన విని యాతం డిది దానసమయంబు మీ కెద్ది గావ
లసిన నిచ్చెద నడుగుం డనినఁ గృష్ణుండు శక్తి గలదేని
మాతోఁ గయ్యం బొసరింపు మని పలికిన నగి వాఁ
డిట్లనియె. 281

శా. మీర ల్విప్రులు శక్తిహీను లధము
ల్మృష్టాన్నసూపాజ్యముల్
గోరంగాఁ దగుఁ గాక మాదృశులతో
ఘోరాజి చేయ న్మదిం
గోరం జన్నె వసుంధరాధిపులతో
క్షోణీసురు ల్వీరులై
పోరం జేయుదురే మనం దలఁచినం
బొంకింక మీయిండ్లకున్. 282

క. సమరము సేయఁగ నాతో
సము లెందును లేరు మీ రశక్తులు రణరం
గమున న్నిలువ సమర్థులె
యమితబలోదగ్రు నన్ను నాఁగంగలరే. 283

తే. కలహ మొనరించుకోరిక గలిగెనేని
యట్లు కావింతు విప్రవేషాఢ్యు లగుచు
నేఁగుదెంచితి రిందు మీ రెవ్వ రేమి
పనికి నింతయుఁ దెలియంగఁ బలుకవలయు. 284

వ. అనిన వానికిఁ గృష్ణుం డిట్లనియె. 285

ఉ. భీముఁ డితం డితం డహిత
భీముఁడు ఫల్గునుఁ డేను గృష్ణుఁడన్
శ్రీమను రాజసూయ మొన
రింపఁగ దీక్ష వహించె ధర్మజుం
డేము తదాజ్ఞ ని న్గెలువ
నిచ్చటికిం జనుదెంచినార మి
ట్లామఘులీల కిప్డుఁ బ్రిథ
మాంగము దుర్జనశిక్ష గావునన్. 286

వ. అనిన విని యతండు దండతాడిత భుజంగంబుభంగిఁ
బొంగి యప్పిశంగచేలునిం గనుంగొని. 287

సీ. ఓహో సుయోధనుం డోకయూ రొసంగిన
బ్రతుకుధర్మాత్మజాపనుపుచేతఁ

జనుడెంచితే నీవు సత్యంబు పలికితి
చనుఁ జను నీకు సజ్జనపతికిని
శమనాత్మజుఁడు నీవు సమరపరాఙ్ముఖు
లెంతయు దుర్బలు లేమి చెప్ప
యుద్ధరంగమున మున్నోడి పెండియుఁ బాండ
వులఁగూడి నను గెల్వఁ దలఁచితో కో—
యహహా నీసత్త్వ మెఱిఁగినయదియె తలఁప
బాలుఁ డబలుండు నరుఁడు గోపాల వీఁడు
కలను గావింపఁ జాలఁ డిక్కడిఁదిబలుఁడు
భీముఁ డొకరుండె నాతోడఁ బెనఁగ వలఁతి. 288

క. అని పలికి మగధనాథుం
డనికిఁ బిలువఁ బవనతనయుఁ డాయితమై గ్ర
క్కున నెదిరి పోరెఁ గ్రీడియు
వనజదళాక్షుఁడును మాగ్ధవననిధిఁ దేలన్. 289

తే. సమర మొనరించి రప్పు డయ్యమితబలులు
సమబలంబున భీమవిక్రమునిరూఢి
సమరగణములు వ్యోమమధ్యాంతముల నిల్చి
సమవధానత వీక్షించి సంభ్రమింప. 290

ఉ. ఒండొరుఁ గిట్టి పట్టుచును
నొండొరుఁ బాయుచు డాయుచున్ మహా

ద్దండతలప్రహారహతిఁ
దద్దయు దద్దరిలంగఁ జేసి దో
శ్చండిమఁ జూపుచుం బదగ
జమ్ములచందమునం జెలంగి యా
దండిమగ ల్పెనంగిరి ది
థిపదతాడనభీషణోద్ధతిన్. 291

వ. ఇట్లు ఘోరయుద్ధంబు సేయునెడ. 292

ఉ. గంధవహాత్మజుం డపు డ
ఖండితసత్త్వసమగ్రతన్ జరా
సంధు మహోగ్రకాయము వి
సం బెనువ్రక్కలు చేసి వైచి త
ద్బంధుల కెల్ల సాధ్వసము
దార్కొన బిట్టుగ నార్చె సర్వది
క్సింధురకర్ణము ల్వగులఁ
గృష్ణుఁడు జిష్ణుఁడు సంతసిల్లఁగన్. 293

వ. ఇట్లు భీమసేనుండు జరాసంధుమేను రెండువ్రయ్యలుగాఁ
జీరి వైచె నసంతరంబ వాఁడును జర యనురక్కసిచేత
సంధింపఁబడి లేచివచ్చి. 294

తే. బవర మొనరింపఁ గదుపలిపట్టి వాని
నట్ల చీరిన వెండియు నతుకుకొనిమోఁ

జెలఁగి పలుమాఱు సిగతిఁ జేరిపైవ

నడుముగొని వాఁడు గ్రిద్ధ్మలు వని రాయనర్చె. 295

వ. అంతఁ బదునొకొండవయుద్ధంబునందు. 296

తే. పవనజుఁడు చూడఁ దృణము చేఁబట్టి చీరి

యవల నీవలఁ బడవైచె నచ్యుతుండు

తత్ప్రకారంబు గని వానితనువుఁ జీరి

వైచె నత్తున్క లీవ లావలగ నతఁడు. 297

వ. అప్పుడు సురలు పరమహర్షంబునఁ గుసుమవర్షంబులు

గురియించుచు నిర్భయంబున వర్తిల్లి రిట్లు విజయంబు

గైకొని విజయాగ్రజుండు తమ్మికొలంకునం గ్రీడించు

మత్తకరిం బురుడించె నంత. 298

చ. అనిలజుచేత నిట్లు మగ

ధావనిపుం దునిమించి తద్గృహం

బునఁ జెఱ నున్న భూపతులఁ

బొల్పమరన్ విడిపించి వాని నం

దను సహదేవుఁ దత్పదము

నం దగ నిల్పి తదీయసూత్నర

త్ననికరముఖ్యవస్తువులు ము

దంబునఁ గైకొని శౌరి గ్రక్కునన్. 299

తే. అనిలజార్జునసహితుఁడై యరుగుదెంచి

యమ్మతనూజునిఁ గని మగధాధినాథుఁ

దునుముమనృత్తాంత మాద్యంతమును వచింప
మార్గనారిధ నోలాడి యతఁడు వల్కె. 300

సీ. జగదీశ నీకు నసాధ్యంబు గలదె నీ
నిశ్వసితంబులు నిగమవితతి
కర్తవు భోక్తవు గారయితవు నీవ
ఫలదాయకుఁడ వగు ప్రభుఁడ, వీవ
నీయనుగ్రహమున నిఖిలాపదలు మున్ను
గడచితిఁ బ్రఖ్యాతిఁ గాంచఁగంటి
రాజసూయమహాధ్వరంబు సేయించి మ
జ్జనకు వాంఛాపూర్తి సలుపు మింక
శంఖచక్రగదాహస్త జలజనేత్ర
భూతభావన భూతేశ పీతవసన
ద్వారకావాస కేశవ వాసుదేవ
నన్ను రక్షింపు మిదె నీకు నతి యొనర్తు. 301

వ. అనిన భగవంతుం డిట్లనియె. 302

ఆ. దుష్టనృపుల నెల్లఁ దునుమక రాజసూ
యాధ్వరంబు సాగ దవనిపాల
యప్రమేయసత్త్వ లవనిపుల్ రావణ
సములు పెక్కు గలరు జగతిలోన. 303

క. ఆరావణుఁ దునుముటకై
శ్రీరాముఁడు రవితనూజుఁ జేపట్టి సునా

సీతసుతుఁ బాలిం గపి
వీరున్ సమయించె నొక్కవిశిఖముచేతన్. 804

వ. రాఘవుం డవ్వాలిం దున్మిన త్రిలోకవిజయుం డగురావ
ణుండు సమసినవాఁడౌ నూహింపుఁడు నవ్వాలివరాక్ర
మాతిశయం బాకర్ణింపుము. 805

చ. వననిధిఁ గ్రుంకి యూర్ధ్వగ
వల్లభుఁ డొక్కట సంధ్యవార్చుచుం
దనపయిఁ జాడిపెట్టు బల
దర్పితు రావణుఁ బంకఁబట్టి చ
య్యన నిజవాలరోమములఁ
గంటఁగఁగట్టి రయంబునం జతు
ర్వనధుల ముంచెఁ దత్సుభట
వర్గము దోమలలీలఁ దూలఁగన్. 806

వ. అంతఁ బులస్త్యపౌత్రుండై యంభోజసంభవుం డారా
వణు విడువు మని వాలిపాలికి నొక్కదూతం బంపిన.

ఆ. ధాతమీఁద నలిగి తల్లోక మంబుధిఁ
గలుపువాఁడ ననుచుఁ గపివరుండు
లోకఁ జుట్టఁబెట్టు దుర్నీతుండు త్రిల్లి
యురుగుదెంచెఁ దాన యంతవికటము. 807

శా. ఆకంజోద్భవుప్రార్థనంబునఁ బ్లవం
గాధీశ్వరుం డంతఁ ద

ల్లోకపాలనవాంఛ మాని యట మ్రా
లోకేశుని వద్ద సురా
నీకారి దశకంధరు గెలిచె నిం
కే ద్విరదముఖప్రక్రియను
నాకారిప్రముఖామరౌఘములు దగ
బలాఢ్యుని గీర్తింపఁగన్. 309

ఆ. వృథులోకబంధకుండదే జర్జరి
తాంగుఁ డగుచుఁ బోయి హరిరథస్థ
రెండి సర్వలోకవితతి బాధించె దు
ర్జనుఁడు శిక్షఁ జెంది సాధుఁ డగుట. 310

ఆ. పరవిహింసనంబుఁ బాపవర్తనమును
జగతి ఖలుల కెన్న సహజగుణము
లట పునర్భవంబు నందియుఁ బరిహింప
మానలేరు వారు మనుజనాథ. 311

వ. పతివ్రతయైన యువతి పురుషు ననువర్తించునట్లు సాధు
త్వంబును ఖలత్వంబును జన్మజన్మాంతరంబులం బాయక
ప్రాపించు ఖలులకు నిహపరసుఖంబులు దూరంబు లగు. 312

క. ఆరావణుండు రాముని
చే రణమున నిహతుఁ డగుచు శిశుపాలుండై
ధారుణి జన్మించె దురా
చారుండును భూరిసత్త్వసంపన్నుఁడు నై. 313

వ. జరాసంధుండు హతుం డయ్యె శిశుపాలుండు మడిసిన
వాఁడుగాఁ దలంపు మిఁక దుర్యోధనదుశ్శాసనకర్ణ
శకునిశల్యప్రభృతి నరపతు లోకకంటకకారణంబున
హతు లయ్యెద రనిన విని ధర్మరా జిట్లనియె. 814

ఆ. అజరాసుతుండు హతుఁ డైనఁ బాదృశ
క్రూరధరణిపతులు కోటి గలరు
వారి నెల్ల గెలువవచ్చు నాయనుజు ల
ప్పనికిఁ బూనఁగలరె పద్మనాభ. 815

వ. అనినం గృష్ణుం డిట్లనియె. 816

శా. రాజవ్యాజమునం జనించు దనుజ
వ్రాతంబులం ద్రుంప నం
భోజప్రోద్భవుచేతఁ బ్రార్థితుఁడనై
పొల్పొంది కృష్ణాఖ్యచే
నే జన్మించితి యాదవాన్వయమున
న్విశ్వేశ్వరుం డైన యం
భోజాక్షుండఁ జుమీ మెఱుంగు మిది నా
భూపాలమూర్ధామణీ. 817

తే. అజుఁడు సృజియింపఁ బాలనం బాచరింతు
నేను; హరియించు శంభుఁడు నృపవరేణ్య
హరుఁడు నాశక్తిఁ గాని ప్రోచు సరసి జగము
లేను హరుశక్తిచే హరియింతుఁ జూడ. 818

ఉ. అక్షయదివ్యవిగ్రహుల
 నైన హరుండును నేను నిర్వ్యథా
శిక్షణరక్షణక్రియలు
 సేయుదు మెందును పూర్వభంగి నీ
రాక్షసరాజరాజి సమ
 రంబునఁ గీటకకోటిఁ బోల నే
శిక్షణ మాచరింతు నృప
 శేఖర యింతెఱుఁగంగ నేఁటికిన్. 819

తే. శివునిఁ బూజించి నను వెలిసేయునతఁడు
శివుని దూషించి నన్నుఁ బూజించునతఁడు
తామసులు వార లిరువురు ధరణిలోన
లేదు హరునకు నాకును భేద మధిప. 820

క. కాశీశ కాశికాది
క్షేత్రంబుల నిరవు రమ్ము వసింపుదు మెలమిన్
సత్రాశనులం బోచి జ
గత్రయిఁ గల దుష్టమతుల ఖండింతు మొగిన్. 821

క. శివుఁ డర్జునుండు ధరణీ
ధవ నే నారాయణుండ దైత్యవధార్థం
బవని నుదయించితిమి యి
ట్లవినాభావంబు మాకు నను హరు నెపుడున్. 822

క్రిందనసనందనుం దోషరి
కయ్యఁ బొనర్చిరి తత్పరాక్రముం
బెందును మున్నెఱుంగమి మ
దేభశతాంగతురంగపంక్తితో
నందఱు నైకమత్యమున
నాహవదోహలతన్ రయంబునన్. 328

ఉ. అర్జునకీర్తిశాలియు న
యానయశౌర్యవిదుండు నైన య
య్యర్జునుఁ డాన్నృపాలకుల
నందఱ ఘోరరణంబులోన వి
స్ఫూర్జితలీలచే గెలిచి
పుష్కలనిష్కమణిప్రతాన మ
త్యూర్జితవృత్తి వారిదెస
నొప్పుగఁ గైకొని యేఁగెఁ గ్రక్కునన్. 329

వ. ఇత్తెఱంగున సోత్తరీయు లగు ననేకదేశాధిపతుల నోడిచి యనంతకాంచనమణిగణంబు లుప్పనంబు గొని హిమాచలంబును మానససరోవరంబును నతిక్రమించి యక్షకిన్నరగంధర్వనివాసదేశంబుల కరిగినం దత్రత్యు లగు ద్వారపాలకు లర్జునున కిట్లనిరి. 330

క. మనుజులకుఁ జొర నశక్యం
బనఘా యుద్దేశ మింక నవలఁ జనకు మే

పని కిచటి కరుగు దెంచితి
వినుపింపుము నీదు తెఱఁగు విస్పష్టముగన్. 831

ఆ. అనుడు ధర్మరాజయాగార్థమై దిగ్జ
యంబుసేయ నిటకు నరుగుదెంచి
నాఁడ నర్జునుఁడ ధనంబు దప్పిరితిగా
నొస్కఁగి తద్వశగతి నుండుఁడీరు. 832

వ. అనిన. 833

ఆ. వారు నుల్లసిల్లి నానవి కమితహి
రణ్యరత్నరజతరాసు లొసఁగి
రట్లు గెలిచి ధనముపార్జించి యతఁడు ధ
నంజయాఖ్యఁ దనరె నాఁటఁగోలె. 834

వ. ఇత్తెఱంగున నుత్తరదిజ్ఞరేంద్రుల గెల్చి నరుం డనేకసర
ఖరోష్ట్రకరిహరిశతవాహ్యంబైన ధనంబు దెచ్చిసం
జూచి ధర్మజుండు. 835

క. నిజభుజబలమున ధరణీ
భుజులం దుర్జయుల గెలిచి భూనుతగతిచే
విజయము నొందితి గావున
విజయాఖ్యవహింపు మీవు విశ్వములోనన్. 836

వ. అని యతని మన్నించెఁ దదనంతరంబ. 837

ఉ. ధీచరితుం డదభ్రరవి
తేజుఁడు వాయుసుతుండు ధీరతఁ

బ్రాచికి నేఁగి యందు శిశు
పాలముఖావనిపాలురం దిరియా
మాచరులన్ జయించి గరి
మన్ మణిహాటకముఖ్యవస్తు లు
గ్వేచర *ఖేచరప్రతతి
విస్మయ మందఁగఁ దెచ్చె గ్రక్కు నన్.

ఉ. దక్షిణదిగ్జయార్థము ము
దం బడరన్ సహదేవుఁ డేఁగి వి
శ్వక్షితినాథులం దొడరి
వశ్యులఁగా నొనరించి వారిచే
సక్షయహేమరత్ననిచ
యంబులు గైకొని నీలుఁ డన్ ధరా
ధ్యక్షునిమీఁదఁ బోయిన న
తండును బోరె సహార్యశౌర్యుఁడై. 839

వ. ఇట్లు మాహిష్మతీపురపతి యగునీలుతో మహాయు
ద్ధంబు సేయునెడ. 840

ఆ. అతని యల్లుఁ డైన యగ్నిదేవుఁడు సహ
దేవుసైన్యసమితిఁ దీవ్రశిఖల
నేర్పుఁ బొడ్చె దాని నెఱిఁగి యుధిష్ఠిరుండు
ప్రస్తుతింపఁ దొణఁగెఁ బవనసఖుని. 841

* వీరవిప్రతతి—పాఠాం.

ఉ. హవ్యము మోచి తెచ్చి యజ
రాళికి హాళి సెలంగ నిచ్చుటన్
హవ్యవహాఖ్యచే వెలసి
తాగమసంతతి సంతతంబు నీ
దివ్యమహాత్త్వలీల గను
తింపఁగ నాహవనీయగార్హప
త్యావ్యయదక్షిణానలన
మాఖ్యఁ జెలంగుదు వాశుశుక్షణీ. 842

క. మారుతసఖ నీకు నమ
స్కారము ధర్మజుఁడు సేయు క్రతుకర్మం బిం
పారఁగ భవదర్థమె కా
యారయఁ దద్విఘ్నకరణ మది యుచితంబే. 843

వ. అని వినుతింప హవ్యవహుఁ
డప్పుడ మామకుఁ దెల్పి పొందునం
దనునకు రత్నకాంచనవి
తానము లెంతయుఁ బ్రీతి నిచ్చినం
గొని విజయాఖ్యుఁడై యతఁ డ
కుంఠితవైభవ మొప్ప లంకకుం
జనిచె దశాననానుజుని
పాల్కికి ప్రాప్తుల శౌర్యదీప్తులన్. 844

క. ప్రణిధిముఖంబున నానృప
మణి వచ్చుట దెలిసి యమరమాన్యుండు విభీ
షణుఁడు తన*పొలఁ గల ధన
మణినికరము కర మొసఁగె నమందవిభూతిన్. 345

వ. ఇవ్విధంబున నపాచీదిగ్విజయం బొనరించి సహదేవుం
డును నిజపురంబున కేతెంచె ని ట్లనుజానీతదిగ్విజయోపార్జి
తానంతకనకమణిరాసులఁ గాంచి యుధిష్ఠిరుం డత్యంత
హర్షితస్వాంతుం డయ్యె నంత. 346

తే. హరియును ననేకధన ముపాయన మొసంగె
నిట్లు సంపన్నుఁడై యాతఁ డీధనంబు
సద్ద్విజాధీన మొనరించి జలజనాభ
యాగ్రక్రతుక్రియ తగ నిర్వహింపు మనిన. 347

వ. కృష్ణుం డతనిం జూచి. 348

క. చేయుము క్రతూత్సవం బెడ
చేయక భద్రంబు లెల్లఁ జేకురు నీకున్
నీయనుజన్ములు నేనును
ధీయుత పరిత్యాహనమితి ధృతిఁ దోలంగన్. 349

తే. అనిన ధర్మజుఁ డానందవనధిఁ దేలి
దేవకీనందనునిఁ బ్రస్తుతించి యమ్మ

* ప్రోలఁగలిగిన—పా. ఖాం.

హాపురుషునా జ్ఞ నధ్వరాయతనముసఁ బ్రి
వేశ మొనరించె సమధికవిభవ మొనఁగ. 850

ఉ. ఆతఁటి హృద్యవాద్యనిచ
యంబులు మ్రోయ సహాయధీయుతుల్
గాలమునారదాత్రిభృగు
కశ్యపకౌశికధౌమ్యముఖ్యవి
ఖ్యాతమహామునీంద్రు లఖి
లాగమశాస్త్రపురాణపారగుల్
ధాతృసమాను లాన్నృపవ
తంసుని దీక్షితుఁ జేసి రిమ్ముగన్. 851

తే. పైలధౌమ్యులు హోతలై పరఁగి రంత
బల్ప బ్రిహ్మత్వ మప్పరాశరసుతుండు
యాజ్ఞవల్క్యవసిష్ఠాదు లైనమౌని
వర్యు లధ్వర్యు లైరి భావంబు లలర. 852

వ. మఱియు వీరలపుత్త్రపౌత్త్రులును గన్యవర్గంబులును దగ్గ
త్కర్మకరణతకుం బాలుపడి ర ట్లందఱుఁ బుణ్యాహంబు
సేయించి యుచితవిధులం బ్రివర్తిల్లుచుండి రంత. 853

మ. అహితాహంకృతిభంజనప్రథితబా
హాసీమసంపన్నుఁ డా
సహదేవుం దవు డద్దిశాధిపతియా
జ్ఞం దయాతలం బంచి యు

త్మహీపై నాల్గుచెఱంగులం గల జగ
న్మాన్యావనీదేవులన్
మహీభృద్వర్యుల వైశ్యశూద్రుల నికా
మప్రేమ రావించినన్. 354

వ. ఇట్లు వచ్చిన నానాదేశాగతజననికరంబులు ధర్మరాజు
చేత నుచితసత్కారంబులఁ గాంచి రంత. 355

తే. అపుడు ధర్మజునానతి హాస్తిపురికి
నరిగి నకులుండు ద్రోణకృపాదిగురుల
నాపగేయాంబికేయాదు లైన సర్వ
కురుకదంబంబు నెల్లఁ దోడ్కొనుచు వచ్చె. 356

చ. బహుమణిభూషణంబులు న
పారధనంబులుఁ దెచ్చి యుచితా
మహాధృతరాష్ట్రసూతసుత
మద్రమహీశసుయోధనాదు ల
న్మహిపతి కిచ్చి యందు గరి
మన్ వసియింపఁగఁ జూచి యక్కురూ
ద్వహుఁడు సపర్యలం దనిపి
వారల నెల్ల బహూకరించుచున్. 357

వ. మఱియు ద్రుపదజయద్రథభగదత్తశిశుపాలాదిమహీపాలు
కులును బలభద్రానిరుద్ధబభ్రుసారణసాంబగదసాత్యకి

వద్యుమ్నచారుదేష్ణాదు లైన యదువృష్ణివీరులును
జతురంగబలసంపన్నులై యేతెంచి రనంతరంబ. 858

ఆ. నర్తకీజనములు నటులును వేనవే
లరుగుదెంచి రమ్మహాధ్వరమున
కంత వారి నెల్ల నఖిలవాంఛితదవ్య
సమితి దొనఁగఁ బనిచె శమనసుతుఁడు. 859

సీ. అతులితభక్ష్యభోజ్యాధికారంబున
వడి దుస్ససేనుఁ గట్టడ యొనర్చి
యుర్వీసురావళి నుచితార్హణక్రియఁ
దేలింప గురుపుత్త్రుఁ బాలుపెట్టి
యఖిలరాజన్యుల నరసి పూజింపంగఁ
బటుమతి సంజయుఁ బాముకొల్పి
వివిధకృతాకృతవిజ్ఞానకలనకు
ద్రోణగాంగేయుల దొరలఁ జేసి
రాజు లిడు కానుకలు గొన రాజరాజు
నర్థనియతి నియోగించి యవనిసురుల
కపరిమితదక్షిణ లొసంగఁ గృపునిఁ బనిచె
నఖిలధర్మవిదుండు ధర్మాత్మజుండు. 860

వ. మఱియు విదురాదిసుహృజ్జనంబులం దగువారల సర్వో
పనుల నిలువ నియమించి భూసురుల కనేకశతసహస్ర
యుతధేనుమణికనకాన్నదానంబు లొసంగుచు యథోక్త

విధి రాజసూయము గావించె నిట్లు దినపంచకంబును
గడచినయనంతరంబ యాజ్ఞవదినంబునందు. 361

తే. అఖిలమానివరేణ్యులు నవనిపతులు
సర్వభంగి సమాసీను లైనఁ జూచి
యగ్రపూజ యెవ్వరి కాచరింపఁ
బోనగు నని శాంతనవు ధర్మపుత్త్రుఁ డడుగ. 362

వ. అద్దేవవ్రతుం డిట్లనియె. 363

తే. సర్వయజ్ఞమయుండును సర్వగతుఁడు
మానిహృత్పద్మసద్ముండు దానవారి
పద్మనాభుండు దేవకీపట్టి దక్క
వేఱొకఁడు పూజనీయుఁడే ధారుణీశ. 364

వ. కావున సర్వలోకనమస్కృతుండును నిగ్రహానుగ్రహ
దక్షుండును నగు కృష్ణదేవుఁ బూజింపు మనవుడు నట్ల
యద్దేవుం బూజించిన. 365

తే. యమతనయుచేతఁ బూజితుఁ డై విహాయ
సమున గ్రహజాలమధ్యభాస్కరునికరణి
ననుపమాచ్ఛచ్ఛవిస్ఫూర్తి నతిశయిల్లె
నంబుజాక్షుండు రాజసభాంతరమున. 366

సీ. అప్పుడు శిశుపాలుఁ డత్యంతకుపితుఁ డై
యాపగేయునిమీఁద నాగ్రహించి

వీఁడు వృద్ధుఁడు శాస్త్రవిదుఁడు గాఁ డవనీశ
ధర్మం బెఱుంగఁడ ధర్మజుండు
దలఁకె యాపగాసుతుఁ దద్బోధితుం డయి
సహదేవుఁడును బూజ సంఘటించె
సత్యప్రతిజ్ఞులు శాస్త్రజ్ఞులును నగు
రాజుల నెల్లఁ దిరస్కరింతు
రిట యపూజ్యులు పూజ్యులు నగుదు రెచటఁ
బూజ్య లవమానసాప్తి చేఁ బొలుతు రెపుడు
నచట దుర్భిక్షభయమరణాదికములు
సంభవిలు నిక్కమం బిది శాస్త్రసరణి. 867

తే. పెద్ద లుండంగ నీచులఁ బిలిచి తెచ్చి
పూజసేయు టనర్థంబు బుధజనంబు
లందు సర్వవినాశంబు నపయశంబు
శ్రమము నరకంబుఁ గర్తకు సంభవించు. 868

వ. అని పల్కి శిశుపాలుండు. 869

క. తనవాసి యెఱుఁగనేరని
జనములయిండ్లకును బోవఁ జనఁగా దని ది
గ్గన లేచిపోవ నపు డా
తని మరలఁగఁ దెచ్చె ధర్మతనయుఁడు నెమ్మిన్. 870

వ. అప్పుడు భీష్ముండు శిశుపాలు నుద్దేశించి ధర్మపుత్త్రు

నితో నీసారమేయంబు వోయిన సేమ యగు నేల
యూరార్చి తెచ్చి తనిన వాఁ డిట్లనియె. 371

సీ. తల ప్రొల్లు గడుఁ దెల్లఁగా నరసినం
తం బెడ్డవే నీవు నీ
బలము దృష్టియుఁ బుష్టియుం బొలిసె ని
ర్భాగ్యుండవై పుత్త్రదా
రలఁ బోషింపఁగ నోప కీగతి నిర
ర్థబ్రహ్మచర్యవ్రతం
బిలపైఁ దాల్చితి రాజ్యభారకథ నీ
కెందైన సిద్ధించునే. 372

క. ఇల నృపుల గెలువ నేరుపు
గల దింతియకాని నీకుఁ గార్యాకార్యం
బుల నెఱుఁగఁ బోలునే రా
జులసభ నార్యగతిఁ బలుకఁ జొప్పడియున్నే. 373

వ. నీ వుపదేశించు ధర్మంబు ధర్మరాజునకు నీకునుం గాని
రాజవర్యులకు సమ్మతంబు గాదు కులాచారపరిభ్రష్టు
లును రసవిక్రయోపజీవులు నైన యాదవుల నధికులంగా
నెన్నందగునే యనినం గోపించి సహదేవుం డిట్లనియె. 374

ఉ. యోగఫలప్రదుం డగు జ
నార్దనుఁ భూజ్యునిఁగాఁగఁ జెప్ప వి

శ్వాగమపారగుండు నరి
దాత్మజుఁ దప్పులకు లసహింపరే
కీగతి దుష్టభాషణము
లెవ్వఁడు పల్కిన వానిమౌళిపై
వేగమె వామపాద మతి
విశ్రుతలీల ఘటింతు నీసభ౯. 875

క. ఎఱిఁగించువాఁడు భీష్ముఁడు
మఱి శ్రీహరి పూజ్యుఁ డాశమననందనుఁ డి
త్తఱిఁ బూజకుఁ దిప్పనికిం
గొఱఁత గలదె శ్రుతిహితం బగు నిక్కముగ౯. 876

వ. అనియె నంత నాశిశుపాలుం జూచి శాంతనవుం డోరీ మాతృసంబంధదోషంబున దయాపరుండైన ధర్మరాజు భోజనార్థంబు పిలిచిన వచ్చితివి యథేష్టంబుగా భుజియించిపోవుట గాక యులర్కంబు పురోడాశం బపేక్షించునట్లగ్రపూజంగోరందగునే వృథార్హానర్హగర్హణంబు రాక్షసులకు సహజగుణంబు జన్మగుణచేష్టాదులవలన నీవు రాక్షసుండ వనిన వాఁ డజాతశత్రున కిట్లనియె. 877

చ. కులబలశాలు లైన నృప
కుంజరుల౯ వెలిచేసి దుర్మతి౯
మలసితి ధర్మరా జనున
మాఖ్య నిరర్థక మయ్యె నీకు వీ

రలఁ బిలువంగఁ బంచుట తి
రస్కరణం బొనరింపనొక్కొ యీ
యలఘుబలాఢ్యు లైన నృపు
లల్పులె నీమదిలోన నెంచుమా. 378

ఆ. కుమతి వగుచు గోపకునిఁ బూజసల్పితి
బ్రహ్మచారిమాట పాటిచేసి
యేమి గల్గె దీన నీరాజవర్యుల
క్రతువు కనుచుఁ బిలిచి గర్వ మణఁప. 379

వ. ఈగోపాలబ్రహ్మచారులకును నీయనుజు లగు భీమవిజ
యులకును వెఱచువా రిం దెవ్వరు లేరు జరాతనయుఁ
గపటవేషంబున జయించుట యాదిగాఁ దత్పరాక్రమం
బందఱకుఁ దెల్లం బయ్యె నని పల్కిన. 380

ఉ. అప్పుడు భీమసేనుఁడు ల
యాంతకుఁడై వడిఁ గ్రోధ మత్తులం
జొప్పిల నిల్చి లేచి గద
చే నమరించినఁ దత్సభాసదుల్
దప్పక చూచి చైద్యుఁడు వృ
థా కలహించె మరుత్తనూభవుం
డిప్పుడు రాజబృందముల
నిందఱఁ ద్రుంచఁగ నున్నవాఁ డొగిన్.

క. మనము మన దేశమునకుం
జను టుచితం బార్యనింద సల్పెదు నీదు
ర్జనుపల్కులు వినఁగూడున
వినినం బుణ్యములు దొలఁగు వేయును నేలా. 382

చ. చెలఁగి మహాన్నిగర్హణము
సేయుదురాత్మకుఁ బట్టి యాసభన్
వెలువడఁజేయఁగాఁ దగు వి
వేకసమన్వితు లట్టు సేయఁగా
నలవడదేని కర్ణయుగ
మప్పుడె పాణులఁ గప్పి గ్రక్కునన్
దొలఁగుట మేలు దచ్ఛ్రవణ
దుష్కృతి వాపఁగఁ గోరి రేనియున్. 383

వ. అని పలికి రంత. 384

తే. పలుమఱును జైద్యుఁ డాడుదుర్భాషణములు
కృష్ణవిద్వేషులకుఁ జాలఁ బ్రియము లయ్యె
నంతఁ గ్రోధాగ్ని కిది వేళ యగున యనుచు
గంధవహసుతు వారించె గంగపట్టి. 385

వ. అప్పు డాశిశుపాలుండు భీష్ము నవలోకించి. 386

ఆ. వాయుతనయు నేల వారించెదవు భీష్మ
శౌర్యధైర్యధుర్యదండమునను

వీఁడు బాలుఁ డీవు వృద్ధుండ విద్దఱుఁ
గదనధరణి నెదురఁగలరె సన్ను. 387

ఉ. ఈసున నీసభాస్థితమ
హీతలవల్లభతల్లజౌఘముల్
బాసటగా ననుం దోడరి
బాహుబలంబునఁ బోరఁ జూచెదో
వాసిగ నట్ల సేయు మగ
వాఁడవయేని మెఱైన నాదుబా
ణాసనముక్తబాణహతి
నంతకుపోలు గనంగఁజేసెదన్. 388

వ. అని పల్కి స్వపక్షక్షత్త్రియుల నెల్లం గూర్చుకొని
యుద్ధసన్నద్ధుండై యుండె నంత భీమార్జుననకులసహదే
వులునుం గదనంబునకు నాయితంబై రప్పు డక్కలకల్లం
బాలించి ధర్మనందనుం డయ్యాగంబునకు నంతరాయం
బు సంధిల్లె నని చింతించిన నాపగానందనుం డతని
కిట్లనియె. 389

ఉ. యాగఫలప్రదాయకుఁడు
యోగమయుండును నైన కృష్ణుఁ డీ
యాగముఁ గాచుచుండఁగ నృ
పా యొకవిఘ్నము గల్గనేర్చునే

యాగరుడాంకుఁ డిప్పుడ దు
రాత్మునిఁ జైద్యుని నుక్కడంచి యీ
సాగరమేఖలాభరము
నయ్యనఁ బాపుఁ గలంగ నేటికిన్. 890

వ. అని బోధించె నంత దుర్యోధనుండు కర్ణుం జూచి. 891

క. సమయం బెబ్బెన్ మనకుం
గ్రమమున మనసేయ నున్న కార్యంబు నృపుల్
దమపనికై చేసెద రీ
యమితబలుల గెలువ నేరికయినను దరమే. 892

వ. మనబలం బెల్ల నొక్కడఁ జేర్చికొని శిశుపాలుం గలసి
నిలుతమే యనినఁ గర్ణుం డిట్లనియె. 893

తే. ఇదియె కర్జమ్మనుచు మహీతలేశ
తొడరి యీరాజసంఘంబుతోడఁ గూడి
పాండవేయుల గెల్చి యఖండమహిమ
నిపుడ తద్రాజ్యము హరింపు మేల దలఁక. 894

వ. అనియె నంత ద్రోణుండు దుర్యోధనుం జూచి. 895

ఉ. ఏల దురూహ సేసెదు మ
హీశ్వర ధర్మపరుండు ధర్మజుం
డేల నలంగు దుష్టనృపు
లెల్లఁ గ్రమంబున నంబుజాక్షుచేఁ

గూలఁగ నున్నవారు హరి
కుంభినిభారముఁ బాపఁ బూని యీ
పోలికఁ బుట్టెఁ జైద్యనృపు
పోఁడిమియుం జెడు నీక్షణంబునన్. 396

తే. అని నివారించె నంత శతాపరాధ
పూర్తి యగునంత దమఘోషపుత్త్రుఁ దునుమఁ
దలఁచు వసుదేవనందను తలఁపుబడిన
వచ్చి చక్రంబు తత్పార్శ్వవర్తి యయ్యె. 397

శా. అంతం గృష్ణకరాగ్రముక్తమయి యు
ద్యద్భానుకోటిప్రభా
క్రాంతానంతదిశాంతమై నిగిడి చ
క్రం బన్యరాజన్యదు
ర్దాంతప్రక్రియ నేఁగి చేదివిభుమ
స్తంబున్ వెసం ద్రుంచెఁ ద
త్క్రాంతారాతివసుంధరాధిపులు వి
భ్రాంతాత్ములై తూలఁగన్. 398

ఆ. విరులవాన గురిసె మిన్నును దిక్కులుఁ
దెలివిఁగాంచె మ్రోసెఁ ద్రిదివవేశ్య
లాడి రుచితగతులఁ బాడిరి గంధర్వ
పతులు చైద్యనృపుఁడు పడినయంత. 399

క. ఆయెడ నాశిశుపాలుని
కాయములోనుండి యొక్క ఘనతేజము నా
రాయణునిఁ జొచ్చె యాగస
భాంతసమస్తజనము లచ్చెరువందన్. 400

సీ. అప్పుడు ధర్మజుం డవనీసురక్షత్ర
సంఘంబునకుఁ బూజ సంఘటించి
యట వసిష్ఠుండు పూర్ణాహుతి గావించి
యాగశేషక్రియ లాచరింప
నవభృథస్నానపూతాత్ముఁడై సన్ముని
గణముల నుచితదక్షిణలఁ దనిపి
యఖిలబంధుజనాళి కర్ఘ్యపూజ లొసర్చి
వెలయ నిజస్థానములకుఁ బనిచె
నట్లు కృతకృత్యుఁ డగు సన్మహామహీశు
క్రతువుచేఁ దృప్తుఁ డగుచుఁ బురందరుండు
పాండునరపాలశేఖరు భవ్యతగ ని
జాసనార్ధంబునం దిడి యాదరించె. 410

వ. కృష్ణదేవుండును శిశుపాలదంతవక్త్రాది దుష్టజనంబులఁ ద్రుంచి ధరణీభారంబు వారించుచు బంధుజనపూజితుండై బలభద్రసహితంబుగా నిజపురంబునకుం జనియె నిట్లు. 402

తే. జయవిజయులఁ బ్రసాదభాజనులఁ జేసి
సిద్ధజేగీయమానప్రసిద్ధమహిమ

నలరి ద్వారకలోపల నధివసించె
నఖిలలోకప్రభుండు చక్రాయుధుండు. 403

క. ఋషిజనములగు జయవిజయులు
ద్విజశాపం బెడలి దివ్యదేహాకలితులై
నిజసుకృతవశంబునఁ జని
భుజగశయనుపార్శ్వచరతఁ బొలిచిరి మరలన్. 404

క. ఈయుక్తమకథ వినినను
ధీయుతులకు రుజలు తొలఁగుఁ దేజఃకీర్తి
శ్రీయాభివృద్ధి దనరుం
బాయుం గలుషములు విష్ణుభక్తియు నొసరున్. 405

వ. అనిన విని నైమిశారణ్యవాసులు వ్యత్యస్తరామనామప
రాయణుం డగు చోరుని తెఱం గెట్టి దయ్యె నని యడిగిన.

శా. షట్కంజాంతరతత్త్వవిన్మునిజన
స్వాంతాంబుజానందకృ
త్త్వట్కంజాస్త భవా భవాబ్ధితరణీ
దిఙ్మండలీచేల పా
పృట్కల్లాంబుదనీలకంధర ధరా
భృద్ద్వారిచాపా బల
ద్విట్కుంభి ద్యునదీ సుధానిధి సము
ద్దీప్తావదాతాంగకా. 407

జ. సురవరనరతిర్యక్స్థా
వరనానాజంతుపూర్ణఘనఝషభవాంత
స్థిరఫలకలితశరీర
స్ఫురదురుయజ్ఞాంగ ఘనస్త్రశోభితగంగా. 408

కలహంసవృత్తము.

యమిజనాఘహృదయాబ్జనివాసా
ప్రమథనాథ హిమపర్వతపుత్రీ
కమన భక్తజనకామితదానో
ద్యమసురాగమ మహాగమవేద్యా. 409

గద్య. ఇది శ్రీమద్గురుకరుణాతిశయలబ్ధకవితావైభవ
యాముడులపల్లి శంకరమంత్రితనూభవ సుధీజన
విధేయ భవానీశనామధేయప్రణీతంబైన
స్కాందపురాణంబున ధర్మఖండం
బను ప్రబంధంబునందు
సప్తమాశ్వాసము.

శుభమస్తు

అవిఘ్నమస్తు

# ధర్మఖండము



## అష్టమాశ్వాసము



శ్రీగౌరీపదలాక్షా
యోగాపాటలకు[illegible]
యోగినికురుంబకాంత
త్యాగార్చిత గగనకేశ హర మల్లేశా. 1

వ. అవధరింపుము వివిధపురాణకథాకథనప్రఖ్యాతుం డగు సూతుండు శౌనకాదిమునిముఖ్యుల కిట్లనియె న ట్లచ్చో రుండు తపంబుసేయుచుండ ననేకమన్వంతరంబులు గడచినయనంతరంబ తులస్య భరద్వాజ గౌతమ వృద్ధగౌతమ కౌశికవసిష్ఠాదు లైన మహర్షులు పదివేవురు శిష్యులం దారును హిమశైలంబు డిగ్గి యమ్మార్గంబున జనుదెంచుచు. 2

క. ఎడ నెడ శివ శివ యనుచున్
బడి బడి శ్రీరామ రామ పాహి యనుచు ని
వడరంగ వేదోక్త విధుల్
గడు వేడ్క జగద్ధితార్థగరిమ వొడువ్రునుగా. 3

ఉ. అంగపరిశ్రమము బడర
నమ్మునిపుంగవు లప్పథంబునన్
జంగమవేదశాస్త్రముల
చందమునం జని కాంచి రొక్కచో
టం గదభంగసౌరభవి
రాజితపుష్పఫలాభినమ్రనా
రంగలవంగలాంగలిక
రంటకముఖ్యమహీజవాటికన్. 4

ఉ. భృంగమయూరకీరపిక
పేశలసూక్తులు ముక్తికామినీ
సంగతివైఖరుల్ దెలుప
సంయము లత్తరువాటిఁ జొచ్చి త
న్మంగళవృక్షమూలతల
మంజులవేదుల విశ్రమించి రం
తం గడుఁజల్లనై మలసె
దక్షిణదిక్పవమానడింభముల్. 5

ఉత్సా. పారిజాతమాతులుంగపనసకదళికామ్రమం
దారనారికేళముఖ్యధరణిజాతజాతముల్
సారతరుల కెన యనంగఁ జాలు మేలు సెలయ నిం
పారు తత్ఫలములు చేత నందికొనఁగ ననువగున్. 6

క. తృణగుల్మరహితమై ద
ర్పణసన్నిభవిమలధరణి భాసిల్లుచు నీ
క్షణపర్వనిర్వహణతరు
గణముల నొప్పారు నది జగన్నుతమహిమన్. 7

క. ఆవిజయాహ్వయచోరుత
పోవిస్ఫూర్తికిని బెగడి భూతము లైదుం
బావనమతి సృజియించిన
యావనివిభవంబుఁ బొగడ నజునకుఁ దరమే. 8

ఆ. జాతివైర మెడలి జంతుసంతతి మహో
దారమైత్రి నలరఁ దద్వనంబు
విబుధగణనితాంతవిహరణస్థానమై
యఖిలసౌఖ్యహేతు వగుచుఁ దనరు. 9

తే. దేవవల్లభమహిళాప్రదీప్త మగుచుఁ
బ్రబలసుమనోమనోజ్ఞరంభావిలాస
శోభితం బయి యవ్వని చూడ నొప్పు
నందనవనంబుగతిఁ గడు నంద మగుచు. 10

సీ. హరినీలనీలబంభరడింభనికరంబు
చొప్పు పెన్నెఱివేణియొప్పు నెఱప
నరుణారుణస్ఫురదురుపల్లవశ్రేణిఁ
గెంగేలిపోలిక గీలుకొనఁగ

సచ్ఛాచ్ఛతరుసుమగుచ్ఛవిలాసంబు
గల్గి చన్గుబ్బలయొప్పుఁ జెల్వ
మంజులలతికాసమంజసవైఖరి
రంగైన మృదువెలుంగు దోఁప
తే. నవమకుసుమవిలాసంబు హాసలీలఁ
దనర నిశ్శ్రేయసాంగనం దార్ఢ్యసక్తి
శంబళియుబలె వనలక్ష్మి సంయములకు
సలలితామోదవిస్ఫూర్తి సంఘటించె. 11

సీ. నానాపలాశసంతానాన్వితం బయ్యు
సుమనఃకదంబ విస్ఫురణఁ దనరి
మన్మథవిభ్రమమహిమ రంజిల్లియు
నీలకంఠప్రీతినిరతి వఱలి
పల్లవరాగసంపద్భాసురం బయ్యు
ద్విజపక్షవ్యాప్తమై రేఁజరిల్లి
యవిరతమధుపకులాసక్తిఁ జెందియు
నత్యుదారాగమాఖ్యతఁ దనర్చి
తే. నవ్యపుష్పితగణికాసనాథమయ్యు
సతతపున్నాగసంగతి నతిశయిల్లి
వెలయు నయ్యాశ్రమారామవిపినరాజిఁ
గాంచి మునివర్యు లత్యద్భుతాక్రాంతు లగుచు. 12

ఆ. నందనంబు కర్మబృందానుసారిత
సంఘటించు భోగసముదయంబు
జంతువితతి కిలన సౌఖ్యంబు లొనగూర్చు
నిదియె నందనమున కెక్కు డగుచు. 13

ఆ. నందనంబు జనమనస్స్థానసంధాన
తారతమ్యభోగదంబు గాని
యవ్వనంబుకరణి నెల్లజంతువులకు
ననిశసౌఖ్యహేతు వగునె తలఁప. 14

మ. అని వర్ణించుచు మౌనిపుంగవుఁడు శి
ష్యవ్రాతముల్ దాదు స
వ్వనభూజంబులలోనఁ గ్రొమ్మరయుచు భా
వంబుల్ మహాశ్చర్యస
ద్వసథిం దేలఁగ హాళి నొక్కెడ స
ర్వప్రాణిలోకైకవెరా
హానమాకందమహీజమూలమునఁ జె
ల్వార న్సమాసీనుఁడై. 15

తే. కొంద ఱందంద ఫలమూలబృంద మర్థి
రాసులుగఁ జేసి రవుసు పేరాసకలిమిఁ
దృప్తి నొందక కొందఱు దిరుగుచుండి
రన్వసిద్ధిగాంచిత యలముకొనఁగ. 16

క. ఆమునిముఖ్యులు గొందఱు
కామక్రోధాదిలోభకలితాత్మకులై
వేమఱు వాదించిరి తా
రామ్యున ఫలమూలసంగ్రహావసరములన్. 17

వ. తదనంతరంబ వారలందఱును స్నానసంధ్యాద్యుచితవి
ధులు దీర్చి ఘనసారగంధబంధురంబులును సుధామధు
రంబులు నైన ఫలమూలంబుల నాహారకృత్యంబులు
నిర్వర్తించి పరితృప్తులై పురాణపఠనశ్రవణాదిసద్వర్గసం
బుల నద్దినశేషంబు గడపి రాత్రి యగుటయు నిద్రించు
చుండి రంత. 18

సీ. మహితతపఃక్రియామహిమచే మూర్తిమ
ద్దీప్తిహోత్రునిభాతి వెలయువానిఁ
జిత్తనాశకకర్మముల్ శ్రీరామునందిడి
తన్మయత్వంబునఁ దనరువానిఁ
గార్శ్యంబుఁ జెందిన గాత్రంబుచే ద్వితీ
యాచంద్రరేఖ వడి నలరువానిఁ
బుటపాకమున శుద్ధిఁ బొరసినకనకంబు
గతి నకల్మషలీలఁ గ్రాలువాని

తే. నిర్జితక్రోధకాముఁడై నెగడువాని
నఖిలజీవప్రియంకరుండైనవాని

మౌనిపుంగవు నొకని నమ్మౌనివరులు
స్వప్నమునఁ గాంచి రపుడు సుస్వప్నదృశు. 19

వ. వెండియు. 20

శా. ఆమౌనీంద్రులకు న్వరం బొసఁగ న
భ్యర్ణక్షితి న్నిల్చు శ్రీ
రాముం డైవతసార్వభౌము దనుజేం
ద్రవ్రాతభీము న్ఘన
శ్యాము న్సర్వగుణాభిరాము రఘువం
శాంభోధిసోము న్బలో
ద్దాముం బావననాముఁ గన్గొనిరి సీ
తారాము నాసంయముల్. 21

సీ. నిరుపమసౌందర్యనిర్జితపంచేషు
హారకిరీటకేయూరభూషు
మందస్మితాంచితసుందరాస్యవిలాసుఁ
బృథులకాంచనమయపీతవాసు
సనకాదిసన్మునిసముదయసంభావ్యు
భరతలక్ష్మణముఖభ్రాతృసేవ్యు
శ్రీకరభక్తలోకైకరక్షణదక్షు
మందారసుమదామమహితవక్షు

తే. రాము శతకోటిభాస్కరధాముఁ గాంచి
మేలుకొని రామునాము మమ్మునులు మనుచు

హర్షపరవశు లగు నమ్మహర్షులకును
తృణసమానాశులీల నాతృణద వేగ. 22

వ. అంత స్నానసంధ్యాదికాల్యకరణీయంబులు నిర్వర్తించి సభకై కూర్చుండ వారలకడకు నారదమునీంద్రుం డేఁగుదెంచిన నందఱుఁ బ్రత్యుత్థానంబుచేసి యర్ఘ్యపాద్యాదిసత్కారంబు లాచరించి బహూకరించి సుఖాసీనుం గావించి రందు వసిష్ఠమునీంద్రుం డమ్మునీంద్రునితో ని ట్లనియె. 23

ఉ. ఎవ్వనియాశ్రమం బిది ము
నీంద్ర! మహేంద్రవనంబురీతిఁ బా
నివ్వసుధం గరం బలరె
నీడిత సౌఖ్యగమానసమృద్ధిచే
నివ్వని విశ్వకర్మ రచి
యించెనొ కాక మయుం డొనర్చెనో
యివ్విధ మంతయుం దెలిపి
యందఱ కింపు ఘటింపఁ జేయవే. 24

క. పదునాల్గులోకముల నిం
పు దలిర్పఁగ సంచరించు ప్రోడవు నీకుం
విదితం బశేషవృత్తం
బది గావునఁ దెల్పు మివ్వనావనిమహిమల్. 25

వ. అని పలికి యంతియ కా దొక్కవింత విను మని యిట్లనియె.

క. అస్వప్నమానివర మా
సుస్వప్నములందు సౌఖ్యశుభచారిత్రున్
భాస్వత్ప్రభుఁ గంటిమి రా
మస్వామిన్ మది భజించుమహితాత్మకునిన్. 27

శా. అత్యుత్కృష్ఠితి రామనామజప మ
త్యాసక్తిమైఁ జేయుచున్
సాక్షాదగ్నియపోలెఁ గ్రాలెడు ముని
స్వామిం గృపం బ్రోవఁగా
సాక్షాత్కారముఁ జెందు రాఘవుని వి
శ్వత్రాణపారీణు భ
క్తశ్రేయంకరుఁ గంటి మిందఱము మా
కన్నుల్ గడుం జల్లఁగన్. 28

వ. అని స్వప్నవృత్తం బెఱింగించి వెండియు. 29

ఆ. అనఘ రామ రామ యనుమధురస్వరం
బిపుడు వినఁగ నయ్యె నివ్వనమునఁ
దజ్జపంబు సల్పుధన్యునిఁ జూడఁగాన
మఖిలతరువులందు నరసి యరసి. 30

ఆ. ఆమనోజ్ఞమృదురవాకర్ణనమునఁ బ్ర
మోదవార్ధిఁ దేలి మునిలలామ,
యొండుచోటి కరుగ నుల్లంబు గొలుపక
యుంద యున్నవార మిందఱమును. 31

క. ధరఁ బుణ్యక్షేత్రమునకు
నరిగినగతి నలరె మానసాబ్జములు మునీ
శ్వర యిన్నవి మును చూచిన
కరణిం గనుపట్టెఁ బ్రీతి గదిరె న్నాకుఁ. 82

వ. ఈకారణం బేమియో యింతయుం దెలియ వివరింపు
మనిన నద్దివ్యముని యిట్లనియె. 83

సీ. ఎఱిఁగింతు మునులార యితిహాస మొక్కటి
శ్రోత్రుల కత్యంతశుభకరంబు
సర్వార్థులకు నిఖిలార్థప్రదంబును
బుత్రార్థులకు బహుపుత్రదంబు
భుక్తిముక్తిప్రదంబు నపారసంసార
తరణంబు వినుఁడు చిత్తంబు లలర
మున్ను నేఁ గైలాసమునకు మహేశు జ
గత్పతి సభను శంకరునిఁ జూడఁ

తే. గోరి యరిగితి నరిగి తద్ద్వారసీమ
నతులబలదీప్తులైన శశాంకమకుట
కింకరావళి వారింపఁ గెలన నిల్చి
యుంటి నహోన్మాదమున నటు లుండునంత. 84

ఉ. శంకరకింకరాళి తొలుత
నత్యుత్సవం గని పూజ నల్పిని

శ్వంతఁ బ్రదక్షిణించి నుతి
సల్పి నమస్కృతిపూర్వకంబుగాఁ
బొంతముతో నతండు నొక
పుష్కరయానవరాధిరూఢుఁడై
శంకరసన్నిభుం డగుచు
శాంతరభూమికిఁ దాల్చె గ్రిక్కునన్. ౩౫

ఉ. అతనిం గన్గొని యాతఁ డెట్టిసుకృతం
బార్జించెనో యెట్టిస
చ్చరితముల్ సల్పెనొ శంభుకింకరు లుదా
రప్రీతి నర్చింప నీ
స్థితిఁ గాంచెం దగు నంచు నెంచి తదనూ
నస్నిగ్ధ తేజంబులో
ద్ధతికిం బ్రీతిలి మ్రొక్కి పల్కె నితఁ డు
త్పప్రీతి నందిల్లఁగన్. ౩౬

ఆ. ఓమహాత్మ యెట్టియురుతపం బాచరించి
తేమి పూజ సల్పి తెట్టితీర్థ
యాత్ర సల్పితివి కృతార్థుఁడవై యెట్టి
దాన మిచ్చి తీ వనూనమహిమ. ౩౭

క. * ఏసుకృతమహిమమునఁ గై
లాసావాసుఁడవై చెలంగితి విటు మఱి

---

* ఏసుకృతమునం గైలాసావాసుఁడవై చెలంగితి విటు—వా. ప్ర.

న్నిసుకృతుల ్రైన శివా
వాసము దుర్లభము ప్రమథవర యూహింపన్. 38

క. ఘోరపిశాచనిశాచర
వీరులకుం గ్రూరులకును వీక్షింపఁగఁ జె
న్నారఁగ నంట నశక్యము
తారక శైలంబు ప్రమథతతికిం దక్కన్. 39

వ. నీ వేమి పుణ్యంబునఁ గైలాసయుతుండ వైతి వెఱింగిం
పు మనిన నాకు నతం డి ట్లని చెప్పె. 40

మత్త. ఏను పూర్వభవంబునందు మహీసురుండ ఖలుండ దు
ర్ధానవస్తుతతిప్రతిగ్రహదర్పితుండ నిరాకృతిన్
మానిపుంగవ విప్రకర్మము మాని శూద్రకులోచితం
బైనధర్మమునం జరింతు దురంతదుష్కృతకారి నై. 41

తే. బంధకీతతసురతసంబంధపరతఁ
బతితపాషండదుర్జనప్రతతిఁ గూడి
సతతవృజినద్రుమండవసంతమూర్తి
నగుచు విహరింతు నార్యులు నను నగంగ. 42

క. ఈరీతిఁ గల్మషంబు ల
పారముగా నాచరించి పడపడి నేల
త్కారణమునఁ గిటికరట
ఘోరశువకజనిళతాప్తిఁ గొంటిలితి ధరణిన్. 43

మత్త. ఘోరజన్మము లెత్తి యాగతిఁ గుంది కర్మవశంబునన్
దూరసంచరణాతిశక్తియు దూరదృష్టియుఁ గల్గి చె
ల్వారుగృధ్రమనై జనించితి నంత నో మునిముఖ్య త
ద్ఘోరణాకృతిఁ గాంచి భూతవితానముల్ వెఱఁ గందఁగన్.

న. అంత ననేక కాలంబు గడచినయనంతరంబున. 45

తే. ఆమిషార్థినై ఘోరవనాంతరమున
దిరిగి యచ్చట నాహార మబ్బ కునికి
క్షుత్పిపాసలచేఁ గడుఁ గుంది యంత
నొక్కదేవాలయమునకుఁ నొయ్యఁ జేరి. 46

మాలిని. ధవళఖగవిభాస్వద్వజ్రలేపస్ఫురత్త
ద్భవభవనసమంచ ద్భర్మకుంభంబుపైఁ బ్రా
గ్భవకృతసుకృతౌఘప్రాప్తి నెక్కి యం దా
సవిధవివిధతిర్యక్సంతతిం జూచుచుండన్. 47

ఉ. ఆసమయంబునందు మృగ
యారతిచే నొకలుబ్ధకుండు బా
ణాసనబాణపాణి విల
యాంతకుఁ బోలికె నేఁగుదెంచి యు
ల్కాసదృశాశుగంబునఁ జ
లంబున సేసి మహేశ్వరాలయా
భ్యాసితశాతకుంభకల
శాగ్రసమాశ్రితతద్విహంగమున్. 48

క. వ్యాధధనుఃప్రేరితశర
బాధఁ గలఁగి పూర్వపుణ్యపరిపాకమునన్
క్ష్మాధరపుత్రీశయుతో
త్సౌధాగారంబు చుట్టుఁ దిరిగితిఁ దెలియన్. 49

ఆ. అటుఁ బ్రదక్షిణత్రయానంతరమున న
ప్పక్షితనువుఁ దొఱఁగి యాక్షణమున
దివ్యతనువుఁ దాల్చి దివ్యగంధాంబర
భూషితుండ నైతి బుధులు పొగడ. 50

వ. ఇట్లు బలాత్కారకృతశివప్రదక్షిణభావంబున నప్సరోగ
ణసంకీర్ణంబైన దివ్యవిమానం బారోహించి తేజఃపుంజ
రంజితసకలదిఙ్మండలుండ నై గంధర్వగానంబు వినుచు
విద్యాధరకదంబంబులు గొలువ నాకలోకంబునకుం జని
పురందరాదిబృందారకబృందంబులచేతం బూజితుండ నై
చిరాయు వనునామంబున ననేకకాలం బందు వసియిం
చితి ననంతరంబ యొక్కనాఁడు ప్రసంగవశంబున దివ
స్పతి వాచస్పతి కిట్లనియె. 51

మ. అతులానందకరంబు నందనవనం
బారామ, మిందేవతా
ప్రతతుల్ గింకరు, లద్రిభేది పవి శ
స్త్రం, బీశచీదేవి స్తు

త్సతి, స్వర్గంబు పురంబు, సద్గురుండు వేం
చ సిన్నిన్ను నా కిట్లు శా
శ్వతసామ్రాజ్యయుతుండ నేనకద జే
వా యిత్రిలోకంబునన్. 52

క. అనవుడు నీయైశ్వర్యం
బనిత్యతాహేతువునఁ గ్రియాజనితముగా
ననుమేయింపం దగినది
ఘనవాహన యనుచు నతఁడు గ్రమ్మఱఁ బలికెన్. 53

వ. అప్పలుకులు విని యైశ్వర్యతారతమ్యగణనాప్రసంగం
బున సభ్యులకు వివాదం బైన నవ్వివాదశాంతిఁ గోరి
పురోహితబోధితుండై పురుహూతుండు సభ్యులుం
దానును మత్సన్నిధి కేతెంచి తద్వృత్తాంతంబు వివరిం
చిన సకలశాస్త్రసమ్మతంబుగా నే నిట్లంటి. 54

క. పొందుగ విభవంబు క్రియా
బృందజ మస్థిరము శక్ర పృథుఁడై తన్నా
*నంద మొకటియు నకర్మజ
మిం దనుమేయంబుగా దక్షీణ్యప్రాప్తిన్. 55

సీ. దృశ్యత్వకారణస్థితిచేత సకలంబు
నస్థిరం బగు, నమరాధినాథ

* (1) నంద మొకటియుఁ గర్మజ, మందను మేయంబు — అని యొక వ్రా. ప్ర.
(2) నందంబొకటియుఁ గర్మజ, మ్మందనుమేయమ్ము — అని తక్కిన వ్రా. ప్ర.

పదుమువ్వురింద్రుల ప్రకటితైశ్వర్యంబు
గనుఁగొనిసాఁడ నాకన్న లలరఁ
నంతంత కనువయ్యె నవలి శతక్రిలసిరి;
యాద్యశక్రునిసతి యైనశచికిఁ
బరిచారికాకృతిఁ బరగ నిప్పటి శచి
యిది యంతయును నాకు విదిత మయ్యెఁ

తే. గాలయుగధర్మభేదముల్ గలుగు నిట్లు
యప్పుడప్పుడు ప్రాణుల కదియె *యిచటఁ
బరమసౌఖ్యంబుగాఁ గనుపట్టుచుండు
ననుచుఁ బల్కిన విని యిందుఁ డనియె మరల. 56

తే. ఇవ్వివాదంబు శాంతించె నింక నొకటి
యడిగెద శివప్రదక్షిణం బాచరించి
యేఫలము గాంచు మనుజుఁ డహీనఫణితిఁ
దెలిపి యీసంశయం బెల్లఁ దీర్పు మనఘ. 57

వ. అనిన నే నిట్లంటి. 58

ఉ. ఏ మును గృధ్రదేహి నయి
యీశ్వరమందిరసత్ప్రదక్షిణం
బామెయి వ్యాధబాధితుఁడ
నై యొనరించితిఁ బానఁ జేసి శే

* యచట — ప్రా. ప్ర.

నీమెయి దాల్చి యిందు వసి
యించితి నింపమరం జిరాయు వ
న్నామముతోడ శక్ర పదు
నల్వురు శక్రులు దీఱునంతకున్. 59

క. నావిభవము గనుఁగొని శివ
సేవాఫల మెఱుఁగు మనిన విష్ణుఁడు శితికం
ఠావాసమునకు వలగొను
సేవ గడిందిగఁ దలంచె డెందం బలరన్. 60

వ. అని ఇంద్రాదులసంవాదంబు వివరించి వెండియుఁ జిరా
యు విట్లనియె మునీంద్రా యిట్లు త్రిదివలోకంబున
వసియించినకాలంబు నాకొక్కదినం బయ్యె ననంతరంబ
వైకుంఠభవనంబున కేఁగి యచ్చట దివసద్వయంబు
నిలిచితి నంతఁ బుణ్యగౌరవంబున నీకైలాసంబున కేఁగు
దెంచితి ననిన నే నిట్లంటి. 61

తే. మారుసకుఁ బ్రదక్షిణత్రయం బాచరించు
కారణంబునఁ గైలాసగమన మబ్బె
నీకు వైకుంఠభవనాదిలోకములకు
నెట్టిసుకృతంబుచే నేఁగి తెఱుఁగఁ జెపుమ. 62

వ. అనినం జిరాయు విట్లనియె. 63

తే. పొసఁగఁ దిర్యక్కులకు భేదబుద్ధి లేదు
దూషణము దానిమూల మాదూషణంబె

యఖిలధర్మవినాశంబు నాచరించు
వివిధలోకవిరోధియై విస్తరిల్లు. 64

క. ధర దూషణంబు వెలిగా
నరుఁ డేధర్మంబు చేసిన స్సఖలతచే
నిర వొందు సర్వలోక
స్థిరగమనము గన నెఱుంగఁ జెప్పితి నీకున్. 65

వ. అనియె నని చెప్పి సూతుండు. 66

క. ఈపుణ్యచరిత మెవ్వం
డేపున విను శ్రద్ధ గలిగి యుద్ధరఁ బుణ్య
శ్రీపటిమ వెలయు నాతఁడు
పాపవిముక్తుఁ డగుచు పరమపదముం జేరున్. 67

వ. అని చెప్పి నారదుండును వసిష్ఠాదుల కిట్లను నట్లుచ్చరా
యువుసకు మ్రొక్కి యతండనుప రెండవద్వారంబుం
బ్రవేశించితి నంత. 68

శా. హీరద్వారకవాటదీప్తములు బం
హిష్ఠాద్భుతముక్తామణి
స్ఫారోల్లాభవిభాసురంబుఁ గుముదా
ప్తప్రస్తరాబద్ధవే
దీరమ్యంబును నై పొసంగి ప్రతుఘా
ధిష్ఠానమై యొప్పు న

ద్వారం బింపు ఘటించెఁ గస్తవకు సాం
ద్రశ్రోత్రోత్సవచండిమంబునన్. 69

శా. అందు న్వజ్రవిశుద్ధవిగ్రహు విశా
లాక్షు న్మహాబాహుఁ బ
ర్వేందుప్రోజ్జ్వలసుందరాస్యుఁ బ్రమథా
ధీశప్రభావు న్సదా
నందుం జిత్రరథాభిధాను నొకవీ
ణావాద్యవిద్యాఢ్యు నా
నందం బెంతయుఁ బ్రీతిచేఁ బొదలఁ గం
టిన్ రత్నపీఠస్థితున్. 70

తే. అతఁడు శివనామకీర్తనం బాచరించి
వీణఁ బలికింపఁ దచ్ఛ్రుతివిలసనంబు
నాశ్రుతిపుటద్వయీరంజనం బొనర్చి
యులఘురోమాంచకంచుకితాంగుఁ జేయ. 71

క. నతిచేసి యతనిచే స
త్కృతియు నమస్కృతియుఁ బడసి స్థిరతరనికట
స్థితపీఠమునఁ దదాజ్ఞం
గృతమతి వసియించి యతని కే ని ట్లంటిన్. 72

శా. ఈశైశ్వర్యమహం బెలుంగుటకు నీ
వే దేవునిం గొల్చి తి

వే యేఁ ధర్మము లాచరించితివి ము
స్వాంతే ధృతి స్ఫీతర
స్థాయిస్వల్లకి దాన పల్కెడి శివాం
చన్నామముల్ చంద్రికా
ప్రాయంబై తగు నీదుమూర్తిఁ గని నా
భావంబు పొంగెన్ రహిన్. 73

వ. ఏసుకృతంబు కతంబున నీకీమహిమంబు గలిగె నెఱింగింపు
మనినఁ జిత్రరథుం డిట్లనియె. 74

ఉ. ఏ మును సోమదుం డను మ
హీసురుఁడం గడు దుర్వినీతిచేఁ
గామశరాప్రిగల్భగణి
కారమణీగృహసీమలన్ విట
గ్రామణి నై మెలంగుదు సు
కర్మము లెవ్వియు నాచరింప నెం
తే మదలీల నార్యజన
నిందయుఁ జేయుదు నెల్లవేళలన్. 75

వ. మఱియు నాయుర్వినాశకరంబులు నార్యనిందితంబులు
నగుదుష్కృతంబు లనేకంబు లాచరించితి నంత నొక్క
నాఁడు సహచరులం గూడి కార్యాంతరవ్యాసంగంబునఁ
బురవీథి నరుగుచుండి. 76

క. నవలక్షకుసుమములచే
నవనివిభుం డొకఁడు త్రిపురహరుఁ బూన్పఁగఁ బ్రా
గ్భవసుకృతహేతువునఁ ద
ద్భవనంబున కేఁగి యందు భావం బలరన్. 77

తే. అతఁడు కల్పోక్తవిధిఁ బూజ యాచరింపఁ
జూచుచుండితి దృఢతరశుద్ధబుద్ధి
నంత నాయుఃక్షయం బొంద యమునిబంటు
లరుగుదెంచిరి నాయిక్కు యరసికొనుచు. 78

ఉ. ఆశివపూజ సల్పు నిల
యంబు చొరంగఁ దరంబుగాక కీ
నాశభటుల్ మనంబుల ఘ
నంబుగ భీతి వహించి తద్గృహా
భ్యాశమునన్ మహాగమన
మారయుచు న్వసియించి రద్రిజా
ధీశసమర్చనంబు తెఱఁ
గేను గనుంగొనుచుండ నత్తఱిన్. 79

తే. యక్షవేతాళవితతికి రాక్షసులకు
ఛిద్రమన్వేషణముచేయు చెనఁటులకును
మృడునిసన్నిధి నొక్కింత మెలఁగరాదు
వెలుపలన నిల్చి రంతకవీరభటులు. 80

తే. వింటి శివనామపఠనంబు వీను లలరఁ
గంటి శివపూజసేయఁ జెంగట వసించి
దాన మృత్యువు దొలఁగె నత్తఱి మునీంద్రి
సజ్జనుల పొందు ధరఁ గల్పశాఖ యగుట. 81

క. నిరతము వైదికనిష్ఠా
నిరతుండై శ్రద్ధ గలిగి నిష్కల్మషుఁడై
పరగినహరపదభక్తుఁడు
స్థిరతరగతి వర్షశతము జీవించు మహిన్. 82

క. భవితవ్యతానుసారిత
భవపూజాపరిసమాప్తపర్యంతము న
బ్భువి వసియించితి నంతం
బావులుచు యమభటులు మగిడి పోయిరి లజ్జన్. 83

క. శివనామకీర్తనంబును
శివపూజాదర్శనంబు శివదివ్యకథా
శ్రవణంబు నల్పనియమవి
ద్భవ మగు ఫల మనఁగరాదు పద్మజతనయా. 84

వ. అట్లు శివపూజాదర్శనమాత్రింబున బ్రిహ్మాదిదుర్లభం
బైన యీశరీరంబు ధరియించి కైలాసద్వారంబునందు
నుండం గాంచితి యని చెప్పి చిత్రిరథుం డనువఁ బ్రమథ
సంకీర్తనంబును విచిత్రమణికుట్టిమంబును నానామణిగణ

బద్ధవేదికంబును నైన తృతీయద్వారంబుఁ బ్రవేశించితి
నందు. 85

తే. తండుభృంగీశ్వరాదు లుద్దండలీల
శివదిదృక్షాసమాసక్తిఁ జేరువారి
భవునిదివ్యాజ్ఞ వెలిగ లోపలికి నరుగ
నీరు తద్ద్వారసీమ నెవ్వారి నైన. 86

శా. వేత్రప్రస్ఫురితప్రహారకలనా
విర్భూతిచే నెంతయుఁ
సుత్రామప్రముఖామరౌఘముల సం
శుద్ధాత్ములం జేయుచుం
దత్రత్యుం డగు నంది నుజ్జ్వలమహా
నందిం దగం గాంచి నే
నత్రస్థితి లోని కేఁగితి మహే
శాజ్ఞానుసారంబుగన్. 87

మ. ధరణీభృత్తనయామనోహరు సము
ద్యత్కోటికంజాప్తుఁ బం
ధురతేజున్ ద్రుహిణాండభాండదహనో
ద్భూతోల్లసద్భూతిను
స్థిరరేఖాకలితు న్మణీమయమహా
సింహాసనస్థున్ సుధా

సురవంద్యుం బురవైరిఁ గాంచితి హరున్
సోమార్ధ*కోటీరునిన్. 88

ఉ. కాంచి సమస్కరింప గర
కంఠుఁ డకుంఠదయార్ద్రవీక్షణం
గాంచి మదీయసత్ప్రణతిఁ
గైకొని కన్బొమ సన్న సేయ న
ప్పంచశరారియాజ్ఞఁ దదు
పాంతమునం దగఁ గూరుచుండి యొ
క్కించుక కొంకుచుం గదిసి
యి ట్లని విన్నప మాచరించితిన్. 89

తే. స్వామి రెండవద్వారదేశంబునందు
చిత్రరథుఁ డనుప్రమథుఁడు విచిత్రవేషుఁ
గాంచి ము న్నట్టిసుకృతంబు గారణముగ
నిట్టివిభవంబు నీ కబ్బె నెఱుఁగఁ జెపుమ. 90

వ. అని యడిగిన నతండును నవలక్షకుసుమశివపూజాదర్శ
నంబున నిట్టి యైశ్వర్యం బబ్బె నని చెప్పెఁ దత్పూజా
మహాత్మ్యం బానతీయవలయు ననిన నమ్మహాదేవుం డి
ట్లని యానతిచ్చె. 91

క. విను నెనకా హరి నెనసన్
మునివర యొక్కొకరవీరమునఁ దగఁ బూజిం

* కోటీరునిన్ — వ్రా.ప్ర.

చినరుఁడు భద్రములఁ గనుఁ
బునరుద్భవదుఃఖవశత పొందదు వానిన్. 92

తే. కార్తికంబున నైన మాఘమున నైన
ననఘ వైశాఖమున నైన నచ్ఛకుడ్య
మృదులపల్లవతోరణపృథువితాన
లలితముగ నొక్కగేహం బలంకరించి. 93

సీ. నియతుఁడై వ్రతి యందు నిల్చి హిరణ్మయ
ప్రతిమ గావించి తత్ప్రతిమయందు
హరి నైన నను నైన నావాహనము చేసి
భాసురాగరుధూపవాసితంబు
రంగవల్లీచిత్రరచితాంచితంబు నై
యమరున-చ్చోటఁ బీఠమున నిల్పి
పటహవీణావేణుపటునిస్వనంబును
బుణ్యలస్తుతిరవంబును జెలంగఁ

తే. గలితపంచామృతాభిషేకంబు చేసి
లతకుసుమములఁ బూజించి లలితధూప
దీప నైవేద్యములచేతఁ దృప్తి సేయ
వలయు వాక్కర్మనియమప్రవర్తనమున. 94

వ. ఇట్లు ప్రతిదినంబును లతకుసుమంబుల శివశంభుమహే
శాదినామంబుల నన్నును నచ్యుతానంతగోవిందాదినా
మంబుల హరిని జతుర్థ్యంతంబులుగా నుచ్చరించుచుఁ

బూజించి నిత్యంబును బ్రాహ్మణులకు భోజనంబు నిడు
నది యిట్లు చేసి నవమదివసావసానంబున. 95

చ. ప్రతి గడు ధర్మనిష్ఠుఁ డయి
వస్త్రయుగాంచితమైన కాంచన
ప్రతిమ నగణ్యపుణ్యుఁ డగు
బ్రాహ్మణుఁ బూజయొనర్చి దాన మ
ప్రతిహతలీల నీఁ దగు ధ
రాతలదానపురస్సరంబుగా
ధృతి నిటు సేయుమానవుఁడు
దేవుఁడుగాక మనుష్యమాత్రుఁడే. 96

సీ. ప్రథమదినంబునఁ బద్మముల్ రెండవ
వాసరంబునఁ గలువలు తృతీయ
ఘస్రంబునను రక్తకరవీరములు నాలు
గవనాఁడు కుటజంబు లవలినాఁడు
చంపకప్రసవముల్, షష్ఠిదివంబున
మొల్ల లేడవదినమునను దెల్ల
గన్నెరు లష్టమఘస్రంబునను జాజి
ఁలట గాంచనములు, దా సవలినాఁడు

తే. ప్రతిదినంబును బుష్పముల నిట్లు
పూజసేయంగవలయు నపూజసేయు

నరుఁడు కైలాసవైకుంఠపురముల వసి
యించు శాశ్వతవైభవ మెసఁగ మెసఁగ. 97

వ. ఇది నవలక్షకుసుమపూజాప్రకారంబు మఱియు. 98

క. తులసీదళముల శ్రీఫల
దళనికరములం దిలాక్షతముల న్నను ని
మ్ములఁ బూజించినధన్యుం
డిల జీవన్ముక్తుఁ డగు నహీనవివేకా. 99

తే. హరిహరులపూజ కంతరాయంబు సల్పు
నరుఁడు నవలక్షవర్షముల్ నరకవాసి
యగు నటులు గాన విష్ణుశివార్చనముల
కంతరాయము సేయఁ గా దనఘమతులు. 100

క. శివపూజ సేయు నతఁడున్
శివపూజాదర్శనంబు సేయువతండున్
శివపూజాముదితుండున్
శివమతిఁ గైలాసమునకుఁ జేరుదు రనఘుల్. 101

వ. చిత్రరథుండను బూర్వభవంబునఁ బాపాత్ముం డయ్యు
శివపూజాదర్శనమహాత్త్వంబునఁ బవిత్రుండై తత్కార
ణంబున నవద్వీపం బనుపురంబునఁ జంద్రవంశంబునఁ
జంద్రాంగదుం డనునామంబున భూపాలుండై ప్రభ
వించి వాసనావశంబున సంతతంబును శివపూజ యాచ
రించుచు నిఖలభోగభుక్తిం జరితార్థుండై శతవర్షం

బులు జీవించె నంత నతనిం గైలాసంబునకుం దెచ్చు
టకుఁ బ్రమథులచేత సూర్యసంకాశం బగువిమానరత్నం
బనిచితి నవ్విమానంబు నారోహించి గంధర్వగానవినో
దితుం డై యప్సరస్సంఘంబులు గొలువ మత్సాయుజ్య
కలితుండును వీణాపాణియు నై యభ్రవీథి నరుగు
చుండె నప్పుడు. 102

ఉ. ఆయతకోటిభానుకము
బాప్తరుచిం బొలుపొందుతద్రథ
చ్ఛాయ కృతాంతువీటిపయి
జానుగఁ బర్వఁగ నందు దుర్గతిం
బాయక క్రేఁగుమర్త్యులకు
బాధ దొలంగినఁ బొంగి యెవ్వఁడో
యీయనఘాత్ముఁ డిందు మము
నిందఱ మన్చె నధర్మవృత్తులన్. 103

తే. ఏమహాత్ము రథచ్ఛాయ యిందుఁ బర్వి
యింపుమీఱంగ మము సుఖియింపఁజేసి
నామహాత్ముఁడు మము నారకాలయమునఁ
బాపుఁగా కని పల్కి రప్పాపు లపుడు. 104

ఉ. ఆపలుకుల్ వినంబడిన
యంత నితాంతకృపార్ద్రచిత్తుఁ డై

దూపరమోపకారి రథ
మచ్చటికి న్మరలించి నిల్వ న
ప్పాపులు నారకవ్యథలఁ
బాసి దివంబున కేఁగి రంత ని
ర్వాపితతేజులై యముని
వాసముఁ జేరి తద్భటావళుల్. 105

వ. ఇట్లు చేరి వైవస్వతున కిట్లనిరి. 106

చ. అరదము నెక్కి యొక్క తరు
ణారుణసన్నిభుఁ డైనపూరుషుం
డరుగుచు నారకీప్రతతి
యార్తరవం బొనరింపఁ గాంచి తా
నరుగక నిల్చి నిల్చుటయు
నాతఁడవీక్షణ మాచరించి యా
నరులు సుఖించి నాకభువ
నంబున కంపి రద్భుతంబుగన్. 107

క. యమరాజధాని నీసం
యమనీనగరంబు శూన్య మయ్యెన్ మే మ
య్యమవంతుఁ డెవ్వఁడో తెలి
యము దీనికిఁ బ్రతివిధాన మలవఱుపు మిఁకన్. 108

వ. అని చెప్పిన విని దండధరుండు దండాహతమండలితేజం
గునఁ గనలి యేతెంచి యద్దివ్యపురుషునిమూర్తిం గాంచి

తద్విశాఖ్యాణితశివనామం బాకర్ణించి పిపాసార్తుం డమృత
పానం బాదరించినభంగిం బొంగి సమస్కరించి యతనితో
నిట్లనియె. 109

మ. శివనామామృతవర్షిమై యురుగు నీ
చేఁ బొల్చువీణారవ
శ్రీవశానందము నీదునిర్మలకథ
చ్ఛాయానుసరీరంభవై
భవముం గల్గుటఁజేసి నాయకులు సం
ప్రాప్తామరావాసులై
భవబంధాఘనివృత్తులైరి సుకృత
భ్రాజిష్ణులం బోలుచుఁ. 110

తే. వెస మదీయాధికారంబు నీటఁబోవఁ
బ్రమథవర పాదుచేసి తిప్పలసంబు
ధర్మమార్గరతుండవై తనరు దీవు
ధర్మమర్యాద దాఁటంగ ధర్మ మగునె. 111

వ. ఇంక నే మెవ్వరిం దండింతు మొఱంగింపు మనినఁ జిత్ర
రథుం డతనితోడ. 112

సీ. కమనీయతరశివకల్యాణనామంబు
లనిశంబు పలుకనియట్టివారి
భూతియు రుద్రాక్షములు నంగములఁ దాల్ప
కత్యంతదురితాత్ము లైనవారి

ననయుంబు భిన్నమర్యాదచేఁ బెంపొంది
హరిహరదూషకు లైనవారి
వైదికాచారంబు వఱదపాలుగఁ జేసి
పాషండవృత్తిచేఁ బరగువారిఁ
తే. దనతలకటాహమధ్యమునఁ బ్రోల్చి
కళలఁ బ్రహరించి ముద్గరాఘాతములఁ గ
లంపు మని తెల్పి యపుడ కైలాసమునకు
సరుగుదెంచెఁ గృతాంతుఁడు నరిగెఁ బురికి. 113
క. ఈసత్కథ చదివిన స
త్యాసక్తి న్వినిన మర్త్య లఘునివహములం
గాసి యొనరించి యట కై
లాసంబున నుండుదురు విలాసకలితులై. 114
వ. అని చెప్పిన నద్దేవునితో సర్వధర్మంబులలోన నుత్తమధ
ర్మం బెయ్యది యెఱింగింపు మనిన నయ్యాశ్వరుండు
నాతో నిట్లు లానతిచ్చె. 115
తే. సంయమీశ్వర వినుము సజ్జనులపొందు
తత్సహాభాషణంబు సత్యంతభక్తి
నారి సేవించుటయు వారి భూరిదాన
మునిమానఁ బోషించుట ముఖ్యధర్మంబు లవని. 116
తే. సాధుసంగతి గౌతమీస్నానమును శి
వార్చనంబును జేయుఁగా నగు నరుండు

చెలఁగి సాధుజనాళిఁ బూజించునేని
కలుగు ధర్మార్థకామమోక్షములు వరుస. 117

సీ. సాధుబృందములపార్శ్వప్రదేశముల ముం
దట వెన్క వసియింపఁ దగు నరుండు
సతతంబు సజ్జనసంగతిఁ బెంపొందు
నతఁడు దరించు భవార్ణవంబు
కుజనసంగతి గడుఁ గూల్చు నారకమున
మహి విషసంగతమధువుభంగి
నెట్టియాపద్దశనైనియు సత్సంగ
సంపరిత్యాగంబు సేయఁ దగదు

తే. సాధు లెచ్చట నుందు రచ్చోటు సమస్త
దివ్యతీర్థాస్పదం బయి తేజరిల్లు
వార లెచ్చట శిథిలజీవనులఁ బోలుదు
రచట దుర్భిక్షచోరబాధాదు లడరు. 118

క. మును విదురుఁడు సత్సంగం
బున వైకుంఠంబుఁ బడసె భువి వాసిం
దనుఁ దెచట మోక్ష మిచ్చుట
యనఘా సత్సంగమహిమ మలవియె పొగడన్. 119

తే. హరిహరులయందు సమచిత్తు లైనవారు
వైదికాచారరతు లయినవారలువారు

నాస్తికత గగ్గి శ్రద్ధచే నలరువారు
సజ్జనులుసుమ్ము నిర్జరసంయమీంద్ర. 120

వ. అట్టిసజ్జనులం బూజించుట పరమధర్మం బని తెల్పిన
విని యే నిట్లంటి. 121

ఆ. శ్రుతివిరుద్ధకర్మరతు లైనబ్రాహ్మణ
క్షత్రవైశ్యశూద్రజాతములకు
నెట్టిగతులు గల్గు నెఱిఁగింపు లౌకిక
నాథ శైలజాతనాథ యభవ. 122

వ. అనిన నీశ్వరుం డిట్లనియె. 123

ఉ. వేదవిరుద్ధకర్ము లగు
విప్రులు రాజులు నూరుజన్ములున్
మేదిని శూద్రబుద్ధు లయి
మ్లేచ్ఛజనిన్ జనియింతు రట్ల య
వైదికకర్మనిష్ఠల న
వార్యతపం బొనరించెనేనియుం
బాదభవుండు క్లేశములఁ
బొల్పడు సద్గతి లేదు వానికిన్. 124

వ. ఇట్లు చతుర్వర్ణాశ్రమంబులవారలును విపరీతకర్మంబు
లాచరించి మ్లేచ్ఛులై జనియింపుదు రట్లు గావున నైహి
కాముష్మికఫలప్రాప్తిం గోరి స్వజాతివిహితం బగు
కర్మంబు సేయువలయు నన్యధర్మంబు లాచరించినఁ

గీతాంద శూద్రుండు నిజధర్మంబు లైన విప్రసేవాదు
లవలనఁ దరియించు సొందును స్వకర్మ కర్తనులు పూజ్య
తము లని చెప్పిన సే ని ట్లంటి. 125

క. హరుసన్నిధి దీపం బిడు
నరునకు నెట్టిఫల మబ్బు నగధన్వ మహే
శ్వర విన వేడుక యయ్యెడిఁ
దిరముగఁ గృప యుల్లసిల్లఁ దెలుపఁగవలయుఁ. 126

వ. అని యడిగిన నప్పరమేశ్వరుం డిట్లనియె. 127

తే. దీపదానమహత్త్వంబు దెలియ వినుము
సురమునీశ్వర యత్యంతశుభకరంబు
తత్ప్రభావంబుచేఁ బిత్రాళి వసించు
స్వర్గమున నాగకాంతాళివ్యథఁ దలంచి. 128

ఆ. ఏతదర్థమైన యితిహాస మొక్కటి
గలదు దాని వినిన ఖలులు కైనఁ
గలుషసముదయంబు దొలఁగు నిక్కువ మజ
తనయ వినుము సావధానముగను. 129

క. అది యెట్లనఁ దనువొక
భూదేవుఁడు గలఁడు గ్రూరబుద్ధియుతుఁడు సం
ధ్యాదివిరహితుం డన్య
స్త్రీరయుతుఁ డకృత్యకరణశీలుఁడు ధాత్రిఁ. 130

ఉ. వేమఱు నార్యులం బరిభ
వించుఁ బరాన్నమె మెక్కు నెప్పుడుం
బ్రామరత స్మృతిప్రోక్తములె
పల్కు నిషాదునిచేత నెనఁ దా
పేమము పేర్మి సందిశాను
నెగ్గుఁ దలంపక జారచోరచూ
డామణి యాద్విజుండు నెఱ
యన్కుఁదనంబున కెల్ల నెల్లయై. 131

శా. ఆవిప్రాధముఁ డక్షకేళినిరతుం
డై యాండి తా నోడియుం
దా విత్తంబున కెందు నైనఁ జోరభా
త్వర్థం బాగిం జేయుఁ గా
మావేశంబునఁ బుల్కసాంగనలతో
నైనం బ్రివర్తించు ని
ష్ఠోవేశం బురిఁ ద్రిమ్మరుచు సుజను లెం
తేఁ ద న్విగర్హింపఁగన్. 132

తే. అందఱకు దినవారతారాదికములు
తెలిపి యుపవాసనియతి విధించుఁ గాని
యతఁడు మానఁడు కృష్ణజయంతియందు
హరిదినంబున శివరాత్రి నన్నభుక్తి. 133

తే. హరిదినంబుల వేయింట నైన సుకృత
మొనరు నొక్కకృష్ణాష్టమి నుపవసింప
వేయికృష్ణాష్టములఁ గల్గు శ్రేయ మబ్బు
నొక్కశివరాత్రి మానవుం డుపవసింప. 184

సీ. శివపదధ్యానంబు శివనామపఠనంబు
ననిశంబుఁ జేయుమహాత్ముఁ డొకఁడు
శతరుద్రమంత్రసంగతి శివు నభిషేక
మాచరించినయట్టి యనఘుఁ డొకఁడు
శ్రీఫలదళముల శివుని సహస్రనా
మంబులఁ బూజించుమాన్యుఁ డొకఁడు
లలితప్రదోషవేళల శివదర్శనం
బారూఢిఁ గావించు నార్యుఁ డొకఁడు

తే. నవనిలోన జీవన్ముక్తు లగుట ధ్రువము
నిమిషమైనను మఱి యర్ధనిమిషమైన
శివుని భజియించువానికిఁ జిరతరముగ
నిఖిలలోకాధిపత్యంబు నివ్వటిల్లు. 185

క. ఇల నొకయఖండబిల్వ
దళపూజను గోసహస్రదానఫల మగుం
దులసీదళార్చనంబునఁ
గలుగుం గ్రతుశతము సేయఁగా నగుఫలముల్. 186

తే. హరుని బంధురాఖండతిలాక్షతలను
బూజరొనరించు నెవ్వఁ డప్పురుషవర్యుఁ
డఘతతుల డిగ్గఁద్రావి పూతాత్ముఁ డగుచు
నలరి కైలాసపదమున నధివసించు. 137

క. అమితంబుగ నవిషాన్నము
నములుటయున్ శోణితంబు నలిఁ ద్రావుటయుం
గ్రిమికీటభక్షణంబున్
సమ మగు శివరాత్రిఁ దినినసరసాన్న మిలన్. 138

క. ధరఁ జండాలాన్నముఁ గు
క్కురపలలముఁ దినుట మే లగు స్మృతి ప్రోక్తా
త్కరసంత్యాగము మే లగు
హరివాసరమున భుజించు నన్నముకంటెన్. 139

క. కనక స్తేయము గుర్వం
గనఁ గనయుట బ్రహ్మహత్య కాదంబరి క్రో
వ్వనఁ గ్రోలుట యుర వగు ని
మ్మనఁ గృష్ణజయంతి నన్నము దినుటకంటెన్. 140

ఆ. అట్టివ్రతదినంబులందు భుజించి య
మ్మందరాహ్వయుం డమందహర్ష
పరవశాత్ముఁ డగుచుఁ దిరిగె దేశములు ధ
నార్జనంబు సేయ నాస గొలిపి. 141

వ. ఒక్కనాఁ డుజ్జయినీనగరంబునకుం జని యందు నలబ్ధా
హారుండై జఠరానలం *బినుమడింప నాసాయాంతం
బును బురవీథులం గ్రుమ్మరి విసివి యద్దినంబు శివ
రాత్రి గావున నుత్సవదిదృక్షాసమాగత పౌరికజనసం
ఘంబులం జూచుచుఁ దోరణాకాయమానవిరాజితంబును
ఘనసార గంధసార కాశ్మీర మృగమ దాద్యనులేపితం
బును సగరు గుగ్గుల ముఖ్య ధూపధూమ గంధ బంధురం
బును దీపమాలికాసమాకీర్ణంబును జంపక కర్ణికార
కరవీర మల్లికా మాలతీ బిల్వదళాద్యనేకపుష్పద్రవ్యస
వ్యంబును భక్ష్య భోజ్య ప్రముఖ నైవేద్య పరిపూర్ణం
బును నానావ్రతిజనసమాకీర్ణంబును సఖండనిభవాభిశో
భితంబు నైన మహాకాళదేవుదేవాలయంబునకుం జని
యమ్మహాలింగమూర్తి సందర్శనంబు చేసి సమస్కరించి
కొండొకదడవు నిల్చి యుస్సురతాత్ముం డిట్లని యూహించె.

తే. అంకటికి నాకు నేమియు నబ్బదయ్యెఁ
బ్రాగ్భవంబునఁ జేయుపాపంబుకతన
సహావా సత్పాత్రునకును జన్మాంతరమున
నుపచరింపంగ లేనైతిఁ గపటవృత్తి. 143

క. జల భక్ష్య భోజ్య శాక
స్థల సూనృతభాషణముల సాధుజనుల ॥

* బు మండింప—వ్రా. ప్ర.

మ్ముల దృష్టి సలుప నే న
క్కలుషంబున నిప్పు డిట్టిగతి వాటిల్లెన్. 144

సీ. ఈజన్మమున నైన గృహసమాగతు లగు
నతిథులఁ బూజింప నైతి నకట
యనిశంబు దుర్వ్యసనాభిభూతుండ నై
స్నానసంధ్యాదులు సలుప నైతి
నన్యాంగనాసంగమాసక్తి మసలితి
హరివాసరాదిపుణ్యవ్రతముల
క్షౌరకాలయమున క్షౌరమ్ము సలిపితి
నపుడ తైలాభ్యంజనాదికములం

తే. కరనిపీడితచేలంబు గట్టుకొందు
నిట్లు మఱియు దరిద్రతాహేయ. మగు కు
కర్మములు సేయుచుండితిఁ గాని సుకృత
కర్మ మొక్కటియును జేయఁ గాన నైతి. 145

ఆ. అన్నపూర్ణ మైన యవని నే నొకఁడన
యన్నకాంక్షి నగుచు నున్నవాఁడ
పాత్రములకు లేశమాత్ర మైనను దొల్లి
దానమునందు నిడనిపాపి నగుట. 146

వ. ఈజన్మంబునఁ దపోదానపూజాదు లొనరింపనికారణం
బున భవిష్యజ్జన్మంబునందును దరిద్రుండ నగుట తప్ప
దని తలంచుచు నాఁకటిచే ప్లాఁపలేక శివార్పితంబైన

యీభక్ష్యభోజ్యాదిపదార్థంబు లిజనంబు లేమఱియున్న
తఱి నపహరించి భక్షించెదం గాక యని యద్దుష్టమా
నసుం డాసమీపంబునఁ బొంచియుండె నంత. 147

తే. అనిశిథంబు శివపూజ యాచరించి
జాగరణకేలిఁ జేలి యచ్చటిజనంబు
లలసి నిద్రింప దీపంబు లస్తమించె
నవతమస మల్లనల్లన యాక్రమించె. 148

సీ. అపుడు ద్విజాభాసుఁ డాశివాభ్యాశప్రి
దేశంబునకు నోదనాశఁ జేరి
యమ్మహేశసమర్పితాన్నము దృష్టిప
థాగోచరంబైన నరయునేక
ప్రబలి తత్రిత్యనిర్వాణదశాఖ్యస్థ
దీపంబు నిజపటాదీప్తవర్తిఁ
బ్రజ్వలింపఁగఁ జేసి పక్వాన్నభక్ష్యభో
జ్యాదులు గైకొని యరుగ నంత

తే. వానిచరణాగ్రి మొక్కనిమేను బోకఁ
దస్కరుం డని కూయు నత్తఱి నెఱింగి
యారెకులు చాల దువ్వి బిట్టార్చి చంపి
రవినయనిధాన మైన యయ్యవనిసురుని. 149

ఉ. అతఁడఁ గోటికోటిజల
జాక్షవిభావిభవాంచితంబు లై

ఆ. ఒక్కమాస మైన నొకయబ్దమైన న
ఖండదీప మిడునరుండు నిఖిల
దురితసమితి నొడిచి నిరతంబు శివలోక
మున వసించు దేవమునిలలామ. 156

సీ. గ్రహపీడ లడఁగు శాత్రవులు మిత్రతఁ గాంతు
రఖిలకామితసిద్ధి యగుఁ దలంప
నాయువు వర్ధిల్లు నట మనోవాక్కాయ
జము లైనకలుషసంఘములు దొలఁగు
జలగండములు దప్పు వెలయ రోగార్తుండు
దృఢశక్తియుక్తుఁడై తేజరిల్లు
వంధ్యయుఁ జెంతయుఁ బుత్రవంతుఁ డౌ దుర్గతుం
డనుపమసంపద నతిశయిల్లుఁ

తే. దీప్తి బుణ మెంతయైన నుదారమహిమఁ
గోరి హరి నైన హరు నైనఁ గూర్చి యాజ్య
తైలములచేత నొక్కయబ్దం బఖండ
దివ్యదీపంబు నిల్పిన దృఢవివేక. 157

క. అట్లు వర్షత్రయము దీప మవని నిల్పి
నతఁడె శంభుండు శౌరియు నతఁడె వర్ష
శతము భువి సర్వభోగసంగతిఁ జెలంగి
యంతమున మత్పథంబున నధివసించు. 158

వ. మఱియు దీపదానప్రకారం బెఱింగించెద. 159

తే. మాఘమైనను గార్తికమాసమైన
మొదలు గావించి సాయంకాలమున నిల్చి
పూజసేయంగవలయు సంపూర్ణభక్తి
ననుదినము సుంద్రకము ఉపహార మొసఁగి. 160

వ. ఆవిఘ్నరాజసన్నిధి పరిచారకులలో నొక్కని నుద్దేశించి పురుషప్రమాణం బైనదీపదారువుపై మృత్తామ్రపిత్తళ రజతకాంచనంబులలో నొక్కపాత్రంబున ఘృతంబును నించి కార్పాసకృతవర్తి సఖండదీపం బిడునది యిట్లొక్క వత్సరంబు గడచిన యనంతరంబ యథావిభవంబున నొక్కసువర్ణప్రతిమ రచియించి యందు నిష్టదేవత నావాహించి పూజించి. 161

తే. ప్రతిమయును దీపపాత్రంబు పటయుగంబు
ధర్మకర్మాభిరతునకు దాన మొసఁగి
యంత శక్తికొలంది విప్రవరులకు
సరసమృష్టాన్న మిడి తృప్తి సలుపవలయు. 162

క. ఈసద్వ్రతంబు భక్తిం
జేసిన వాంఛితము లెల్ల సిద్ధించుం గై
లాసావాప్తియు నగు జల
జాసనసుత! మానవులకు ననవరతంబున్. 163

వ. మఱి యిక్కథాశ్రవణంబున నిఖిలదురితనివృత్తి యగు ననిచెప్పిన నప్పరమేశ్వరునితో లక్ష్మీపూజాప్రకారం

వెలిఁగింపు మని యడిగిన సద్దేవుం డిట్లనియె. 164

తే. చైత్రమున నైన మార్గశీర్షమున నైన
శుభదినంబున నేకాంతసుస్థలమున
విష్ణు నైనను స్వస్థాన వేశ్మ నిలిపి
పూజసేయఁగవలయు సంపూర్ణభక్తి. 165

వ. ఉత్పల శతపత్త్రి కరవీర కాంచన చంపక ద్రోణ కుంద
కురువ కాదికుసుమంబుల నైన నఖండ బిల్వ తులసీదళం
బుల నైనను తిలాక్షతంబుల నైనను బూజించుచు నిత్యం
బును షోడశోపచారవిధులం దనుపవలయుఁ బూజా
సమాప్తి పర్యంతంబు నఖండదీపం బిడునది యథాశక్తి
నొక్క సువర్ణప్రతిమ రచియించి యథాపూజాసంపూర్ణం
బైన యనంతరంబ దరిద్రుం డైన విప్రునకుఁ బ్రతి
మాదానం బొసంగవలయు. 166

క. తాన వని కేఁగి సూపవి
తానముఁ బత్త్రములఁ జేయఁ దగు సర్పుకు నిం
పూన నది యుత్తమం బ
న్యానీతసుమంబు లెల్ల నర్థఫలదములే. 167

తే. యానమునఁ దైర్థికునితీర్థయాత్రికా
విలిచి తెచ్చినవియు నల్పఫలము లొసఁగుఁ
గాన బూజార్థ [illegible] తాఁ దెచ్చి
వలయు నిష్టార్థసంసిద్ధి వలయు నేని. 168

తే. శివునిపూజకుఁ గొన్నినల్ సిదుమువేళఁ
కరపదస్థలముల ముండ్లు గాడెనేని
హస్తపాదంబు లూర్ధ్వరేఖాంకితంబు
లగుట కది యాదికారణం బగు ధరిత్రి. 169

ఆ. ఇట్లు లక్షపూజ యింపొందఁ జేసిన
భూసురుండు రాజపుంగవుండు
హరిపదమున నైన హరనివాసంబున
నైన లక్షయేఁడు లధివసించు. 170

వ. అని శివుం డానతిచ్చునవసరంబున. 171

ఉ. వాసవముఖ్యనిర్జరు ల
వారితభక్తి శనిత్రిమోదలీ
వాసరపుణ్యవేళఁ జెలు
వంబుగ నద్రిసుతాసహాయు దే
వాసురవంద్యమానచర
ణాంబురుహద్వయు నద్వయున్ హరున్
వాసుకికంకణున్ సుజన
వత్సలుఁ గొల్వఁగ వచ్చి రిమ్ములన్. 172

వ. ఇట్లు వచ్చి యక్కైలాసద్వారంబున. 173

క. శైలాదియనుమతంబున
నాలోనికి సమ్ముదమున నరుదెంచి పెసన్

శూలికి మ్రొక్కి తదాజ్ఞా
లీల సమాసీను లగుచు లేఖవరేతుల్. 174

తే. హరుఁడు గట్టిన కలశాబ్ధిహారువు గాంచి
దీని నేఁటికిఁ దాల్చె నగ్రేశ్వుఁ డనుచుఁ
దత్ప్రభాస్థితు శైవకథారసజ్ఞ
సత్తమతరు వామదేవుని నడుగుటయును. 175

క. కైలాసనగస్థితియును
ఫాలాక్షునిసన్నిధియును భవునికథలపై
పోల్కియు నివి యొక్కొకటియె
చాలవె యాదివిజవితతి జనిసఫలతకున్. 176

తే. దప్పి గొన్న జనం బమృతంబుఁ బోలె
శివకథాసుధ నజరాళి చెవులఁ గ్రోల
నింపమర వామదేవమునీంద్రచంద్రుఁ
డిట్టు లని తెల్పఁదొణఁగె నహీనఫణితి. 177

చ. గజదనుజుండు నాఁ గలుగు
గాటపురక్కసుఁ డొక్కఁ డుర్వి న
ద్ద్విజుల ముదం బడంచియును
దేవగణంబులడంబు మాన్చియున్
భుజబలశౌర్యసంపదలఁ
బాంపిరివోవుచు నొక్కనాఁడు వా

రిజభవునొద్ద కేఁగి వెద
రించి కలంచెఁ దదీయలోకముల్. 178

వ. మఱియు. 179

శా. వైకుంఠంబున కేఁగి దానవుఁడు స
ర్వప్రాణిహింసార్థియై
ప్రాకారంబులు రత్నమందిరములుం
బ్రాసాదముల్ గూల్చి త
ల్లోకం బంతయు గాసిచేసెఁ దను నా
లోకింపఁగా నోప క
వ్వైకుంఠాదు లకుంఠభీతిమెయి దు
ర్వారత్వరం బాఱఁగన్. 180

వ. వెండియు. 181

ఉ. ఆ సమదద్విపాసురుఁ డ
హంకృతి నెందును మాఱులేక కై
లాసముఁ జొచ్చి దిక్కరి గొ
లంకునుబోలెఁ గలంచియాడెఁ బా
నాసమయంబునం బ్రమథు
లందఱు నొక్కటఁ గూడి వానిపై
నేసిరి యుద్ధదుర్మదు ల
హీనబలంబున నస్త్రశస్త్రముల్. 182

చ. ముసలగదాముసుండి శర
ముద్గరచక్రముఖాయుధౌఘముల్
వెసఁ బరగించి యద్దనుజ
వీరుఁ గలంపఁగఁ లేక వానిఁ దా
రసదృశవిక్రమంబుఁ గొని
యాఁగిరి వాఁడు శ్రమంబుఁ జెంద క
య్యసమశరారికింకరుల
నందఱ నాజిఁ గలంచె నీమునన్. 183

చ. కమలభవాండభాండములు
గాల్చు నవక్రపరాక్రమాన్వితుల్
ప్రమథతతుల్ గజాసురుని
బారికిఁ గాక కలంగి బాఱి ర
య్యమరవిరోధియుం బవనుఁ
డంబుధులం గలఁగించులీల వి
క్రమము మెయిం బరాజితులు
గా నొనరించి యులంచె వారలన్. 184

మ. కరిదైత్యేశ్వరుఁ డుగ్రకింకరుల నా
క్రమ్యారి హెం గెల్చి యు
ద్ధరతం గ్రమ్మఱి పట్టనంబులు గిరి
ప్రాంతంబులం గొల్చుచుం

బొరి నేఁగ న్నిజపూర్వజన్మకృతప
త్పుణ్యపరిభావంబునఁ
వరపాపాశికిఁ బుణ్యరాశికి దయా
వారాశికిం గాశికిన్. 185

క. ఆ కరటిదానవునిఘో
రాకృతిఁ గని వెఱచి పఱచి యున్నగరి ప్రజా
నీకంబు లుద్దవిడిఁ జని
శ్రీకంఠున కధికభక్తిఁ జేమోడ్చి వెసన్. 186

వ. ఇట్లని విన్నవించిరి. 187

ఆ. దంతిరూపఘోరదానవుఁ డొకఁడు
నవనవానరిహోజనప్రమాణ
తనుఁడు వచ్చి వానిఁ గనుఁగొనునంతనె
గుండె లగిలె జనులకును మహేశ. 188

సీ. సచరాచరం బైన జగ మంతయును వాని
చరణయుగ్మం బద్యోఁ జందరిమకుట
తపనీయగిరి వానిదంతాంచలంబునఁ
గందుకాకృతిఁ బొల్చె గరళకంఠ
భవవిష్ణుపద్మసంభవలోకములు వాని
బృంహితధ్వనిఁ బల్కెఁ ద్రిపురదమన
ధరణి యంతయు వానికరశీకరాసార
ధారాహతులఁ గుంజె ధరనివేశ

తే. యీదృశాకారదానవు నెన్నఁ డైన
విన్నదియుఁ గన్నదియు లేదు విశ్వనాథ
వానిఁ బరిమార్ప నొరులకు వశము గాదు
దేవరకె కాని జగముల దీనరక్ష. 189

చ. వనజభవాండకోటు లని
వారణఫాలదృగగ్ని నేర్చి త
ద్ఘనభసితం బలందుకొను
కాంతతతాంగము గల్గు ప్రోవ నీ
వనయము కల్పవేళ సచ
రాచర మైనజగంబు నీదు కు
క్షిని దగఁ జొచ్చు నూఁగిరిని
జేరదు బాహ్యజలంబు నోలికన్. 190

తే. నిఖిలము నడఁగుచున్నపుడు నీవు నొకఁడ
వద్వయుం డైనపరబ్రహ్మంబ వయ్యు నీశ్వ
రాఖ్యఁ జిచ్ఛక్తిరూపిణి యైనకాళిఁ
గలసి క్రీడింపు దానందకాననమున. 191

వ. దేవా ప్రసన్నుండవై యద్దనుజుం దునిమి జగంబులు మనుపు మని ప్రార్థించిన నాకర్ణించి విశ్వేశ్వరుం దక్షాశకిం గ్లేశాపేక్షి యగు నప్పిశితాశిం బరిమార్పం దలంచి యర్ధనారీశ్వరం బైనదేహంబు ధరియించి వెడలె నప్పు డయ్యురపురకు నత్యంతదారుణం బైనరణంబయ్యెనందు.

క. శుండాలదానవుఁడు నిజ
తుండం బెగయించి పట్టి ధూర్జటిపై రా
మెండుగ నద్దేవుఁడు శిత
కాండంబులు వఱపి వానిగతి మరలించెన్. 193

తే. ఆశరంబులు దైత్యకాయమున నాఁటి
లోమములరీతి నొప్పె నాలోన వాఁడు
తరులు గిరులును సేయ నత్తఱిఁ బురారి
శకలములఁ జేసె సాయకసముదయముల. 194

చ. శిలలు శిలోచ్చయంబులును
జేకొని యుద్దనుజుండు వెండియుం
జలమున వైవ శాతకులి
శపవిదరంబుల వాని నెల్ల న
గ్గలిక హరుండు ఖండములు
గా నొనరింపఁదొణంగె నిట్లు ని
శ్చలగతిఁ బోరి రిద్దఱును
సంగరరంగకళాప్రవీణులై. 195

తే. అర్ధనారీశదివ్యదేహంబు దనకు
మృత్యు వని యాత్మ నెంచి యాదైత్యుఁ డకుడు
ధీరతయు శూరతయు బలసారతయును
ప్రాపుగాఁ బోరె నావిశ్వభర్తతోడ. 196

క. ఉరుబలశుం గౌశలముం
గరలాఘవ మశ్రియుతయుఁ గదురఁగఁ జూచెన్
హరుఁడు గడు మెచ్చి వానిన్
వర మొసఁగెదఁ గోరు మని ధృవంబుగఁ బలికెన్. 197

వ. పలికిన వాఁ డిట్లనియె. 198

క. ఈశాశ్వ ప్మృతి యంట యది
శ్రీకంఠుఁడ వైన నీదుచే నట యుబి ప్రి
త్యేకమ రయిక్కొకటియె మా
శ్లాఘలనకుఁ గారణంబు లగుఁ బరమేశా. 199

తే. అనఘ సాయుజ్యమునకంటె నర్థనీయ
వస్తు వెద్దియు లేదు తద్వస్తు వప్ర
యత్నమునఁ గల్గె దాని నే నడుగ నింత
నొక్కవర మిమ్ము దేవ నీ వొసఁగెదేని. 200

మ. అజరస్తుత్యవిలాసభాసురనిశాం
తాపారసౌందర్యముం
ద్రిజగద్విశ్రుతమార్దవంబు నగరు
శ్రీఖండకర్పూరము
ఖ్యజగన్మాన్యమహానుగంధములు గ
ల్గంజేసి యుంపొంద నా
యజినం బీవు ధరింపఁగావలయు ర
మ్యాఛ్ఛాదనప్రక్రియన్. 201

వ. అని కోరి సంత దేవగణంబులు దేవా యివ్వరం బొసంగి
లోకకంటకుం డగు నిద్రానవునిం బరిమార్చు మని పల్కిన
సత్యశ్లోక యని యద్దేవుండు. 202

క. సచకరశరలాఘవ మ
య్యుజరులు వినుతింప నొక్కయాశుగమున న
గ్గజదనుజు నేయు వాఁ డ
క్కజముగఁ గుంభములు పగిలి కడువడిఁ బడియెన్. 203

లయగ్రాహి. భానుహిమభానుపవమానసఖలోచనుని
చే నిశితబాణహతి దానవుఁడు కూలం
బూని సురదుందుభు లనూనగతి మ్రోసె విరి
వాన కురిసెన్ విబుధమానినులనాట్య
శ్రీ నెరసెఁ జారణులు గానమొనరించి రపు
డాని దిశ లన్నియు నహీనరుచిఁ బొల్చెన్
మానుగ సమస్తజనమానసము లుబ్బ నస
మానమృదుగంధశిశిరానిలము వీచెన్. 204

తే. అసురవరకృత్తిఁ దాల్చి యాహరుఁడు కృత్తి
వాసుఁ డయ్యెఁ దత్కృత్తి యవ్వామదేవు
మాంసలాంసకయుగళిపై మహితమృదుత
రాంశుకాకృతి నలరారె నమలులార. 205

చ. జలరుహసంభవాండచయ
జన్మలయస్థితిహేతుభూతుఁడై

యలరినయూనదాశివుము

హత్త్వము దెల్పఁగ నవ్వఁ దోఁపు న

ద్దళచుఘకాంబుపుష్పములఁ

దాలిమి నవ్విభుఁ బూజచేసినం

గలుగు నభీష్టసిద్ధి ఫల

కాంతు గొనర్చినవారి కెన్నఁగన్. 206

వ. వెండియు నంకోలార్కద్రోణదుత్తూరపద్మముఖకుసుమం
బులను గపిత్థబిల్వపత్త్రంబులను శివుం బూజించునతండు
సాయుజ్యంబుఁ జెందుఁ దక్కినవస్త్రంబులం బూజించిన
రాజసూయాశ్వమేధఫలంబు గాంచు. 207

ఆ. వస్త్రఫలజలాన్నభక్ష్యభోజ్యాదులు
శివున కర్పణంబు సేయవలయు
నిదియె సుకృతములకుఁ గుదు రిట్లు సేయని
యతనిజీవితము నిరర్థకంబు. 208

తే. హరున కతిభక్తి భక్ష్యభోజ్యాదికంబు
లర్పణముసేయక భుజించునధములకును
శ్వానసూకరముఖనీచజంతువులకు
నంతరము లేదు ధారుణి నరసి చూడ. 209

క. కనకమునకుఁ దొడవులకుఁ
ఘనసలిలంబునకు వీచికాతతికిఁబలెన్

వనజాక్షవిరూపాక్షుల
కనిశము భేదంబు గలుగ దావంతైనన్. 210

క. వారల వేఱుగఁ జూచిన
వారలు సంసారఘోరవారిధిఁ బడి దు
ర్వారవ్యథఁ బొగులుదు ర
పారము గానంగలేక బహుళాబ్దంబుల్. 211

తే. శివుఁడు సర్వంబు దేవుఁడు శివుఁ డొకండ
యవ్యయుం డద్వయుఁడు పరమాత్ముఁ డభవుఁ
డక్షుతరుఁడు పరంధాముఁ డతనికంటె
నన్య మేమియు లేదు ధన్యాత్ములార. 212

తే. భూతిధారణ మొనరించుపురుషునకును
ధర రహస్యపరిశాశకృతంబు లైన
పాపములు వాయు సంపద పరిఢవిల్లు
సర్వవిద్యలకును వాఁడె జన్మభూమి. 213

వ. విభూతిధారణరహితుండు పతితుం డగుఁ దిృపుండాృం
కితఫాలభాగుండును భూత్యుద్ధూళితతనుండును శివనామ
స్మరణపరుండును జీవన్ముక్తుం డగు మఱియును. 214

చ. శివుకథ వీనుల న్వినుచుఁ
జిత్తమునన్ శివునిం దలంచుచున్
శివభవనాంగణస్థలికిఁ
జేరుచు నాశివుఁ బూజసల్పుచున్

శివునకు నైన ద్విజన్ములకుఁ
చెన్నుగ నన్ను మొసంగుచుఁగా శివ
స్తవపఠనాఢ్యుఁడై వెలఁగి
తాన శివుం డగు మానవుం డిలన్. 215

తే. భూతిరుద్రాక్షధారణంబును శివాల
యాదినిర్మాణమును శివధ్యానమును ద
*దర్చనంబుఁ దదీయనామానుకీర్త
నంబు నత్యుత్తమంబు ఫలంబు గాదు. 216

చ. అలరులు పత్త్రముల్ ఫలము
లంబులు శంభునివేదితంబులై
నలినదళాయతాక్షులను
సంచితసుందరనిష్కుటంబులన్
లలితసువర్ణరత్నశుభ
లక్షణలక్షితసౌధపంక్తులన్
గలుగఁగఁ జేయు మర్త్యులకుఁ
గామితవస్తుపురస్సరంబుగన్. 217

సీ. రుద్రాక్షము శిరోభద్రాంబువులఁ జోఁగ
భాగీరథీస్నానఫలము గల్గు
సాయుజ్య వర్ధిల్లు నతిఘోరభూతముల్
చేరవు రుద్రాక్షధారణమునఁ

* దర్శనంబు—కర్ణాంబు—వ్రా. ప్ర.

వ. కార్తికసోమవారాదిపవిత్రశివపవిత్రవాసరంబులను బిత్రు
దినంబులను బర్వంబులను విష్ణువ్రతదినంబులను మన్వాది
వ్యతీపాతంబులను స్నానదానాదిక్రియ లాచరించి
యుపవసించి బ్రాహ్మణులకు యథాశక్తి భోజనం బిడు
మానవుండు క్రతుకోటిఫలంబువడయు మఱి దరిద్రుండు
తన లేవడికిం జింతించుచు నాశుభదినంబుల స్నానతర్ప
ణాదికర్మంబులు సలిపి తపోనియమాచారుం డైన దాన
ఫలంబు గాంచు నట్లుగాక ధనవంతుం డయ్యు నస్నాన
కరణశీలుండై దానధర్మాదివిరహితుం డైనవాని తరు
గుల్మలతాదిస్థావరజన్మంబులు వడసి ఛేదచ్ఛేదనశీతాతప
బాధాదిదుఃఖంబులం బొందుచు నిట్లని తలంచు. 222

మ. మనుజత్వంబున మున్ను గేహావనధనో
న్మాదంబునం గ్రొవ్వి నే
మనిశంబు న్బుధులన్ హసించియు ధనా
శాయాతదీనాళిఁ బొ
ల్చన మోఘాశులఁ జేసి భోగసుఖలీ
లాలంపటత్వంబునన్
మని క్రూరాశయతన్ వసింపఁ దరుజ
న్మం బబ్బె మాకిట్టిదన్. 223

క. పార్తికసతనుప్రస్న శోభా
సక్తి మెయిన్ ధర్మవితతి సలుపక భోగా

ద్యుక్తిఁ ద్రిమ్మరుట స్సుఖ
భుక్తిరహితమైన మాత్రినిపుట్టువు గల్గెన్. 224

క. కుజనులము గాన యీగతిఁ
గుజనుల మైతి మిఁక నైనఁ గుసుమఫలదళ
వ్రజములు సుజనుల కిడి మ
ర్త్యజనిం బ్రాపింతు మనుచు నాత్మఁ దలంచున్. 225

వ. అని చెప్పి వామదేవుండు. 226

ఆ. పాత్రదానమున విపన్నుఁ డాపదఁ దరి
యించు నమ్మహాత్త్వ మొంచఁ దరమె
తరువులైనఁ దలఁచుఁ దన్వగ్గారు ఫలదళ
మూలవితతిఁ బాత్రములకు నొసఁగ. 227

వ. ఇత్తెఱంగునం దలంచి. 228

చ. అట ఫలసూనదానకల
నాభ్యుదయంబునఁ బాపముక్తి గా
విటపిలతాకృతుల్ దొలఁగి
వేమఱుఁ గుక్కుటకాకఘూకమ
ర్కటకిటిముఖ్యయోనులఁ ది
రంబుగ నుద్భవ మంది యందుఁ బ్రి
స్ఫుటనరకదుఃఖముల్ గడచి
సొంపతి మర్త్యతఁ గాంతు రంతటన్. 229

సీ. దుష్కృతసింహాసన తోలుతఁ బండాలుఁ డై
పుట్టి యోగానేకపుణ్యమహిమఁ
బన ఘోరవిపినిలోఁ బ్రాపించు నందు ని
త్యము విప్రసేవాదిధర్మకలన
నట బహువైశ్యజన్మాంతరాప్తిఁ గోలుఁ బా
సందు సత్యయానాను లలవరించి
పిమ్మట నృపతనుల్ పెక్కులు దాలుచు
మహితసద్విజగుణమహిమఁ దనరి

తే. యందుఁ గర్మచ్యుతుం డైన నవనిసురతఁ
జెందు నందును సత్కర్మశీలుఁ డగుచు
మీఁది నిరతంబు బ్రహ్మవిద్యాలుఁ డైన
నంత నిర్వాణసుఖుఁ డగు నింత నిజము. 280

వ. ఇట్లు దుర్లభం బైన విప్రత్వంబు గాంచి యందుఁ గర్మ
చ్యుతిఁ బతితుం డైన వెండియు స్థావరజంగమాదిజన్మం
బులం బొందు విప్రులు హరిహరులకుఁ బూజనీయులు
వేదపారగుం డైనవిప్రుండు సర్వగురుండును వందనీయుం
డు నగు. 281

తే. తెలియ వశమాన శివమాయ దేవాలకును
దాని శివకృప తే విట్లు దాఁటవచ్చు
హరుని భజియింపఁ దత్కృప యొదవు నట్టి
దాని దరియింతు రమ్మాయ ధరణిజనులు. 282

మ. నిరలాచారులు నిర్మలాశయులు ని
ర్జరాగ్రిగమోక్తక్రియా
నిరతుల్ దైవతదూషణోక్తివిముఖుల్
నిర్మాయులై శంభున
త్కరుణాపాత్రులు జీవదూషకులు శా
స్త్రస్మార్తముఖ్యక్రియా
త్కరదూరుల్ ఖలులై మహేశుకృపకుం
గా రెంతయుం బాత్రముల్. 233

ఉ. అనఘసుగీష్పతిం బోల్పనన
కాదులు వేదవిశారదుల్ తపో
ధనులు గనంగలేని శివ
తత్త్వము, రాగహతాత్ములై ఫలం
బనయము గోరి కొల్చి ఫల
మందక తక్కిన, నిష్టదేవతా
ఘనముగ నిందసేయు నల
కట్టెఁడిమర్త్యులు గానరత్తురే. 234

మ. హరమాయాంబునిధిం మునింగి ధనకాం
తావర్గగర్గంబులై
వరుసన్ లోఁబడి యుంత నంతరరిపు
ద్వర్గోగ్రసక్రివ్యథా

తురతం గుందుచు విష్ణుభక్తి నళవుగ
దూషింతురు స్వాంతి యా
హరభక్తిన్ హరి నిందసేయుదురు రసా
యోగ్రస్థులై మానవుల్. 285

తే. భూసురుల దేవతలను దపోధనులను
నిందగం బొనరించిన నీచతముండు
శంభుమాయామహాతాత్ముండై స్వకృతసుకృత
మహిమం గోల్పడుం దా నొకమాటమాత్ర. 286

తే. వసుధం గార్తికమున నిందువాసరమున
శివుం దిలాక్షతములం దులసీదళములు
బిల్వదళములం బూజించి ప్రీణనంబు
సలుపం గలుగు నగ్నిష్టోమసవనఫలము. 287

క. తిలదానదీపదానం
బులు నుపవాసంబు హరునిపూజయును వ్రతం
బులు కార్తికమాసంబున
సలరారంగ నొక్కటొక్కటి యధ్వరసమముల్. 288

ఉత్సా. కార్తికమునం గల్యవేళ గౌతమిం మునింగి ని
ర్వర్తితస్వకర్ముండై నవాండు త్రిదివవాసియై
కీర్తిం బెక్కుదివసములు సుఖించి యంత మరలి భూ
భర్త యగుచు నుద్భవించు భవ్యభూతికలితుండై. 289

ఆ. కార్తికంబునందు గౌతమీస్నానంబు
శశిదినోపవాససద్వ్రతంబు
నందుఁ బురహరార్పితాన్నదానంబును
దురితచరితులకును దుర్లభములు. 240

ఉ. పావసలిలఁ బొల్చు నల
భావహులమానసమురాక గాంచి గో
దావరివారిఁ గ్రుంకుచు ను
ధాకరవాసరసువ్రతంబు న
బ్భోవసఁ జేయ భావభవ
భంజనుసన్నిధి యబ్బు నరచు దే
వావళి యుర్విఁ బుట్టుటకు
నాసపడుం దగ నెల్లవేళలన్. 241

చ. అతిథికి నూర్జమాసమున
నన్న మొసంగిన నాకలోకముం
జతురపటం బొసంగిన ని
శాకరలోకము తప్త కాంచనాం
చితమణిభూషణం బొసఁగి
చెన్నుగ నచ్చర లుండులోకమున్
వితరణశాలి గాంచుఁ బృథి
వీచరఖేచరపూజ్యమానుఁడై. 242

తే. వారి గోదావరీతటావాసు లయ్యుఁ
గార్తికంబునఁ గ్రుంకని ఖలజనముల
తనువులు నిరర్థకంబులై తనరుఁ జర్మ
దారుకృతయంత్రపుత్త్రికాతతులమాడ్కి. 243

క. గోదావరిమజ్జనమును
శ్రీదయితత్రిపురహరులసేవయు సత్సం
గాదరణంబును దానద
యాదులసంగ్రహము నరుల కఘనాశనముల్. 244

తే. ధనికుఁడై యుండి పుణ్యతీర్థంబులందుఁ
బుణ్యకాలంబులందును బుణ్యకార
ణందుఁ బాత్రములకు లేశమైన నిడని
జాల్ముఁడు దరిద్రుఁ డగు జన్మజన్మములను. 245

తే. శైశవంబునఁ దారుణ్యసమయమునను
స్థావిరంబున ధనము పాత్రముల కొసఁగు
వరుఁడు రెండవజనిఁ దత్తదవసరముల
నాఢ్యుఁడై భోగభుక్తిచే నతిశయిల్లు. 246

క. యాచకుఁ డడుగుచు నుండఁగ
వాచామాత్రంబు ప్రియము పల్కఁడయే న
న్నీచుఁడు మూగయుఁ జెవిటియు
నై చెడుఁ దా నంత వృద్ధుఁడై జనియించున్. 247

శా. వైవర్ణ్యస్వరహైన్యకార్శ్యనిరతా
వాసంబుఁ దృష్ణాశనా
యావల్లీనికురుంబదోహదము దై
న్యత్రాసకంపత్రపా
దావాగ్నిస్వదమాతరిశ్వ మురుసం
తాపాదిస్సృష్టిక్రియా
దేవజ్యేష్ఠము యాచకత్వ మది సి
ద్ధించున్ లఘుత్వం బిలన్. 248

తే. బ్రతికియుండిన మఱి మృతప్రాయుఁ డగుచు
స్థూలతనుఁ డయ్యుఁ దృణగతిఁ జుల్క నగుచు
సకలజనుల కుపేక్షానిశాంతుఁ డగుచు
యాచకుఁడు సంచరించు ధనార్థి యగుచు. 249

ఉ. వాని సమర్థదృష్టిఁ గని
ద్వారనిరోధన మాచరించి దు
ర్మానమునన్ హసించుచుఁ ది
రస్కరణం బొనరించి మత్తుఁడై
కానియు నియ్యలేనియల
కట్టిఁడిమర్త్యుఁడు వేయిజన్మముల్
దాను దరిద్రుఁడై మెలఁగి
స్థావరజన్మముఁ బొల్చుఁ బిమ్మటన్. 250

క. దీనిల నడుగ సేరిన
మానితధరణీసురులకు మన్నింపని వ్యా
ధీనాథునిరాజ్యంబునఁ
బూను ననావృష్టి దుఃఖములు పెల్లొదవున్. 151

క. శివునకుఁ బ్రియముగ దానము
శివపూజ పరోపకృతియుఁ జేయని క్రూరా
త్ముఁ డతనితనువుకంటెను
భువి మేలగుచుండు తోలుబొమ్మలమనుల్. 252

తే. శివుఁడె తల్లియుఁ దండ్రియు శివుఁడె సఖుఁడు
శివుఁడె బంధుఁడు భర్తయుండు శివుఁడె సేవ్యుఁ
డఖిలము శివాత్మకంబు దదన్య మొకటి
గలుగనేరదు సకలలోకములయందు. 253

ఉ. స్థావరజంగమప్రతతి
సర్వముఖర్వశివాత్మకంబుగా
భావమునం దలంచుచును
భక్తి మెయిన్ శివపూజసేయు న
ప్పావనుఁడే శివుండు శివ
భవ్యలతస్మరణాధుర్యుఁడైన య
క్కేవలభక్తవర్యునకుఁ
గీటువిధుండు కృతాంతుఁ దుర్వరా. 254

చ. శివుఁ డన నేన కా యనుచుఁ
  జిత్తమునన్ శివపూజసేయుచున్
శివశివ యంచుఁ బల్కుచును
  శ్రీశివసత్కథ లాలకించుచున్
శివమయ మిజ్జగం బనుచుఁ
  జెన్నుగ నెంచుచుఁ బ్రొద్దుపుత్తు నా
శివుఁ డిఁక నన్ను నెన్నఁటికిఁ
  జేర్చిన నొచ్చెముగాదు మే లగున్. 255

తే. అనుచు నవ్వేళఁ బలికెడు నతఁడె శివుఁడు
సర్వమంగళసంగతు శైలకన్య
శాసహితు గాంగఝురధరుఁ గల్యవేళఁ
జింతసేయంగఁ దగుఁ బాపశాంతిఁ గోరి. 256

పృథ్వి. శివస్తవచయంబులున్ శివసహస్రనామంబులున్
శివాంతికతలంబునం జెలఁగి పల్కు రుద్రాక్షముల్
నవాచ్ఛభసితంబు సంతతముఁ దాల్చు నమ్మర్త్యుఁడున్
భవవ్యయవిదూరుఁడై భవతఁ జెందు నిక్కంబుగన్. 257

సీ. శివనామపఠనంబు సేయక యఱచిన
  రసనికల్ మండూకరసనికాళి
శివమందిరములకుఁ జేరక నడచిన
  యంఘ్రులు దారుమయాంఘ్రిచయము

శివలింగసంపీఠ సేయక పీఠించు
చక్షులు మాయూరచంద్రకములు
శివపదార్పితబిల్వసిద్ధవాసన లేని
ఘ్రాణయుగ్మము భస్త్రికాయుగంబు

తే. శివునిసత్కథ లనిశంబుఁ జెలఁగి వినని
కర్ణగోళము ఘుటకటాకటలము
శివునిఁ బూజింపఁ గానని చేనఁటికరము
దారునిర్మితనిస్సారదర్వి యుర్వి. 258

క. శివకథ వినుటయ తొడవగుఁ
జెవులకు, దానంబె తొడవు చేతమ్ములకున్
దివ్రుల భరం బగుచుండున్
భువిఁ గుండలకంకణాదిభూషణచయముల్. 259

తే. దేవదేవుని శివు మహాదేవు మాని
యితరదేవాళిఁ గొల్వఁగ మతిఁ దలంచు
నతఁడు భాగీరథీతటం బాసఁ జేరి
కూలముఁ ద్రవ్వంగఁ బూనినచేనఁటి గాఁడు. 260

ఆ. శివుఁడు మానసాబ్జసీమ వసింపంగఁ
దవులుకలుషసమితి దవులఁ బఱచుఁ
బూర్వశిఖరిమీఁదఁ బొలుపొందురవిఁ గని
సంతమసము వేగ జాఱునట్లు. 261

క. స్మరఘుస్మరశుభనామ
స్మరణము తద్ధ్యానరతియు మఱి తత్పూజా
దరణము సంసారార్ణవ
తరణులు కలుషాంధతమసతరణులు ధరణిన్. 262

చ. పవలును రేయుఁ జేయు తత
పాతకజాత మడంగఁజేయుఁ దా
శివ యనుమాట యొక్కపరి
జిహ్వఁ బొసంగుమనుష్యకోటి కి
ట్లనిని ననేకకోటిదురి
తాళి నడంచు తదీయశక్తి కిం
జవమతిఁ దూఁగుపాతకము
సల్పఁగలండె దురంతపాపియున్. 263

చ. ఒకపరి శంభునామము న
రోన్నతి నాలుకఁ జెందెనేనియుం
బ్రకటితజన్మకోటులకుఁ
బ్రాచితమై విలసిల్లు ఘోరపా
తకయుతుఁడైన శంకరప
దస్మరణంబున ముక్తిఁ జెందు జి
హ్వకు ఫల మెల్లకాలము శి
వస్మరణంబె మనుష్యకోటికిన్. 264

తే. జన్మశతకోటికృతపాపశైలములకు
హరునినామంబు శతకోటి యట్టినామ
కీర్తనంబును దద్ధ్యానవర్తనంబుఁ
దత్సపర్యయు సంసారతారకములు. 265

క. ఈయాఖ్యానము వినిన న
పాయంబులు వాయు సుకృత మబ్బు ధరిత్రిన్
ఆయువు పెరుగుం బిదప శి
వాయతిననివాససిద్ధి యగు మనుజులకున్. 266

వ. అని చెప్పి నారదుం డిట్లనియె నవ్వామదేవువలన స్వర్గా
పవర్గకారణం బైన యీశ్వరమహిమంబు విని కృతా
ర్థులై యమ్మునిబృందారకబృందంబులు సంతసించి. 267

చ. దశభుజుఁ బంచవక్త్రుఁ గర
తామరసాత్తపరశ్వధాయుధున్
శశిధరు ఫాలలోచనుఁ బ్రి
సన్నముఖాంబుజు మౌనివందితుం
బ్రిశమితదోషు నీలగళుఁ
బర్వతరాడ్తనయామనోహరున్
విశదశరీరు శంకరుఁ బ
విత్రిచరిత్రునిఁ గాంచి మ్రొక్కుచున్. 268

వ. ప్రాంజలులై యిట్లని విన్నవించిరి. 269

చ. భవ భవదీయసన్మహిమ
పన్నుగ వింటిమి వామదేవుచేఁ
దవిలి భవద్భవిష్యదవ
తారకథల్ విన వేడు కయ్యె మా
కవి దయఁ దెల్పఁగాఁ దలఁచు
నవ్యయభవ్యవనోవిలాసతన్
శివమతి యైన మృకండసుతు
చేమును వింటిమి గొన్ని దత్కథల్. 270

వ. అని యడిగిన నద్దేవగణంబులతో నద్దేవదేవుం డాత్మభవి
ష్యదవతారకథావృత్తాంతం బిట్లని చెప్పం దొడంగె. 271

ఉ. రావణనామధేయుఁ డొక
రక్కసుఁ డుక్కునఁ ద్రేతయందు నా
చే వనజాతసంభవుని
చే వరలాభముఁ గాంచి మానులన్
దేవతల న్బలారిముఖ
దిక్పతులం గడు బాధసల్పు దు
ర్భావతఁ గుంభకర్ణుఁ డను
పాపుఁడు వానికిఁ దమ్ముఁడై తగున్. 272

ఉ. ఆదివిజాభిరూపతికి మ
హాగుణశాలి విభీషణుండు నా

సోదరుఁ డొప్పు నొందియును
సోదరి శూర్పణఖాభిధాన యు
న్మేదినిఁ గల్గుమాయలకు
మేటి యనం బొలుపొందుచుండు మం
దోదరి నాఁగఁ జెల్వగుకృ
శోదరి రావణుపత్ని యై తగున్. 273

ఉ. ఆమహిళాలలామకుఁ బ్రి
యాత్మజుఁ డొక్కఁడు గల్గు నింద్రజి
న్నాముఁడు పెంపెయుం దనుజ
నాథున కయ్యతికాయముఖ్యు లు
ద్దామబలుల్ జనింపు మగు
దారుణగాత్రులు పుత్త్రపౌత్త్ర గ
ణ్ణామున వృద్ధిఁ బొందియుతఁ
డంత వసించును లంక యన్పురిన్. 274

చ. అదియుఁ ద్రికూటశైలశిఖ
రాగ్రమునం దగి హేమవిస్ఫుర
త్సదనముల న్వినూత్నమణి
జాలవినిర్మితసౌధవీథులం
గదియు గభీరనీరపరి
ఘావృతసాలములం దనర్చు నం

వవలకు నాస్పదంబును శు
భప్రకరంబులకాసకంబు నై. 275

సీ. అందుండి బలగర్వ మదర దశాస్యుండు
ఫలభుగ్గణంబులు బలసి కొలువ
యక్షకింపురుషాహిరాక్షసగంధర్వ
వరుల నిర్జరులఁ గిన్నరుల నరుల
నాహవంబుల గెల్చి యందఱసంపదల్
కైకొని యీగతి గాసి సేయఁ
దివిజులు భీతిల్లి త్రిదివంబు దొలఁగి మా
యావేషధరు లయి యవని కరిగి

తే. నవలు శాఖామృగాదిరూపములు దాల్చి
కవలఁ బైశాచవేషముల్ సవదరించి
యార్తి బడిఁ దద్వధోపాయ మాత్మఁ దలఁచి
శరణము భజింపుదురు మము సమ్మదమున. 276

ఉ. శ్రీమతిఁ బుష్కలస్తుతులు
చేసి దశాస్యకృతంబు లైన బల్
బాములు దెల్పినఁ విని కృ
ప న్సురసంఘముఁ గాంచి యేను శ్రీ
రాముఁడ నై జనించి యల
రక్కసుఁ ద్రుంచెద నేన కాక య

ప్పాదరు గెల్వ నొందఁజాలఁడు
పాల్పడనోపున ముజ్జగంబులన్. 277

ఆ. వాఁడు బ్రహ్మదత్తవరగర్వమునఁ గ్రొవ్వు
వాఁడు గాన జగమువాఁడి ద్రుంచు
ధరణి దశరథునకుఁ దనయుఁడై రాముఁ
డనఁగ దనరి వానియద టడంతు. 278

క. హరి లక్ష్మణుఁడై మత్తో
దరతన్ జనియించి నన్నుఁ దగ సేవించున్
హరియించు నింద్రజిత్తున్
హరి దక్కఁగ వాని నొరుల కలవియె త్రుంపన్. 279

ఉ. అవనితనూజ సీత గిరి
జాంశమునం బ్రభవించు రాఘవుం
డవని మదంశసంజనితుఁ
డై తగి దైత్యుల నెల్లఁ ద్రుంచు రా
ఘవుఁడె భవుండు విష్ణుఁడును
గంజభవుండును సర్వదేవతా
పరివరులు సీతయే యుమయుఁ
బద్మయు వాణియు దేవకాంతలున్. 280

వ. అని దేవగణంబుల నమ్మతిల్లంజేసి యనుపుదు మని చెప్పి
యీశ్వరుం డిట్లనియె. 281

ఆ. భువనమాత సీత భువిఁ గల్గు స్త్రీరూప
ములు ధరించి లోకముల వసించుఁ
బూరుషాకృతులను బొలుపొంది రాముఁ డ
జాండభాండములను నిండియుండు. 282

తే. రాముఁడె నిరంజనుఁడు పరబ్రహ్మ మభవుఁ
డాదికారణ మగు జగదావళికిని
సర్వగుఁడు సర్వసాక్షియు సర్వదేవ
వందితుండును కేవలానందమయుఁడు. 283

క. సనకప్రభృతులు విబుధులు
ఘనులు వసిష్ఠాదిమునులు గననేరరు రా
మునితత్త్వ మల్పమతు లగు
మనుజులు గన నెంతవారు మర్త్యములోనన్. 284

చ. అనిలజసేవితాంఘ్రిఁ గన
కాంబరుఁ గోటిమనోజసన్నిభున్
ఘనఘననీలవిగ్రహునిఁ
గౌస్తుభశోభితవక్షుఁ బద్మలో
చను నవనీసుతాయుతుఁ బ్ర
సన్నముఖాంబుజు రాము నెప్పుడున్
వినుతి యొనర్చువారలకు
వెండియుఁ బుట్టువు గల్గనేర్చునే. 285

సీ. ఋష్యశృంగమహర్షికృతసుతకామేష్టి
మహిమచే దశరథమహీభుజునకుఁ
బ్రభవించి రాముఁడు పరమపావననాముఁ
డనుజులతోఁ గూడి యరిగి బాహు
కీలితశాతాసిఖేటకం తాటకఁ
బరిమార్చి ద్రోహు సుబాహు దునిమి
కౌశికుసవనంబు గాచి గంగానది
త్తరణం బొనర్చి గౌతమునిపత్ని

తే. శతవర్షమాహితయై పతిశాపవశత
దశసహస్రాబ్దములు శిలత్వము భజించి
శ్యామజీమూతసంఛన్నచంద్రరేఖ
యందమున నున్నదానిఁ బూతాత్మఁ జేయు. 286

చ. జనకునిపట్టణంబునకు
జానుగ నేఁగి రఘూద్వహుండు తా
ననువుగఁ గాకపక్షధరుఁ
డయ్యు నృపాలురు మెచ్చ మచ్చరా
సనదళనంబుఁ జేసి యల
జానకిఁ బెండిలియై యయోధ్యకుం
బనుపడ నేఁగు మార్గమున
భార్గవరాముని గెల్చి నుక్కునన్. 287

క. సీతాయుతుఁడై యట సా
కేతనగరిఁ జేరి సుజనకీర్తితకీర్తి
స్ఫూర్తిగతిఁ గొన్నియబ్దము
లాంతతసుఖకేళిఁ జేలు నతఁ డందుఁ దగన్. 288

వ. అంత. 289

ఉ. రాముఁ గుణాభిరాము యువ
రాజధురంధరుఁ గా నొనర్పఁగాఁ
దా మది నెంచి పౌరజన
తం గని పఙ్క్తిరథుండు పల్కె నీ
రాముఁడు సర్వసమ్మతుఁడు
శ్రాశ్రితహితుండును ధార్మికుండు నే
నీమహిభార మీయనవ
యిగ్గ ఘటియించి సుఖింపఁ గోరెదన్. 290

చ. జనకునిపోలికం బ్రజ న
జస్రముఁ బ్రోచు సుధాంశుకైవడిన్
జనులకు నెల్లకాలమును
జల్లఁదనం బొనగూర్చు రాముఁ డీ
నెనయుఁడు మీకు రాజగుట
సమ్మతమే యన వార లుబ్బి యో
యినకుల మామనోరథము
నిట్టిదె పట్టము గట్టు మీఘనున్. 291

క. అని పల్కు పౌరజనములఁ
యనుమతిఁ గొని రామదేవు నభిషేకింపన్
మనమున నుత్సుకుఁడై య
జ్జనపతి సంభారసమితి సమకూర్చెఁ దగన్. 292

ఉ. అన్నృపుభార్య కైక యను
నంగన యయ్యభిషేకసంభ్రమం
బానతిఁ గాంచి మున్ను వర
మాన్నృపుఁ డిచ్చుటఁజేసి కోరు స
మ్మాననిని యాత్మపుత్త్రి గరి
మంబునఁ బట్టముగట్ట రామునిం
బూని చతుర్దశాబ్దములు
భూరివనాంతరవాసిఁ జేయఁగన్. 293

తే. అతఁడు వరపాశకీలితుం డగుటఁజేసి
భార్య వేఁడిన నేమియుఁ బలుకకుండ
నట్ల కాదె దృఢవ్రతు లగుమహాత్ము
లాడఁబడినమాట న్మోఁ జిత్రిన నోర్వఁగలరె. 294

ఉ. ఆమొద దేవతాగణము
లయ్యభిషేకశుభాంతరాయము
జేయఁగ నాశ్రయించి నుతి
సేయఁగఁ గైకయు వారిబోధచేఁ

బాయక యవ్వరద్వయము
భర్తను వేడఁగ దైవవంచితుం
డై యశఁ డిచ్చు సత్యరతి
నాత్మకులాంగనవాంఛితార్థముల్. 295

సీ. సురలు విరులవాన గురియింతు రప్పుణ్య
రాశియైన పక్షిరథునిమీఁద
నతని సత్యమునకు నలరుచు నాత్మీయ
కార్యసఫలతకును గరముఁ బొంగి. 296

తే. వెలఁగి రాముఁడు పట్టాభిషేకవేళఁ
గైక యొసఁగినపరుషవల్కలముఁ దాల్చి
యవిగతానందమయుఁడు దా నగుటఁ దెల్పు
భోగయోగసమత్వవిస్ఫురణ దనర. 297

క. ఆరాముని ముఖవిలసన
మారసి యాతండు శిశుఁడ యగు నిక్కము చె
ల్వారఁ మనుజుండు గాఁ డని
యారూఢి న్నిశ్చయింతు రావీటిప్రజల్. 298

ఉ. ఆతఁడెఁ దండ్రియానతిఁ బ్రి
యావరజుండు సుమిత్రపట్టియున్
సీతయుఁ దోడ రాఁగ నత
సీసుమధాముఁడు రాముఁ డేఁగి గం

గానటనీతటంబున సు
ఖస్థితి నిల్చి గుహాభిధానవి
ఖ్యాతుని శృంగిబేరనగ
రాధిపుఁ గాంచెఁ గిరాతవల్లభున్. 2?9

తే. ముందుఁ దా నెక్కి వచ్చిన స్యందనము సు
మంత్రుఁ డనుయాతవరునిచే మరల ననిచి
యమునానది దాఁటి యగ్గుహానుమతమునఁ
జని యతండు భరద్వాజమునికి మ్రొక్కె. 800

ఉ. ఆఋషియాన పూని చని
యారఘువీరుఁడు గాంచె భూరిమం
దారనమేరువీరతరు
దాడిమముఖ్యమహీజవాటముం
బారసుధారసాచ్ఛరుచి
సాంద్రరుచాంచితసత్ప్రపీటముం
శ్రీరమణీయదేవగణ
సేవితకూటముఁ జిత్రకూటముం. 801

తే. అవనిజాలక్ష్మణసమేతుఁ డగుచు రాముఁ
డాధరాధరవరమున నధివసింప
నాథునిఁ బాసి దుఃఖాకులాత్ముఁ డగుచు
స్వర్గమున కేఁగు దశరథక్ష్మావరుండు. 803

మ. ఘనిణీనాథుఁడు స్వర్గతుం డగుడు సం
తం గైకయీనందనుం
భరతు స్మంత్రిలు రాజ్య మేలు మనుచుం
బ్రార్థింప నాసత్యవా
క్పరతుం డొల్లక తల్లి నుల్లమునఁ దా
నిందించి శ్రీరాముఁ దే
నరుగుం బౌరపురోహితార్యజనభృ
త్యామాత్యవర్గంబుతోఁ. 303

క. ఈకొంగునఁ జని యతఁడు గి
రాలిపతిం గాంచి యట భరద్వాజునిచే
నాతిథ్యము గొని రాముడు
హితిలపతివసతి యున్మ్మసింద్రుఁడు తెలుపఁ. 304

చ. భరతవిభుండు గాంచు మద
బంభరడింభకగీతనాదమే
దురతరపాటలీనకుళ
తుంగలవంగసుగంధభారభా
స్వరమరువంశకస్థగిత
సానుచరత్సురయుగ్మరఘూటముం
స్థిరగయపాశ్మశోణను రి
చిత్రితశృంగముఁ జిత్రకూటముం. 305

శా. ఆంగ స్వర్గరఘునాథునాథు నరవిం
దాక్షు న్మహాబాహునిం
గందర్పాయుతసుందరు న్వసుమతీ
కన్యాయుతు న్స్మాని మా
కందారామవసంతు రాఘవుని శ్రే
ష్ఠుం గాంచి కేల్మోడ్చి చె
ల్వొందన్ భూపరిపాలనంబున కలం
డొప్పారఁ బ్రార్థింపఁగన్. 308

తే. అమ్మహాత్ముఁ డాప్రార్థన నమ్మిచేసి
మరలఁ బనిచిన భరతుఁ డమాత్యమాత్య
హితపురోహితసహితుఁడై యేఁగుదెంచి
పురము చేరక నందిగ్రామమున వసించు. 309

తే. భరతుఁ దరిగిన రాముఁ డగ్గిరిఁ దొలంగి
దండకాటవి కేఁగు నీదండ నున్న
మరలఁ గొదుఁలు వచ్చిన మద్వ్రతమున
కంతరాయంబు సంధిల్లు నని తలంచి. 310

వ. ఇట్లు దండకారణ్యంబుం బ్రవేశించి యుండు. 311

భుజంగప్రయాతము. దినేశాన్వయుం దుష్ట్రత్తేజం ద్రోచుం
ఘనోచ్చండకాండప్రచండంబు చేతన్
గనత్సంతతక్రోధుఁ గ్రవ్యాదబాధ
న్వనిర్ఘోషనిర్ధాతసాధ్వ[illegible]. 312

క. చనిచని నాయకుఁడు గాంచెఁ
మునివరు శరభంగు యోగముద్రాసంగున్
ఘనతరదురితవిభంగుం
జననుతవిమలాంతరంగుఁ జరదర్భాంగున్. ౪౧౩

వ. అమ్మునీంద్రునిచేతం బూజితుండై యంత. ౪౧౪

లయగ్రాహి. ఏముని జగంబులకు సేమము ఘటించుమతి
నామకొను వింధ్యగిరిభూమిఁ జణఁగించెన్
దామరససంభవముఖామరులు మెచ్చ నెస
నేమునివయోధి యభిరామగతిఁ ద్రావెన్
భీమబలు నిల్వలుని వాపమడఁచె నేముని త
పోమహిమ ముల్లసిల నేమునివరుల దు
ర్ధామధృతిచే నహుషుఁ బాముగ శపించెఁ దగ
నామునిని నగస్త్యు రఘురాముఁ డటఁ గాంచెన్.

సీ. అలఘుపాశిసరోజచుళుకితవిషరాశి
హారిదినీలలితజటాంచలుండు
జీవనకలుషవిదారిజనస్ఫూర్తి
వక్రీకృతాహార్యవైభవుండు
నార్యానురంజనాయత్తలసత్కృతి
మహితకామక్రోధమర్దనుండు
జగదభినన్నుతసర్వజ్ఞతాఖ్యాతి
శ్రీకరద్విజరాజశేఖరుండు

తే. ననఘుతరశుచిభాస్వదబ్జాంబకుండు
సచలభాముండు ద్వీపిరాడజినచేలి
భవ్యుఁడు దా నైన కుంభసంభవునిఁ జేరి
యారఘుస్వామి వందనం బాచరించు. 316

క. మన్మా ర్త్యంతర మగుఘట
జన్ముని వింధ్యాద్రిదమను సన్మునివరు ను
ద్యన్మతి భజియించుచు నా
చిన్మయుఁడు వసించు నతనిచే దీక్షితుఁడై. 317

క. అమ్మౌని యక్షయతూణీ
రమ్ములు నైంద్రి మగుచాపరత్నము దివ్యా
స్త్రమ్ములు నిస్త్రింశంబును
సమ్మోదితహృదయుఁడై యొసంగును బిదపన్. 318

వనమయూరము. జానుగ నిసర్గబలశౌర్యయుతుఁ డయ్యెన్
మానివరదత్తశరమండలి కడంకన్
బూని యురుతేజమున భూపమణి యంతన్
సాన నొరవట్టు మణిచందమునఁ బొల్చెన్. 319

తే. అచట నతఁడు వసింపంగ నఖిలమునులు
నసురకృతబాధల నలంగి యరుగుదెంచి
రామ మముఁ గావు మనుచుఁ బ్రార్థన మొనర్ప
విన్నవింపుచు రిట్లు ప్రసన్నఫణితి. 320

ఉ. రక్కసు లాశ్రిమంబులకు
రాయిడిసేయఁగ శేవగల్గు మే
మక్కట చిక్కి నిష్ఠురయు
నన్నముగాన కనూనభీతి నీ
చక్కటి కేఁగుదెంచితిమి
స్నానము సంధ్యయు వేదపాఠముం
దక్కటికర్మకాండమును
దాలిమిఁ జేయఁగ లేకపోతిమి
నన్నుదర్శా. 821

వ. స్నానసంధ్యాదిసత్క్రియాకలాపంబు లకాలక్షేపంబులై యవిచ్ఛిన్నం బొనరించుం గావున నారక్కసుల నుక్కడంచి మమ్ముఁ బ్రోవు మని ప్రార్థించిన నావసుపీరుండు దేవారులం ద్రుంచుటకుం బ్రతిజ్ఞచేసి వారిల నని యచ్చోట నుండునంత. 822

క. శూర్పణఖ యనెడిదానవి
దర్పకదర్పార్తయగుచుఁ దనుఁ జేరఁగఁ బెం
పేర్పడఁగ ముక్కు దునుముచు
స్వర్పతివినతుఁ డగు రామచంద్రుఁడు గడిమిన్. 823

చ. అదియును నేఁగి తెల్ప ఖరుఁ
డాదిగఁ బెక్కురు యుద్ధదుర్మదుల్
త్రిదశవిరోధు లాజి నెదు
రించిన నప్పదునాల్గువేవురం

గదనములోనఁ దున్మించు లయు
కాలఘనాఘనశరంబడంబర
ప్రిదరచయప్రయోగమున
రాముఁడు భీమగతిం జెలంగుచున్. 324

ఉ. వారలు మున్ను భూసురు ల
వారితభక్తి ననుంగుఱించి దు
ర్వారతపం బొనర్చి కడు
వక్రతరోక్తుల ముక్తిఁ గోరుటన్
శ్రీ రమరారిజన్మములు
జాల్చిరి నే రఘురామునాకృతిన్
ధారుణిఁ బుట్టి వారి నుచి
తస్థితి ముక్తులుగా నొనర్చెదన్. 325

వ. ఇట్లు రఘువీరుండు ఖర దూషణ త్రిశిరఃప్రముఖచతు
ర్దశసహస్రదానవులం బరిమార్చి మోక్షలక్ష్మీకల్యాణ
గౌరవంబు సంఘటించుఁ బదంపడి యద్దానవి దేవదానవ
దుర్జయంబును దివ్యకూటశిఖరిశిఖరస్థితంబును రత్నసం
పూర్ణంబును నవకోటిశివాలయాధిష్ఠితంబును వేదనినాద
నాదితంబును ననేకరాక్షససంకులంబును నిత్యమంగళా
లంకృతంబును నగు లంకాపురంబునకుం జని నిజాగ్రజుం
డైన దశగ్రీవునకుఁ దద్వృత్తాంతం బెఱింగించిన నతండు
ను నిజభగినిం జూచి రాక్షసవినాశనంబునకుం బొడమిన

ధూమకేతువుగా నెంచుచు ని ట్లని వితర్కించు. 826

మత్త. మంటి నేఁబదిలక్ష లేదు అమర్త్యులం బొడఁగంటి ము
క్కంటిపీటను విష్ణుపీటను గంజగర్భునిపీటమున్
గొంటి నంపద లెన్నిరేనియుఁ గోరి చంద్రదినేంద్రులం
గంటి సైఁగ మెలంగఁజేసితిఁ గంటి సర్వసుఖోన్నతుల్. 827

ఉ. నందన మంతయుం బెఱికి
నాఁటితి మద్వనసీమఁ దత్తరుల్
బందను బెట్టితిన్ దివిజ
పత్నులఁ దక్షకముఖ్యగూఢపా
త్బృందము నాదుపేరు విని
భీతిఁ గలంగు మదీయమందిరా
ళిందమున న్వసింపుదురు
లేఖకులంబును దైత్యవర్గముగా. 828

వ. చతుర్దశలోకాధిపత్యవిరాజితుండ నై త్రిలోకదుర్లా
భం బైన యైశ్వర్యంబునం జెన్నొందియు ననేకముని
సాధుబృందంబుల బాధించుచు నైశ్వర్యద్విగుణం బైన
పాపంబు భోగలుబ్ధుండ నై యాచరించితి నన్యక్షోభకర
ణంబు వలన నైశ్వర్యంబు సంపాదింప నైతి. 829

తే. అయిన విది వ్యర్థమయ్యె నీయఖిలలోక
జయము దేజంబు నైశ్వర్యసంగ్రహంబు

బంధుహితపుత్త్రిపౌత్త్రిప్రపౌత్త్రితతియు
జాలములు గాక పోవఁ బిరాఁజాలఁగలవె. 330

వ. వారణాసీమరణంబును బ్రహ్మజ్ఞానంబును నిర్వాణప్రాప్తి కిం గారణంబులు దురితచరితుండ నగు నాకు నీరెండును సిద్ధింపవు రాఘవుండు తండ్రియానతి నరణ్యంబున నేతెంచి యున్నవాఁ డమ్మహాత్మునిచేఁ గదనంబున మడసి ముక్తుండ నయ్యెద నాసత్యసంధుం డనపరాధుల హింసింపండుగావున నతనికి నొక్కయహితం బాచరించి తద్బాణహతి స్మృతిఁ బొంది ముక్తి వడసెద నని నిశ్చయించి మారీచుం డనురాక్షసునిం దత్కార్యసహాయార్థం బర్థించిన వాఁ డద్దశగ్రీవున కిట్లను. 331

చ. ఎఱుఁగుదు రామదేవు దను
జేశ్వర చిన్నటనాఁటనుండి మున్
వెఱచితి నమ్మహాత్ము శర
వేగము సైఁపక శైశవంబునన్
గఱచె ననేకదివ్యశర
కాండము లయ్యెరువిక్రమాఢ్యుఁ డి
త్తఱిఁ దరమౌనె యాఘును ను
దగ్రబలున్ రణభీముఁ దాఁకఁగన్. 332

శా. ఏకన్యాగ్రణి రాఘవుం డసురలో
కేంద్రా వినన్ వాసవ

ప్రాతంబుం బోలియుంప మానినుజన
ప్రాతంబుల న్మన్పఁ బ్ర
స్ఫీతపరిక్రియ ధర్మము న్నిలుప నీ
వృథ్విన్ జనించె న్వలో
పేతుం డాహవకర్కశుం డతనితో
నేలా విరోధింపఁగన్. 333

క. రాక్షస! నీజీవితమున్
రక్షింపుము చెడఁగ నేల రామాగ్ని వెసన్
భక్షించుఁ దృణకణాకృతి
నక్షయశరశిఖల మర్మదానురవితతిన్. 334

తే. అతఁడు బ్రహ్మాండలయకర్త యగుశివుండు
గాని కేవలమనుజుండు గాఁడు వినుము
ఖరవిరాధాదిదుష్టరాక్షసుల నెల్ల
సంగరావని నోడుచుట సాక్షిగాదె. 335

క. గిరిభిత్తనయక్షయకరుఁ డగు
సురపతిగతిఁ బురము లేర్చుశూలిగతిన్ భా
స్కరకులజుం డాలంబున
సుర వైరులమద మణఁచుసుమీ దనుజేంద్రా. 336

వ. కావున నాబుద్ధి విని రామదేవునితో విగ్రహింపకు మని
యనేకవిధంబుల బోధించిన గనలి యతండు మండలా
గ్రం బెత్తి దండింపం జూచిన వెఱచి యమ్మారీచుండు. 337

ఆ. ఖలుఁడు వీనిచేతఁ బొలిసిన రాక్షస
జన్మ మబ్బు రామచంద్రుచేత
నీల్గ ముక్తి యొదవు నిది మంచి దని యియ్య
కొనును దశముఖుండు పనుచువనికి. 338

వ. అప్పు డవసరంబున నారదుండు రాముసన్నిధికే తెంచునంత.

తే. నారికేళ పనస తినిశ నాగకేస రామ్ర మం
దార కుంద కదళికాది తరులు విరుల వఱలి చె
ల్వార ఫలసమృద్ధి నలరి యతనియాశ్రమస్థలుల్
నారదునకు సంఘటించు నయనకంజపర్వముల్. 340

క. ఎదురేఁగి మ్రొక్కి యానా
రదునకుఁ బూజ యొనరించి రఘుపతి యంతన్
వదనేందుజ్యోత్స్నాయుత
సుదరస్మితకాంతిగరిమ శోభిలఁ బలుకున్. 341

తే. అనఘ! మీరు గృహస్థగృహాంతరముల
దిరుగుచుండుట వారికి నతులభద్ర
సమితిఁ గృపసేయుటకుఁ గాక సర్వధనవి
రక్తు లగుమీకు వేఱ కార్యంబు గలదె. 342

వ. భవదీయపాదరజంబున నాగృహంబు పవిత్రం బయ్యె నని
పల్కిన విని నారదుండు. 343

సీ. హరుఁడవు నీవ బ్రహ్మవు నీవ విష్ణుండ
వీవ శక్రాది దిగీశగణము

గవ్యభుక్త్రియుఁ బక్షిశశాంఖవాసుకి
ప్రముఖఫణీంద్రులు నమరవరులు
వాలఖిల్యాదిదివ్యమునీంద్రులును నీవ
కపిలాదులును మహాశరభపుంబు
మాండూకపతియును మహి నీప హ్రాదయున
ద్మనులు వసించి భూతముల నెల్లఁ
తే. ద్రిప్పుదువు కీలుబొమ్మలతెఱఁగు దోఁప
సకలమును నీ వెఱుంగనియర్థ మెద్ది
పంక్తినవనుఁడు జగములబాధ సల్పఁ
దెలుపవచ్చితి నవ్వార్త దేవరకును. 814
ఆ. మహతియును విపంచి వహియించి దేవ గా
నం బొనర్తు దనుజనాథునొద్ద
వేళ దప్పెనేని తాళిక దండించుఁ
బదరి వీణ్కాయుఁ బగులఁ నడఁచు. 815
తే. జలజగర్భుఁడు వేదముల్ సదువుచుండు
దితిజపతియొద్ద వేళ యతిక్రమింపఁ
బరచపేటాహతుల నొంచు నతని సురలు
వెట్టిఁ గొట్నముచేసి సేవింతు రతని. 816
వ. ఇట్లు చతుర్దశభువనంబులకు బాధ గావించుచున్నవాఁ
డద్దురాత్మునిఁ బరిమార్చి జగంబులకు సేమంబు సంఘ
టంపు మని ప్రార్థించిన విని యాహామదేవుండు. 817

సీ. శ్రుతిపరాయణు లందఱు సోమయాజు
లందఱును జపహోమక్రియాదినిరతు
లందఱు నహర్ముఖస్నాన మాచరింతు
రష్టదశముఖముఖుల నే నట్టింతు. 348

తే. మానుషుండు శ్రుతుల్ గొని చనె
నాయున విష్ణుండు దెచ్చె సవ్వేదతతుల్
ఘోరము స్వ్యస్త్రము లైనఁ
శ్రీమతి రావణుఁడు సమము చేసి పఠించెఁ. 349

వ. అనిన విని యద్దేవమునిప్రవరుండు. 350

ఉ. వారలు విప్రదేవముని
వర్యవిహింసకు లార్యనిందకుల్
భూరికృపావిహీనులును
బుణ్యవిహీనులు సత్యహీనులుఁ
దారుణకర్ము లన్యవని
తాధనలోలుపు లద్దురాత్ములం
జోర వధించి యీభువన
ముల్ గృపఁ బ్రోచినఁ బాప మబ్బునే. 351

తే. స్మరహరుండును హరియు బ్రహ్మయును నీవ
దేవకార్యంబుకొఱకుఁ బంక్తిరథునింటఁ
బుట్టినాఁడవు రామ యిప్పలను దిండ్లఁ
మునుము లోకంబు లెల్లను మనుపఁగోరి. 352

వ. నీస్వరూపంబు చింతింపుము రాజనందనునకు దుష్టనిగ్ర
హంబును శిష్టపరిపాలనంబు నవశ్యకర్తవ్యంబు లనిన
రాఘవుం డమ్మునీంద్రుం గనుంగొని. 353

సీ. సత్యంబు నీమాట సంయమి ! నారూప
మే నెఱుంగుదు లోకహితముకొఱకుఁ
బుట్టితి దశరథుపుణ్యగేహంబునఁ
గ్రవ్యాదవర్గంబుగర్వ మడఁప
సీతాహరణకాంక్షఁ జేరఁ జాలన్యుం డెందు
నా కనపాయిని లోకవినుత
నవనిజఁ దాఁచి మాయాసీతఁ గల్పించి
తత్కారణంబున దనుజుఁ ద్రుంతుఁ

తే. బాయు దర్శించుమాత్రన బ్రహ్మహత్య
యట్టిసేతువు జలనిధియందు నిలిపి
యాసుధాకరసూర్య మీయవనిఁ గీర్తి
నిలిచి కుశలంబు సంధించు నిఖలమునకు. 354

వ. అని పలికి యమ్మునీంద్రుం బనిచి ధనుష్కోటియందు మృ
త్యుదేవత నాకర్షించి నీవు లంకాపురంబునకుం జని రావ
ణాదిదానవులం ద్రుంపు మని పంచిన నది యిట్లను. 355

ఉ. రావణుఁ డేలు నప్పురవ
రంబు చొరంగఁ దరంబె నాకు నా

రావణు నాజ్ఞ లేక సుర
రాక్షస పన్నగ యక్ష ముఖ్యులుం
బోవఁగలారె రాజకుల
భూషణ బాధ యొనర్చె నన్ను నా
ద్దేవవిరోధ మున్నతని
దిక్కున కేను నమస్కరించెదన్. 356

తే. విన నీయాజ్ఞ గైకొని యప్పురవరి
వేళ యొనరింతు దానవవీరువలనఁ
బ్రాణసంశయ మగు నని పలుక రాముఁ
డిట్టు లను దానితోడ సహీనఫణితి. 357

క. రక్కసిరాయని పెస నే
నుక్కడఁచెద వాఁడు చేరు నుగ్రాటవికిం
దక్కటి యసురుల నెల్లను
జక్కడఁపుము వానిపురికిఁ జని నిర్భయతన్. 358

వ. అని పలికి జానకిం జూచి. 359

తే. కంటివే సీత రావణు కైతవంబు
నీచవర్తనుఁ డైన మారీచుఁ గూడి
మాయచేయుంగఁ దలఁచె మన్మాయ దెలియఁ
గాన కాతండు దౌష్ట్యంబుకారణమున. 360

వ. అనిన సీత యిట్లని పలుకు. 361

సారె నక్రశిలోనఁ గుశంకసేయు
నరుఁడు దుర్గతిఁ జెందు నింతయు నిజంబు. 864

తే. మును వసిష్ఠుండు వ్యత్యస్తముగ నొసర్చి
రామనామోపదేశంబు ప్రేమఁ జేయ
నాజపంబున వాల్మీకి యయ్యె శబరుఁ
డితఁడు రామాయణముసేయు నచలనిష్ఠ. 865

క. వ్యత్యస్తరామమునుజప
కృత్యంబున ద్విజతఁ గాంచెఁ గ్రించుకుఁడు వా
సిత్వము ఋజాతరజపి యగు
సాత్యగ్నిము భాగధేయ మడుగఁగ నేలా. 866

వ. ఇట్లు భవదీయచరిత్రంబును భవన్నామమహిమంబును
నత్యంతపవిత్రంబులై వెలయు ననిన జానకీదేవివలుకు
లకు సంతసిల్లి రాఘవుం డప్పుడ మృత్యుదేవత నొక్క
మాయాసీతఁ గా నిర్మించిన నమ్మాయాసీతయుఁ
బ్రాంజలియై నిలిచి యమ్మహాత్మునితోడ. 867

శా. స్నానసంధ్యాజపాదిసత్క్రియలు ని
ష్ఠం జేయుమానీంద్రులుం
గానం జాలని శీఘ్రగాంబురుహముల్
గంటిం గనుల్ సల్లఁగా
నే నేపుణ్యము మున్ను చేసితినో శ్రీ
నిత్యంబు నీసేవ య

త్యానందంబునఁ జేయఁ గంటిఁ బలిగొ
మ్మా భూరికారుణ్యవీ. 868

క. అతిసుందరవిగ్రహులఁ దగు
పతి గలుగుట దుర్లభంబు పడఁతులకు స్వ
త్కృతసుకృతవశతఁ గలిగితి
వతులాకృతి నేను నీకు ననురూపఁగబా. 869

ఆ. పర్ణశాల యలికి పాకంబు సేయుదు
మూలవితతిఁ దానమునకు జలము
లం[illegible]యిత్తు దేవతార్చన కలరులు
దెత్తు నుచితవిధులు దీర్చనిత్తుదు. 870

క. చతురమతి నన్నదానం
బతిథుల కిడి యారగింపుఁ దనుజుఁడు నీవుగా
క్షితి జన్మజన్మములకుం
బతి వీవే కావలయును బార్థివ నాకుగా. 871

క. విహరింపుము నాతోడుత
నహరహము స్నేహకు నిష్టనై యుండున్గభూ
ద్వహ నీసుందరరూపం
బహహా వీక్షింప మ్రొగ్గుల్ల నబ్బరెం జూడుక్కల్. 872

తే. వనచరులఁ గూడి లక్ష్మణుఁ డనికి సరిగి
ప్రసవఫలమూలములఁ దెచ్చు దాశువేవ

సేయు జన్మంబు సఫలతఁ జెందు గాత్ర
మతిపవిత్రితరం బగు ననఘులకును. 373

వ. అనుచు మాయాసీత పలికిన విని నిర్వికారుండును స్వ
తంత్రుండును శివాత్మకుండును నైన రాఘవుండు సీతా
దేవిం దనయర్ధదేహంబున నిమిడ్చికొనియె ని ట్లర్ధనారీ
శ్వరుం డైన శరీరంబునం దేజరిల్లియు మాయాయవనికా
ఖిలీనుం డయ్యె నని చెప్పి శివుం డిట్లనియె. 374

ఆ. ఏను రాఘవుండ జానకి శైలజ
గాన నేకగాత్రకలితు లైరి
యట్టిరూపధరుని నారాముఁ దలఁచినఁ
గలుగు నిఖిలపుణ్యకర్మఫలము. 375

మ. భసితోద్ధూళితగాత్రుఁ బాటలజటా
భారు న్ధరానందనో
ల్లసదర్ధాంగు దరస్మితాంచితముఖో
ల్లాసు న్వరాభీతిహ
స్తసముజ్జృంభితుఁ జాపఖడ్గకలితున్
శార్దూలచర్మాంబరుం
రసితుండై తలఁపం దదాత్మకతచే
రంజిల్లు మర్త్యుం డిలన్. 376

తే. అపుడు రావణుఁ డవనిజ నపహరింపఁ
దలఁచి పనిచిన మారీచదానవుండు

కుటిలమ్మృగరూపధరుఁ డయి కూటసీత
యుద్ధ విహరింప దాని నయ్యువిద గాంచు. 877

సీ. విహరించు నల్లన బహువహాద్భుతిని
నలవోకఁ బులుమేయు నాన గొఱలి
చరియించు నొయ్యన చంచలేక్షణముల
ధవళకాంతులు తళ్తళులు గులుక
మలయు నుజ్జ్వలహేమమణిమయాంగద్యుతు
లింద్రచాపప్రభ నినుమడింప
నడచు మెల్లన వసుంధరమీఁద ఖురహీర
దీధితుల్ రేయెండ తెరల వఱల

తే. గాలిదేవరమందురఁ గట్లఁ దోఁఱఁగి
పాలుతెంచినవార్వంబుపగిదిఁ బఱచు
నజునినిర్మాణకుశలత యుపహసించి
యందమున నందుఁ దిరిగె మిథ్యామృగంబు. 878

వ. అప్పుడు వినయావనతవదన యై సీత యామృగంబుతో
డం గ్రీడింపం గోరి రామున కిట్లను. 879

తే. పతియె తల్లియుఁ దండ్రియుఁ బతియె తోడు
పతియె బంధుఁడు మిత్త్రుఁడు సతులకును
భ్రాతయును దండ్రిసుతుఁడు నల్పంబు నిత్తు
రమితముగ నిచ్చు భర్త సెయ్యమున సతికి. 880

వ. కావున నమ్మృగంబుఁ దెచ్చి నాకు మనఃప్రియంబు గా

వింపు మనిన రాముండు తత్క్షణంబ శరశరాసనధరుండై
తదన్వేషణార్థంబు లక్ష్మణు నియోగించి యమ్మృగంబు
వెనుకొని యతిదూరం బరిగి విసివి. 381

క. ఆ లక్ష్మణాగ్రజుండు ప్ర
త్యాలీఢస్థానవసతి నమరి పలాశిన్
వాలమ్మున వ్రేయుటయున్
హా లక్ష్మణ యనుచు వాఁడు ననువులు దొఱఁగెన్. 382

వ. అమ్మృగకళేబరంబు గొనుచు నతండు నిజాశ్రమంబునకుం
జనుదెంచె నని విని నైమిశేయు లటమీఁదటికథా
వృత్తాంతం బెట్టిదో యని యడుగుటయు, 383

ఉ. శైరవిణీమనోరమణ
ఖండశిఖండ యఖండగర్వదు
ర్వారమతంగజాసురజ
వప్రవిఖండనచండకాండ మా
యూరశిఖండమండనస
ముజ్జ్వలకాండ గవేశకాండ సం
తారకమండలాగ్రదిత
దానవమండల భోగికుండలా. 384

క. కర్మహరిసానుగర్భాం
తర్మగ్న జనౌఘవాంఛితప్రియధనస

న్నిర్మాణదక్షు దక్షువి
నిర్మితమఘతంత్రభంగ నిహతానంగా. 385

వసంతతిలకము. తారాగిమందిర విధాత్రృకిరీటకోటీ
స్ఫారాబ్జరాగరుచిబంధురనిపరేఖా
నీరాజితాంఘ్రిపదనీరజ పేపవాహా
వారాశితూణ నిధివల్లభసఖ్యలోలా. 386

గద్య. ఇది శ్రీమద్గురుకరుణాతిశయలబ్ధకవితావిభవ
యాఁదులపల్లి శంకరమంత్రితనూభవ సుధీజన
విధేయ భవానీశనామధేయప్రణీతంబైన
స్కాందపురాణంబున ధర్మఖండం
బను ప్రబంధంబునం
షష్ఠమాశ్వాసము.



శుభమస్తు

అవిఘ్నమస్తు

# ధర్మఖండము

## నవమాశ్వాసము

శ్రీలలనాధిపమార్గణ
బాలార్కద్యుతిజటావిభారపినద్ధ
ప్రాలేయకిరణ దిక్చయ
చేలా చిన్మయవిలాస శ్రీగిరివాసా. 1

వ. అవధరింపుము వివిధపురాణకథాకథనప్రఖ్యాతుం డగు సూతుండు శౌనకాదిముఖ్యులం జూచి హరుండు సురగణంబులకుం దెల్పువృత్తాంతం బిట్లని చెప్పందొణంగె నట్లమర్త్యకృచవచనంబులు విని సౌమిత్రిం జూచి సీత యిట్లనియె. 2

తే. అన్న లక్ష్మణ నన్ను మీ యన్న దలఁచె
సంధ్యవేళా ధైర్యమాయ సేమఱయ్య నొక్క
చనుము తోడుగ వేగంబె చూవు పోటిసి
యనుచు జనకజఁ జూచి యిట్లను వతఁడు.

క. తెలియ వేల నీకు రాముఁడు
శితికంఠుఁడు గాని నరుఁడు గాఁ డసురతతిన్
నుఱుమాడి వేగ వచ్చున్
నెఱ వగుచేబలిమికలిమి నిక్కువ మబలా. 4

తే. అనుడు నాధోరణుఁడు మదహస్తి నంకు
శాహతిఁ గలంచుమాడ్కి నయ్యంబుజాక్షి
పరుషవాక్యాయుధముల నొవ్వఁ బలుక నోడి
యగ్రజుం డున్నదిక్కున కరిగె నతఁడు. 5

ఉ. ఆపటి భిక్షువేషధరుఁ
డై దశకంధరుఁ డేఁగుదెంచినన్
భూతనుజాత నిక్కపుఁద
పోధనుఁ డంచు నమస్కరింపఁగా
నాతఁడు చేతు లిర్వదియు
నాననము ల్పదియుం జెలంగ నా
భీతమృగాక్షికట్టెదుర
భీమతరాకృతితోడ నిల్చినన్. 6

ఉ. తక్కసుఘోరరూపము తి
రంబుగఁ గాంచి నిమీలితాక్షియై
యక్కమలాక్షి మూర్ఛిలఁగ
నంటఁగ నోడి త్రిశూలధారచేఁ

ద్రెక్కిన నవ్వులాశ తద
ధిష్ఠితలోష్టము పెల్లగించి సొం
పెక్క రథంబుమీఁద నిడి
యేఁగె విహాయసవీథి నొక్కఁడుఁ. 7

ఉ. ఆయెడఁ బక్షివంశమణి
యైనజటాయువు సత్త్వశాలి య
చ్ఛాయకుఁ జేరి పఙ్క్తిరథు
సఖ్యము సమ్మదితోఁ దలంచి నే
నీయఘరాధముం గడపి
యీసుదతిన్ విడిపింపఁ గల్గు నా
కాయతశుభ్రకీర్తి యని
యాతనిఁ దాఁకె యకుంఠితోద్ధతిన్. 8

తే. గగనముఖఖండమున వానితను వగల్చి
నాతిఁ దసిఁ గొని క్రోధరక్తాక్షుఁ డగుచు
వ్రేయ నది తప్పఁ గ్రుంగి యవ్వీరుఁ జేరె
వజ్రినఖతుండహతిఁ బక్షివల్లభుండు. 9

వ. పరిహారవ్యయవిధ్ధుం డై మూర్ఛిల్లి కొండొకవడికిం దెలిసి రాక్షసేశ్వరుం దప్పక సిక్షించి యోపక్షి రాక్షసులకు నంగుష్ఠప్రదేశంబు మర్మస్థానం బది ఖండింపక మేలు చేసి తని పల్కిన సమ్మిథ్యావచనంబులు నిక్కంబులుగాఁ దలఁచి యాకకుంతకాంతుండు. 10

క. అక్షణమ వానిపైనువే
లక్ష్మయజవళ్ళిం దునుము నరుదేరఁగ నా
రాక్షసుఁడు ఖడ్గమునఁ ద
త్పక్షంబులఁ దునిమె నేలఁబడి తన్నుఁ గొనన్. 11

చ. తను విడిపింపవచ్చి నిహ
తం బగుగృధ్రముఁ గాంచి సీత స
య్యన నిజభూషణప్రతతి
యంశుకఖండమునందుఁ గట్టి తా
ననుపుగ వైచెఁ బంప యను
నావగఁ జెంతఁ జరించుకీశనా
థునిమొదుటం బడం దనుఁ
దూగ్గుఁడు గొనకయుండఁ గ్రక్కునన్. 12

తే. క్రివ్యభుగాజనీత వైనుగగనపీఠ
నుత్తరీయంబు మునుఁ గిడి యువిద చనఁగ
ద్రవిడదేశాంగనలు సూచి తను హాసింప
నరసి యమ్ముగ్ధ రోషతామ్రాక్షి యగుచు. 13

క. వఱ్ఱెద దొలఁగిన నను మీ
రిఱ్ఱెద హాసింతురెఁ ఖాదియే నేఁడుమొద
ల్పఱ్ఱెదలు లేకయుండుఁడు
దయ్యంబులభంగి ద్రవిడతామరసాక్షుల్. 14

వ. అని దుఃఖాక్రాంతయై శాపం బొసంగె నారావణుండు వడి నిజ
పురంబు ప్రవేశించి సీతారూపాగత మైనమృత్యుదేవత
నశోకవనమధ్యంబున నునిచె నంత రాక్షసస్త్రీల వైధవ్య
సూచకంబులును, లంకాపురశృంగారవనవినాశసూచనంబు
లును నైనయుత్పాతంబు లనేకంబులు దోఁచినఁ గాంచి
నిమిత్తజ్ఞుండును మహాబలుండును నైనకుంభకర్ణుండు
దశగ్రీవున కిట్లనియె. 15

ఆ. అన్న చిత్తగింపు మవనిజఁ దెచ్చిన
నాఁటఁగోలె నీదునగరసీమఁ
బాపమె దుర్నిమిత్తములు పెక్కు లాసీత
సకలలోకములకుజనని సుమ్ము. 16

క. సత్యము తెల్పెద విను మా
ధ్యత్యంబున నవనితనయఁ దగ నంటెదవే
న్నిత్యం బగుతత్పాతి
వ్రత్యానలమేర్చు దనుజవంశస్త్రీలన్. 17

ఉత్సా. ఏల సాహసంబు సేసె దిట్లు దానవేంద్ర నీ
వాలతాంగి నిచటఁ దెచ్చితచట నిల్పి కమ్మ ది
క్పాలవినుతకీర్తి రామభద్రునంఘ్రి నసురులం
ఱీలుపఱుప నవతరించె దేవదేవుఁ డిమ్మహిన్. 18

తే. యాగకర్తస్థు విప్రుని ననపరాధి
వేదవిదుఁ ద్రుంపఁ దాధర్మవిదుఁడు రాముఁ

దహహా ! నీ దగుభుజాబలదార్ఢ్యంబుకతన
నణఁగె నుత్తమవిప్రత్వ మమరవైరి. 19

వ. తత్కారణంబున సీతు వినాశంబు వాటిల్లుట సిద్ధం బని
పల్కినఁ గుంభకర్ణువచనంబు లాదరించి ప్రహస్తుండు
రాక్షసులనెల్ల నిరీక్షించి యిట్లనియె. 20

సీ. హేమమందరవింధ్యహిమశైలేంద్రంబుల
బాహులఁ బెకలించి బంతులాడఁ
గలశౌర్యనిధి కుంభకర్ణుఁ డీతనిగాత్ర
మీక్షింపఁగా నోడి హేమగర్భుఁ
డక్షులెల్లను మూసి యక్షణంబున నిష్ట
మగువరం బిచ్చి పొమ్మనుచుఁ బల్కె
నితనిఁ జూడఁగ నోపరింద్రాదు లెదురించి
చివ్వయొనర్చుట చెప్ప నేల
తే. యిట్టిబలశాలి నీతమ్ము నిట్లు దెల్పు
టంతకునకైన రామునకైన వెఱచి
కాదు సోదరజీవితకాంక్ష గదుర
బంధుశోకాసహిష్ణుతఁ బలికెఁ గాని. 21

వ. కావున నీమహాత్మునిబుద్ధి యంగీకరించి మీరందఱు నేలి
కసన్నిధిం దెలుపవలయు ననినఁ బ్రహస్తపలుకులకు సమ్మ
తించి మయుండు రావణున కిట్లనియె. 22

ఉ. ఆర్య ! పులస్త్యవంశమణి
వధ్యయవేదవిశారదుండవున్
ధైర్యవివేకశాలివి పవి
త్రాపవిశిష్టుండ విద్ధశౌర్యగాం
భీర్యధురంధరుండవు న
పేతకళంకుండ విట్టినీ వయో
దార్యవినింద్యదుర్గుణస
మగ్రుండ వైతివి వార్ధకంబునన్. 23

తే. వృద్ధుండవు గాన నీకు వివేక మొదవె
వయసు దిరిగినఁ బరలోకవాంఛచేఁ ది
తిక నిష్టంబుఁ బూర్తంబుఁ దీర్థయాత్ర
స్నానమును దానము జపంబుఁ జలుపవలెను. 24

సీ. వచ్చునే యిప్పుడు జవ్వనము వెండియు నీకు
నేల యిత్తెఱఁగున నేల వైతి
వారాముసతి నేఁటి కపహరించితి దండ
కారణ్యవీథిఁ దత్కారణమున
హాతుఁ డయ్యె ఖరాదిచుఁ డగుఁగాక యిం కెట్టి
ఫలము సేకుఱు నీకుఁ బలభుగీశ
యాదికాలంబున నడఁగు నధర్మంబు
ధర్మంబు వర్ధిల్లుఁ దరతరంబ

గ్గాతమధర్మగేహిని న
కల్మషఁగా నొనరించెఁ బాదకం
జాతరజోవిశేషమునఁ
జయ్యన నక్రమాలాట్రియుం బలా
రాతిసుసంగలబ్ధ మగు
ప్రస్తరభావము వాసి సద్యశన్. 29

సీ. మిహిరకులనందనుం డంత మిథిల కరిగి
యుంచి బిసకాండమును బోలె ఖండపరశు
చండకోదండదండంబు ఖండములుగఁ
జేసె భూపాలసుందరి చేఁ దగఁడ. 30

ఆ. ఆ స్వయంవరోత్సవాలోకనార్థి వై
యరిగి కాంచి తీవు సమ్మహోత్సుకఁ
దమరమనుజవిస్మయాపాదిసౌందర్య
నిలయుఁ డగునొ కాఁడొ నిజము సెప్పుమ. 31

సీ. జానకీసహితుఁడై సాకేతనగరికి
నరుగుచుఁ గ్రోధరక్తాంతనయనుఁ
[illegible] రాజతాచల
తుల్యతాంగుఁ బ్రళయాగ్నిదుర్నిరీక్షుఁ
గార్తవీర్యభుజావిఖండనసపాండిత్య
స్కంధావలంబితశాతపరశు

ధృతచాపు నేకవింశతివారభూరము
ఘోరాసురమర్దను యమునమాను

తే. యుద్ధసన్నద్ధు భృగురాము నుగ్రధాము
వీరవరుఁ గాంచి రాముఁ డోవిప్రవర్య
బలము లన్నియు నినుఁ గని పఱవఁ దొడఁగె
నెద్ది కారణముగ వచ్చి తెలుపఁగఁ జెపుమ. 82

వ. అనినం బరశురామదేవుండు. 83

తే. విప్రుఁ డని పల్కితివి నన్ను వినుము నీవు
హోంగణమునకు నన్ను భిక్షార్థి నగుచు
నరుగుదెంచినవాఁడనే? యాజిభిక్ష
దక్క నొరుచేతఁ గొందునే దాన మనిన. 84

తే. చండగతి రాఘవుండంత కోదండకాండ
మెక్కిడి శరంబు సంధింప నుక్కడఁగి
భార్గవుఁడు వీతలజ్జుఁడై ప్రాణభీతి
నతని శరణంబుసొచ్చి యిట్లనుచుఁ బల్కె. 85

ఉ. దేవ! యజాండభాండములు
దీలఁగఁ జేయుబాహుదండ వీర్య లో
కావళి నెల్లఁ బ్రోవ మను
జాకృతిఁ బొల్చితి వట్లు గానిచో
భావభవారివి ల్లునుమఁ
ప్రాజ్ఞఁ డొరుండు ధరం గలండె న

తే. సాధనంబు భుజించుచు నాదుశత్రు
పక్షపక్షవర్తి వైతివి పాపకర్మ
యధిపుకార్యంబు విడిచి పరార్థకార్య
ఘటకుఁ డగువానిజన్మంబు గాల్పుటొరవు. 39

వ. అని యతనిఁ జంప ననుకంప లేక త్రుంపం జూచుసమయం
బున నారాయణునియ్యంపుఁదొయ్యలి యైనమందోదరి
యిట్లనియె. 40

తే. ముదుసలితనంబు గదిరిన మునులకైన
నీటిఁబోవు సునీతి వివేకసరణి
యనినచో, నెందులకొ వేఱ యరుగ నేల
యీ పెద్దృష్టాంత మిందుల కిందఁ బ్రైనెరి. 41

క. ధర్మంబు లయాకరంబు న
ధర్మము జయాకరము ననుచుఁ దగఁ బలుకుద్ధీ
దుర్మతి పలికెడుఁగాని య
ధర్మాత్ము వహింపలేదు ధర తొల్లపుడున్. 42

తే. ధర్మ మెచట నుండుఁ దడయక యచ్చట
జయము గల్గు ధర్మసంగ్రహంబు
చెడఁ డధర్మరతుఁడు చెడుఁ దక్రసంగతి
సార మడఁగు క్షీరపూర మట్లు. 43

ఉ. మానిజనాశ్రమంబులు గ్రి
మంబుగఁ బాడుగఁ జేసి దేవతా

మానినులఁ హరించి గరి
    శుం జెఱఁ బెట్టితి దుర్వినీతి వే
మానవనాథులం బిలుకు
    మార్చితి పేర్చినవిక్రమంబునం
దానవనాథ ఏబాగతి న
    ధర్మము చేసితి వెల్లవేళలఁ. 44

మ. భవదానీతపతివ్రతాతిలకమున్
    భవ్చిత్తసంక్షోభనం
భవకోపాగ్ని ధరాత్మజాజపమరు
    త్ప్రాప్తిన్ దురాధర్షమై
భవదీయాన్వయభూరిసాటవిపయిం
    జాటిల్లి యేర్చుఁ మనో
భవుఁ బాటించినధర్మదూరులకు సం
    ప్రాప్తింపవే యాపదల్. 45

శా. మాయాభిక్షుఁడ వై హరించితివి రా
    మప్రేయసిఁ రాముఁ డ
ధ్యాయన్ * లేమిని దీన నేమి కలుగుఁ
    జానొంద నీనెమ్మదిఁ
మాయాకృత్యవిశారదుండ వనుచుఁ
    మత్తిల్లె దాబాముస

* రామిడి దీ; రామిడి పై—ప్రా ప్రి.

న్మాయామార్థికి నీదుమాయలు ధర
న్నా డేయకుల్యారతుల్. 46

సీ. అతనిమాయాంబుధి నబ్జగర్భాదులు
మునుఁగుచు నుందురు మోహవశత
వరవర్ణినీధనావర్తద్వయంబునఁ
బడి మును లైనను గడవలేరు
ప్రకృతితమోగుణబద్ధులై పరగాదు
దానవు లవ్వార్ధి దాఁటఁగలరె
రామానపాయిని యామహీసుత శివు
నర్ధాంగమున నుండు నార్యపోలె
తే. ధర్మదేవత గాన యప్పద్మనయన
వల్లభునితోన చనుదెంచె వవిశీఁ దల్ప
యోజముఖఁ దెచ్చి యూరక యుణ్ని వాఁడె
యతనివంచనఁ దెలియులే దైతి గాక. 47

సీ. బాహుబలాఢ్యు సుబాహుఁ ద్రుంచి మఖంబు
గావంగ జానకీ గావలేదె
పతిశాపహత యైనసతి నహల్యాదేవి
గావంగ జానకీ గావలేదె
ఖరవిరాధాదుల ఖండించి మునితతిఁ
గావంగ జానకీ గావలేదె

శబరికిఁ బతితాంకకబరికి గతు లిచ్చి
కాపంగ జానకిఁ గావలేఁడొ
తే. సారుఁడవు హాటకగర్భుండవు హరియు నతఁడ
బహుళమాయావి జనులకుఁ బ్రభుఁ డతండ
యునిద నతఁడర రక్షించియు యున్నవాఁడు
నీవు దెచ్చుట మిథ్య యోనిర్జరారి. 48
వ. అది యె ట్లంటేని. 49
తే. మృత్యు వీలంకఁ జొరలేక మిడికి రాము
శరణు భజియింప నమ్మహాపురుషవరుఁడు
నిను సబాంధవముగఁ దుంచుమనను పూని
దాని సీతగ నిర్మించె దనుజవర్య. 50
ఉ. రాముఁడు ధార్మికుం డనద
రాధుల సాధుల బాధసేయఁ డా
రాముని కీ వొనర్చి తిప
రాధము నీదగిఁ భూసురత్వముం
గామికవృత్తిఁ బూని పర
కాంతలఁ జెందుటఁ బోదెఁ; నయ్యెఁ బో
యీమహిఁ రాముకార్యమును
మృత్యుకృపకార్యమఁ బ్రాణనాయకా ! 51
క. మృత్యువు నిచటికిఁ దెచ్చితి
సత్యం బది సీత గాదు దని రాముని కా

తోటకవృ. అని లక్ష్మణుఁ బల్కుచు నాయనతోఁ
జను దేర నిజాశ్రమశాలకుఁ జ
య్యన నేఁగి ధరాత్మజ యచ్చట లే
మి నలంచ డట పల్కె సుమిత్రసుతుఁ. 58

తే. పద్మమిత్రాభ కంటె ? యిప్పర్ణశాల
విన్ననై యున్న దయ్యలివేణి లేమి
మంజుభాషిణి సీత యమ్మహిషిఁ బాసి
యెలమి విరహానలంబు సహింపఁదరమె. 59

వ. అని వంచనావచనంబులం దమ్ముని మోహపఱుచుచు
నతండును దాను ను సీతాన్వేషణంబునం జని చని గౌత
మీసరిత్తీరంబున నిలిచి. 60

క. రావణుదుశ్చేష్టలు గో
దావరి యెఱిఁగింపదయ్యెఁ ధా నిపుడు జగ
త్పావని యనుచుం బలుద
ర్పావిలమతి నగ గణింప దయ్యెం గంటే. 61

తే. గౌతమీ నేఁడుమొదలు నిక్కంబు గాఁగ
బావనార్థంబుగా నీదుజీవనముల
స్నాత యగువాఁడు చండాలజాతిఁ బుట్టి
జగతి నస్పృశ్య యాత్మతేజంబుఁ దొఱఁగు. 62

చ. అని శపియింప గౌతమియు

బనిశము విచిత్రకార్య మొక
రైనమహాఘములం దోలంచు న
జ్జనపతిఁ గంటి నెందియును
శాపభయం బిఁక నేల గల్గు నా
ఘునకు నేఁ దనూజ నను
గాఢఁజ కారుణీకత్వ మేర్పడ౯. 63

వ. అని చింతించి. 64

మ. నలినాస్యంబు మృణాళబాహువులు
మీనస్వచ్ఛనేత్రంబు లు
జ్జ్వలవాంసీగమనంబు చక్రకుచముల్
సత్పైకతాసంబు భ్రూం
గలసత్కుంతలముల్ దరంగవళులుఁ
గన్పట్ట నాగంగ త
జ్జలమధ్యంబుననుండి వచ్చె సురయో
షావేష మొప్పారఁగ౯. 65

క. సనకాదిమౌనిమానస,
వనమహాకంజల్కపుంజవాసిత మగురా
మునిచరణద్వరకమున నా
ఘునవేశి నమస్కరించి కౌతూహలతన్. 66

వ. ఇట్లని విన్నవించె. 67

ఉ. విజితద్వంద్వులు కందరాశ్రయులు సం
విద్భిక్ష్యా లాబద్ధకౌ
ద్ధజటాభారులు నైనయోగులు సము
ద్యన్నిష్ఠ నీ గాంచి రే
నిజజన్మాంతరపుణ్య మెట్టిదయొకో
నీమూర్తిఁ గాంచెం దరు
ద్విజవల్లీతృణగుల్మసన్మృగఖగ
వ్రాతం బరణ్యస్థలిన్. 68

ఉ. అనితరలభ్య మైనభవ
దంఘ్రులఁ బూజ యొనర్చుభాగ్య మ
న్యునులకు నబ్బె నీఘనులు
ము న్నొనరించినపుణ్య మెట్టిదో
యనఘచరిత్ర తావకఘ
నాశ్రయశోభిత యాట నివ్వనా
వని శివవిష్ణులోకముల
వైఖరి నొప్పె మహాత్మ్యసంపదన్. 69

క. ఆశాప్రముఖవచ్చరణా
బ్జాశాంకిత మగునిజోటజవ్రిస్థలి నీ
శాలిత్వము గుటియుంచిరి
చేతోమోదమున మౌనిశేఖరు లెల్లన్. 70

ఆ. వనజసంభవాదు లనిశంబు నీదర్శ
నంబుఁ గోరి యవసరంబుఁ గాతు
రట్టినీకుఁ బాకయత్నంబు సేయుత
పస్వికాంత లెంతభాగ్యవతులొ. 71

తే. స్వామి భవదీయదర్శనస్పర్శనములు
గాంచి మునులు కృతార్థతాగరిమఁ గాంచి
రమ్మహాత్ములు మత్తీర మాశ్రయించి
నిలుచుటను భాగ్యవతి నేన నిక్కువంబు. 72

తే. రాముఁ డరుదెంచు నస్మన్మదిరంబున భుజి
యించు నేఁ డని మునినతు లించువేడ్కఁ
గంధఖర్జూరపనసమాకందములును
దుగ్ధదధ్యాజ్యములును దెచ్చిరు ముదమున. 73

ఉ. భూమిభరంబు *డింప గుదు
బుద్ధి సమస్తజగద్ధితార్థుఁడై
రాముఁడు దండకాటవికి
రాఁగలఁ డత్తఱి మత్తటంబునం
బేర్మి వసించు నాజని య
పేతకళంకతఁ బొల్చునంచు నే
నేమముఁ గొల్చుచుండ రఘు
వీర వసించితి వట్లు మత్తటిన్. 74

* దించుటకు—బ్రా. ప్ర.

మ. హరిపాదోద్భవ గంగ యంచు నను న
త్యంతంబు మన్నించి యి
ప్పరమర్షు ల్వసియించి రిత్తటి భవ
ద్భావాబ్జకింజల్కపుం
జరజఃస్తోమపవిత్రితాంగ నగుట
న్సన్మౌనిసంఘంబుల
దురితోన్ముక్తులఁ జేయుదు న్దరదమ
ద్దుర్వార వారాప్లుతి న్. 75

తే. ఇట్టినే శాపహత నైన నిమ్మునీంద్రు
లుహారహాస్నాన మేగతి నాచరింతు
రనఘ సుస్నానహీనంబు లైనక్రియలు
భస్మవిన్యస్తహవ్యంబు పగిది గాదె. 76

వ. వేదశాస్త్రపురాణపారగులును, సర్వధర్మవిదులును, శాం
తులును, సోమయాజులును, ద్వాదశాహదీక్షితులును,
వాజపేయవ్రతపతులును, పౌండరీకయాజులును, వసంత
యాజులును, చాతుర్మాస్యయాజులును, నిత్యయాగపరు
లును, తపస్స్వాధ్యాయపరులును, జీర్ణపర్ణజలాహారు
లును నైనమునీంద్రులు నాయందు విరక్తులై యీయం
ధకారకోటికి కరిగిన దండకారణ్యవాసు లగురక్కసుల
నుక్కడంచి మునీంద్రులఁ బ్రోచుటకుం జేసినభవదీయ
ప్రతిజ్ఞావైఫల్యంబు సంభవించుఁ దత్ప్రతిజ్ఞాభంగభీత

నై సీకరణంబుఁ జొచ్చితి మఱియును. 77

ఆ. పురుషునింట సర్వభోగాఢ్య యయ్యును
గన్య పుట్టినిల్లు గాంచఁ జేయు
నందు నల్పమైన నత్యధికంబుగఁ
గాంచుఁ దండ్రి మీఁది కరుణ కలిమి. 78

గీ. కన్య నలరించితేనియుఁ గలిమి వొదలు
తృప్తిఁ గావించితేనియుఁ గులము వెలియు
జగతి బాలురఁ గన్యల స్థవిరుల నవ
మాన మొనరించితేని సంపద దొలంగు. 79

చ. అవనియు నాకసం బనలుఁ
డంబులు గంధవహుండు సర్వసిం
ధువననదీవిహంగపశు
దుష్టమృగావళియు న్నిజస్వభా
వవిధి వసించుఁ గాని నర
వారముతోడుతఁ బల్కనేర్చునే
యువనిత నేను భాగ్యవతి
నౌట నిజం బని పల్కనేర్చితిన్. 80

క. కావున నీపుత్త్రి సతిం
గావుము కరుణార్ద్రబుద్ధిఁ గాంచుము నీ భా
వావృత నగుటం జుమ్మీ
పాపాప్తిం గలఁగుఁ లోక మనఘ మునీశా! 81

క. అని పల్కి యవసరంబున
వనరుహసంభవుఁడు త్రిదశవర్గము గొలువం
జనుదెంచి రామదేవుని
వినుతించుచుఁ బల్కె నిట్లు విస్ఫుటఫణితిన్. 82

గీ. అనఘ భవదంఘ్రిచిహ్నిత మగుటఁజేసి
పావనం బయ్యె నీదండకావనంబు
తరువు లామరతరువులవారువు దోఁప
సమితసుమఫలసమితంబు లయ్యెఁ గంటె. 83

క. పూతాత్ము లైరి మౌని
వ్రాతంబులు నీదుపాదవనజంబులు సం
ప్రీతిం గాంచి భజించుచు
నాతిథ్యముసేయఁ గాంచి రతులితభక్తిన్. 84

క. నీవు వసియించుభాగ్యం
బీవనికిం గలిగెఁగాక యిట్లీల యగుణ
శ్రీవరునగరికి నైన మ
దావాసంబునకు నైన హరుపురి కైనన్. 85

సీ. నీపదనీరజాతమున
నీవె సృజించితి పావనార్థ మి
ద్ద్యావగ నీమశాపహత
మైనఁ దదీయఘనపవిత్రతను

స్థాపిత దేవతాయతన
సంచయము సంతతము శాపదగ్ధమై
యేపటి లోకపావనత
యొగతిఁ గల్గు సరిల్లలామకున్. 86

వ. కావున గంగాశాపంబు మరలింపవలయునని ప్రార్థించినఁ
జతురాననుపల్కు లాకర్ణించి రఘువల్లభుండు. 87

తే. శబరి మధ్యస్తరాలు సుస్నాన మాచ
రించు నొక్కహ్రదంబున నిండువేడ్కఁ
దజ్జలంబులతోడ నిత్యంబుఁ గలసి
గౌతమీగంగ శాపమోక్షంబుఁ గాంచు. 88

తే. ప్రాప్తి శబరీహ్రదంబుసంపర్కలబ్ధ
నఖిలలోకైకపావని యగుచు గంగ
పానఁ దీరినరత్నంబు చంద మొందు
నింద కర్హమె మవ్వృక్షబ్బంద మొందు. 89

తే. పతితులకు శూద్రులకు బ్రహ్మబంధులకును
లేదు కర్మాధికారిత లేశమైన
యవిరతము దుష్టకర్మము లాచరించు
వాఁడుబుఁడు బ్రహ్మబంధుఁడు పద్మగర్భ. 90

చ. కొలకులనీరఁ గ్రుంక లిడి
కంజరము ల్మరలఁ మాటారజం

బలఁదినమాడ్కిఁ శుద్ధతరుఁ
డయ్యెను మానవుఁ డస్వభావంబు న
గ్గలముగఁ జేయుదుష్క్రియకుఁ
గల్గదు నిష్కృతి యెన్నిభంగులం
దొలఁగుఁజుమీ కృతంబయిన
దోషము దా ననుతాపలబ్ధిచేన్. 91

వ. అని పల్కి నిజకోదండాగ్రంబుచే శబరీహ్రదజలంబున
నగ్గాలము నాకర్షించి శాపవిముక్తుం గావించి పరమేష్ఠి
ప్రముఖులం బనిచి రాఘవుండు. 92

చ. స్వరుధరలూనపక్ష మగు
శైలముచాడ్పునఁ బడ్డపోరుఁడై
ధరపయి రామనామజప
తత్పరతం బడియున్న పక్షిశే
ఖరు నరుణాత్మజుం బికృత
కాయు జటాయువుం గాంచి వానిచే
ధరణిజవృత్తముం దనుజు
ధార్ష్ట్యముఁ దెల్లముగా నెఱుంగుచున్. 93

తే. అధిపసఖువిప్రదేవకార్యార్థి యగుచు
దురమునకు నేఁగి యమపుత్రులు దొలఁగువాఁడు
పదముపదమున రధ్వరఫలముఁ గాంచు
వంశజుల నందఱను ద్రిదివంబుఁ జేర్చు. 94

క. అని యతని సత్యసంధుం
డని తలఁచుచు నీయభీష్ట మడుగు మనుడు వాఁ
డను దేవ నిన్నుఁ గాంచితి
ఘనతర మగుభాగ్య మింతకంటెం గలదే. 95

క. అని పలికి యమ్మహాత్మునిఁ
గనుఁగొనుచుం దనువుఁ దొఱఁగె ఖగపతి యంతన్
జనకునిగతిఁ గాంచుచు నా
యనఘున్ సురలోకమునకు ననిచెన్ వానిన్. 96

వ. అంత. 97

తే. యోజనద్వయదీర్ఘబాహుని నురస్థ
వదనగహ్వరు దానవవరుఁ గబంధుఁ
జదిపి నిజభక్తురాలగు శబరిచేత
నర్చఁ గైకొని యాపెఁ బూతాత్మఁ జేసి. 98

శా. కాంచెన్ రాఘవుఁ డిక్షుకాండరసనీ
కాశాంబుసంక్రాంతముం
జంచన్మందమరుత్ప్రహృష్టపథిక
స్వాంతంబుఁ బద్మోత్పలో
దంచత్సారమరందమత్తమధుప
ధ్వాంతధ్వనోదంతముం
బ్రాంచత్క్రౌంచబకాదినాదవిలస
త్పంపాసరఃప్రాంతమున్. 99

తే. అపుడు గౌతమిసుత యైనయంజనాత
నూజుఁ డనుపమతేజుఁ డనూననీతి
మంతుఁ డచలితధృతి హనుమంతుఁ డంత
నమ్మహీకాంతుఁ గాంచి యిట్లని తలంచె. 100

మ. భసితోద్ధూళితకాయుఁ డంబుధరశుం
భన్మేచకాంగుండు పా
ణిసరోజాంచితచాపగోపవరుఁ డు
న్నిద్రాంబుజాతాక్షుఁ డు
ల్లసదాజానుభుజార్గళుండు సుమన
శ్శ్లాఘ్యక్షమావంతుఁ డి
యసమస్థైర్యగుణాఢ్యుఁ డెవ్వఁడొ సము
ద్యద్భానుతేజుం డిలన్. 101

శా. సాక్షాన్మన్మథురీతిఁ బొల్చె నితఁ డ
క్షయ్యాకృతిన్ వారిజా
క్షుండో శశభృత్కళామకుటుఁడో
యంభోజసంభూతుఁడో
యీక్షోణిన్ నరమాత్రుఁడే యితఁడు లో
కేశుండు గాకారయన్
మాకుం బియ్యఁడె యిమ్మహాపురుషు న
మ్మోదంబునన్ జూచినన్. 102

క. ధైర్యంబున హిమగిరి గాం
భీర్యంబున నుదధి క్షమను బృథివి దలంపఁగ౯
స్థైర్యంబున సురగిరి సౌం
దర్యంబున నితఁడు కుసుమధన్వుఁడు జగతి౯. 103

సీ. ఇతనిమాయాంబుధిఁ జతురాననాదులు
తీరంబు చేరక తిరుగుచుండు
రితఁడు జగంబులకెల్ల జనిస్థితి
సంహారకర్త నిస్సంశయంబు
నిర్వికారుండును నిత్యుండు సత్యుండు
సర్వజ్ఞుఁడును నిరంజనుఁడు నితఁడు
సనకప్రముఖు లైనమునులకు నీతని
పదదర్శనము దుర్లభంబు దలఁప

ఆ. సీతఁ డలిగెనేని హిమాద్రి తృణ మగు
నితనికరుణ గలుగుతృణము మేరు
వితఁడు పూజనీయుఁ డీతని సేవించి
కమలజాండమునకుఁ గర్త నగుదు. 104

క. ఇతఁ డస్మదిష్టదేవత
గతి నొప్పెడు విష్ణుభాగ్యుఁ గమఁగొంటి౯ స
స్మతి మత్పవగల్భ్యముదూ
[illegible]చరిత మగు యతికి [illegible] నితనిసేవ దాయుచర్చన్. 105

తే. అవి తలంచుచు ఫలపాణి యగుచు నాతఁ
డాత్మనామానుకీర్తనం బాచరించి
వెంపెక్క నారఘునందనువెంగ్రోల నిలిచె
నంజలి ఘటించి వినయానతాంగుఁ డగుచు. 106

మహాస్రగ్ధర.
కనకాద్రీంద్రాభు నుద్యత్కనకమణివరి
ష్కారయు నాషాఢదండా
జినమౌంజీమేఖలారంజితు జితమదనుఁ
జిత్రభానుప్రకాశున్
ఘనశౌర్యుం దీర్ఘబాహార్గళు ననిలజవుం
గామరూపాభిరాముం
హనుమంతుం గిరికాంతుఁ హరిపరివృఢు న
ర్కాన్వవాయుండు గాంచెన్. 107

ఆ. అట్లు గాంచి యద్భుతాక్రాంతచిత్తుఁడై
యేమి గోరి వచ్చి తెఱుఁగఁ జెపుమ
ప్రాణసదృశుఁడైన బంధునిగతిఁ గను
పట్టె దీవు మాకుఁ బ్లవగవర్య. 108

వ. భవత్సహాయంబు గల్గిన మహావాయుసహాయుండైన
ప్రళయాగ్నిభంగిం బొంగి రక్కసుల నుక్కడంచు మా
ర్గదర్శి యగుపురుషుం డొక్కరుండు లేమికిఁ జింతించెద
మద్భాగ్యానలంబునకు మేరుమందరాంబరపృథివీసింధువు

తైసను నిలువంజాలవు నుద్భక్తుల ధేనువు వత్సంబులం
బోలె రక్షింపుదు నని పలికి నిజవృత్తాంతం బంతయు
వివరించిన విని సంతసిల్లి రఘునందనునకు వాయునంద
నుం డిట్లనియె. 109

సీ. వాలిసుగ్రీవు లన్వానరుల్ కేశాధి
పులు సన్నదమ్ములు గలరు బలుబలు
దారానిమిత్తమై వారల కుదయించె
వైరానుబంధం బవార్య మగుచు
నిల మహాత్ములకైన నింతులకతన నై
రము గల్గు నన మర్కటముల కరుదె
శక్రనందనుఁడు నిర్వక్రవిక్రమశోభి
వాలి మహైశ్వర్యశాలి యగుచు

తే. ననుజపత్ని రుమాకాంత నపహరించి
తారఁ గైకొని యచలితవైరకలనఁ
బ్రాణములఁ గొన నల్గినఁ బఱచె నతఁ డ
ధర్మవర్తులకడ నుండఁ దగదు గాన. 110

తే. అంబుధినిమగ్నునకు నుడుపంబుకరణి
ధ్వాంతబాధితునకు దివాకరునిపోల్కి
రహి దరిద్రునకును ధనరాశిపోల్కి
నీవు గల్గితి రవిపుత్త్రునకు యతికతన. 111

చ. జనకునియాజ్ఞ నివ్వనికి
సన్మతి రాఘవుఁ డేఁగుదెంచె న
య్యనఘుఁ డమేయశౌర్యనిధి
యార్తశరణ్యుఁడు దుష్టశిక్షణం
బనువుగఁ జేయు సజ్జనుల
నందఱ మన్ను దయార్ద్రచిత్తుఁ డా
ఘను శరణంబు సొత్తు ననుఁ
గాచు నతం డని యెంచు నాతఁడున్. 112

వ. త్రిభువననాథుండును, ప్రతిజ్ఞాతార్థపాలకుండును నఖం
డకోదండపాండిత్యశౌర్యుండును నగునమ్మహాత్మునితోడ
సఖ్యంబు సంఘటింపు మని యాసుగ్రీవుండు పనిచిన
నేఁగుదెంచితి నిట మీఁద దేవరచిత్తం బని పల్కిన విని
రాఘవుండు సుగ్రీవుం దోడ్కొని రమ్మని యభయం
బొసంగితి నని యానతిచ్చిన నమ్మారుతియు నట్లు సుగ్రీ
వుం దోడితెచ్చుచు నుండె నాసమయంబున. 113

క. పరిఫుల్లహల్లకాంబుజ
మరందలహరీప్రమత్తమధుకరఝుండ్రి
స్స్వరపూరం బగుసంపా
సరోవరముఁ గాంచి రామజనపతి పల్కెన్. 114

తే. పాపసంతాపఘర్మనిర్వాపణాచ్ఛ
సలిలసంపరిపూర్ణమై సన్మునీంద్ర

చిత్తకమలంబు గనమీఁ దెలువు మెఱసెఁ
జూచితే దీని లక్ష్మణ చూడ్కి కలర. 115

క. రంగత్తరంగసముదయ
సంగతచక్రాంగరేఖ చాలఁగ నొప్పన్
శృంగారార్థము గా నలి
లాంగన ధరియించు తారహారాళి యనన్. 116

వ. అని వెండియు. 117

మ. అనఘా లక్ష్మణ కంటె యొక్కబక మీ
యవ్వోదతీరంబునన్
మునిలీలం దప మాచరింపఁ దొడఁగెం
బో ధార్మికత్వంబునన్
విను మీ క్షేత్రమహత్త్వవిశ్రుతిఁ జుమీ
విజ్ఞానసంపత్తి సాం
పునఁ దిర్యక్కతియుం దపంబు సలుపుం
బూజ్యప్రభావంబునన్. 118

వ. అనిన లక్ష్మణుం డిట్లనియె. 119

తే. దీనిశీలంబు దెలియక దేవ యిట్లు
వాగడ నేఁటికి సురమునిభూసురులను
యతుల నైన సంతశ్శుద్ధి యరయు కార్య
సంస్తుతించిన దోషంబు సంఘటించు. 120

తే. ఇచటఁ గొండొకదడ వున్న నెఱుఁగవచ్చు
ననఘ దీనిశిలం బనునంతలోన
నటఁయు నప్పుడ కదసి మత్స్యపుల మ్రింగి
వండియును ధ్యాన మొనరించుచుండఁ గాంచి. 121

క. సౌమిత్రిఁ బొగడె రాఘవుఁ
డామెయి హనుమత్సమేతుఁడై రవిజుఁడు ను
ద్దామగతి వచ్చి రాముని
శ్రీమత్పదములకుఁ బ్రణతిచేసి నుతించెన్. 122

వ. ఇట్లుగఁ గుశలప్రశ్నంబు చేసి యమ్మహాత్ముం డిట్లనియె.

క. సుగ్రీవ నీదుశత్రు ను
దగ్రబలుఁ డా వాలిఁ దునిమి తారక రుమ న
వ్యగ్రమతి నొసఁగి కపిరా
జాగ్రణిఁ గావింతు నిన్ను నళు కేల యిఁకన్. 124

వ. సహాయ్యంబున నేను దశగ్రీవుని సంహరించెద నని యగ్నిసాక్షికంబుగా సఖ్యంబు చేసి యతనితోడన ఋశ్యమూకగిరీంద్రంబునకుం జని యందు వసియించి. 125

చ. హరివర నీవు వోయి కల
హం బొనరింపుము వాలితోడ నేఁ
దరువుమఱుంగున న్నిలిచి
తత్సమయంబున వానిఁ ద్రుంచెదం

దురమున వానితో నెదురఁ
 దోడని శక్తిఁ దొలంగఁజూచె నొ
వ్వరికయునన్ మునీంద్రకృప
 వానికి పట్టివరంబు గల్గుటన్. 126

వ. అని పల్కి యనంత. 127

చ. అలరులకమ్మదండ యురు
 జాతనికంధరఁ బ్రత్యభిజ్ఞకై
నిలిచి దురంబు సేయు మన
 నెమ్మది నాతఁడు నట్ల వాలితో
బలుకక పోరఁగాఁ దొడఁగె
 నాసమయంబున నమ్మహాగ్రుఁడు
జ్జ్వలవిశిఖాహతిం దునిమె
 శక్రతనూజుఁ బరాక్రమంబునన్. 128

తే. వాలి విక్రమశాలిని లీలఁ జదిపి
తారఁ దారాధిపాస్య నవ్వారిజాప్త
సూనునకును రుమాకాంతతో నొసంగి
మహితవానరరాజ్యసామ్రాజ్య మొసఁగె. 129

క. రాముఁడు గిరిగుహ నుండఁగఁ
దామరచెలిపట్టి ప్రేమఁ దారావరుఁడై
యామమున రామునికార్యం
బేమఱి కామాంధుఁ డగుచు నింట వసించెన్. 130

క. ప్రియదలసన్నిధి నుండిన
సమయజ్ఞానంబు దొలఁగు సకలజనులకున్
క్షమ సరిఁదు కొమ్మనెక మాఁట
యమతిఁ బ్రియ త్తర వహించుటది యద్భుతమే. 181

ఉ. ఆసమయంబునన్ రఘుకు
లాగ్రణిపంపున లక్ష్మణుండు బా
ణాసనశాత బాణధరుఁ
డై విలయాంతకులీల నేఁగి య
వ్వానరరాజనందనుని
వాకిట నిల్చి *యమర్షరాద్రిదృ
గ్భాసురుఁడై కఠోరగతిఁ
బల్కె బలీముఖు లెల్ల భీతిలన్. 182

ఉ. వాలికి భీతిఁ జెంద రఘు
వర్యుఁడు నిన్నృపుఁ గాచె మున్ను నా
వాలికరూపుచే నివు డ
వారణ నిన్ బరిమార్పఁ గావఁగాఁ
జాలునె యంతకుం డయినఁ
జక్క నజాండవిభేదమైన యా
భీలమదీయసాయకము
భీతులఁ గ్రోతుల నొంపఁజాలదే. 183

* యమర్ష రాద్రి— వ్రా. ప్ర.

వ. వెంటియు నతండు పాకృతకవిరూశతధుం డై నిల్చి రామలక్ష్మణులకు నమస్కరించి అనంగసప్లసంగప్రముఖ సేనాపరివృతుం డై మాసమాత్రంబున మరలి వచ్చెద నని చని వనగిరిగుహాప్రదేశంబుల సీత నన్వేషించుచు నలిదూరం బరిగి యొక్కబిలంబు సొచ్చి యందుఁ గనక రత్నమందిరగోపురపరిపూర్ణం బైనపురంబుం గాంచి తన్మధ్యంబున మాయాబలసమన్విత యగునొక్కయో గినిం గాంచె నంత నక్కపు లిప్పురం బెవ్వరి దని యడి గిన నది యిట్లనియె. 187

క. ఈపుర మింద్రునియది నన్ గాపుంచె నతండు దీనిఁ గడచినవారిన్ శాపాహతులుగఁ జేయుదు నేపనికిని వచ్చినార లెవ్వరు మీరల్. 188

క. అనవుడు సీతాన్వేషణ మొనరింపఁగ వచ్చినార మాభూమిని రా మునిబంటుల మన నయ్యో గినియున్ రామునిఁ దలంచి కేల్మోడ్చెఁ దగన్. 189

చ. ఫలకుసుమాభినమ్రితరు పంక్తులఁ బొల్చువనంబు మధ్యలో కిలకులచంచరీకశుక కేకిరవాఢ్యల మైనవాని ను

త్కలవలదీప్తి కాశతప
పంజనతం బొలుపారుదాని న
ఙ్జలజదళాక్షి యాజ్ఞ నొక
సద్వనవాటికిం జొచ్చి రాశపుల్. 140

ఉ. తేసియు గ్రొలి పోలి యటఁ
దియ్యనిపండుల మెక్కి తేటని
రాని సుఖోన్నతిం జెలఁగి
యూఁకలియుం దృషయుం దృజించి యు
న్మానిని వెల్వరింపఁగఁ గ్రి
మంబున నగ్గుహ నిర్గమించి యం
భోనిధితీరధారుణికిఁ
బోయి వసించి కపీంద్రు లందఱుఁ. 141

క. తమలోఁ బలుకుచునుండెడు
సమయంబున నచటఁ దిరుగుసంపాతి యనం
గొమరారినపక్షి సీతా
విమతేక్షణ లంక నున్నవిధ మెఱిఁగించెన్. 143

క. ఎఱిఁగించిన విని వా రం
దఱు నీసాగరము దాఁట దజ్ఞుం డెవ్వాం
డెఱిఁగింపుఁ డనిన నంగదుఁ
డఱసియుఁ దెలుపఁడొఁకఁగా నాత్మజనంబుఁగా. 148

ఆ. నవతియోజనములు జవగతి లంఘింతు
వటులుబలిమిగలిమి వారిరాశి
యంత విశ్రమించి యవతల నన్నియు
యోజనములు గడతు నోజ మెఱసి. 144

వ. అని పలికిన జాంబవంతుం డి ట్లనియెను. 145

తే. అమరగిరికిఁ బ్రదక్షిణం బాచరించు
నాఁడు తద్గిరిశిఖరంబు నాఁటుకొనెదు
తాడితం బయి నాజానుతలమునందు
ఖండతావాప్తి యయ్యెఁ దత్కారణమున. 146

వ. అయినను శతయోజనంబులు లంఘింప నోపుదు మరలి
వచ్చుట సందియం బని పలికిన హనుమంతుం డి ట్లనియె.

తే. సప్తజలధులు దాఁటి యక్షణము వచ్చు
నట్టిబంటూలునకు లంక యనఁగ నెంత
యవనిసుతఁ జూచి వేవేగ యరుగుదెంతు
మఱిఁ ద్రికూటాచలం బైనఁ బెఱికి తెత్తు. 148

వ. అని లంకాభిముఖుం డై
యనిలజుఁ డనిలగతి నరిగి యంబుధిమధ్యం
బున ఛాయాగ్రాహముఁ ద్రుంచి
జననిఁ సురసాఖ్య గెలిచి చనియెం జెలుచ్చ. 149

వ. మైనాకగిరిం దరింబును మన్నించి కడచి చని లంకాప్రాం

తంబుం జేరి తద్ద్వారపాలిక యగులంకిణి వారించిన దాని
కి ట్లనియె. 15

తే. అల్పబలు వానరుని నేల యడ్డపెట్టె
దేను గనుఁగొన్న యంతన యువ్విరంబు
గాలిపోవునొ వనమెల్ల గాసియగునొ
మడయుదురొ దైత్య లక్షకుమారముఖులు. 151

చ. అని పలుకంగ రక్కసియు
నయ్యనిలాత్మజుఁ డక్కఁ జూచి యు
య్యనఘుఁ డలంతి యయ్యును భ
యంకరణోక్తులు వల్కెడిఁ గాసురల్
వనిచిరొ వీని రాఘవుఁడు
వంచెనొ కావల నందికేశుఁ డీ
నున శపియింప నిన్నగరి
సొంపు *దహింపఁగఁ జేరుకేశుఁడో. 152

క. పలుకులచేఁ దెలియఁగ నగు
కులమును దేజంబు బలము గుణమును ధీసం
తులు వీనిపలుకు నూడఁగఁ
జాలువడు నీలంక వీనిభుజశక్తి దెయిన్. 153

తే. వీఁడు సామాన్యకీశుండు గాఁ డటంచు
కాలమున దైవ నాతఁ డాకాలమునన

---

* దరింపఁగ ; తరింపఁగ—వ్రా. ప్ర.

టుగనగన్క సిఁ బగిమార్చి లంక సాధ్చి
యుండు సీతామహాదేవి నరయఁదొణఁగె. 154

సీ. పేశనునాదిలంబు లగు
విప్రగృహంబుల గోపురంబులన్
వీదుల రచ్చకొట్టముల
వీథుల రాజగృహంబులందుఁ బ్రా
సాదతలంబులం దివిజ
సద్మములన్ వనసీమలందుఁ గ్రి
వ్యాదని కేతనంబులను
నారయుచుం జని యాతఁ డొక్కచోన్.

చ. దివిజవిరోధి జానకిని
దెచ్చుట యాదిగ దుర్నిమిత్తముల్
గనిసిను నేఁట రేపటని
లంక వినాశము నొందు శకునిసం
భవు సని గెల్చి రాఘవుఁడు
భానుతనూభవు నేలి భూమిసం
భవ వెదకం గపీశ్వరులఁ
బంపినవాఁడు సహస్రసంఖ్యలన్. 156

డి. వారలలోనఁ బేరుకల
వాఁ డనురాచలసన్నిభాంగుఁ డా

మారుతనందనుండు హను
మంతుఁడు వారిధి దాఁటి యప్పుర
ద్వారముఁ గాచుదానవి న
వారితశక్తి వధించి సీతఁ దా
నారయు నంచుఁ గౌరజను
ల్గాథుకొనన్ విని సంతసిల్లుచున్. 157

తే. అనిలజుఁడు దానవేంద్రునియంతిపురము
ప్రాంతఁ జెలువొందు సౌఖ్యవనాంతరమున
క్షితితనూభవఁ గని నమస్కృతి యొనర్చి
ముద్రిక నొసంగి విశ్వాసము దనర. 158

వ. నిజవృత్తం బెల్ల నెఱింగించి నమ్మికంబల్కి మదాగమనంబు
రాక్షసులకు నెఱుక గావించెద నని యున్నాఁడు. 159

ఉ. పావని యావనిం జెఱిచి
పాఱఁగఁ దైచి తదీయపాలురం
జేవడిఁ ద్రుంచి గర్జనము
సేయునెడన్ హతశేషదానవుల్
రావణుసమ్ముఖంబునఁ బి
రంబుగఁ దెల్పిన నాతఁ డుల్కి య
త్యావిలచిత్తుఁడై పనిచె
నక్షకుమారు మరుత్కుమారుపై. 160

తే. లంకలోఁ గల్గునట్టి బలంబునందు
నాలుగవపాలు గొల్వ నప్పాలసుండు
చక్కటికిఁ జేరఁ దోరణస్తంభమాతుల
గిటకముఁబలె నద్దైత్యు గిటడంచె. 161

తే. ఇట్లు సబలంబుగా వాని యేపడంపఁ
కీశవల్లభుపైఁ జాలఁ గినుక వొడమి
తనతనూభవు నింద్రజిద్దనుజుఁ బనిచె
నతనిఁ బట్టంగ రావణుం డుగ్రణంబ. 162

సీ. మేఘనాదుండు సమీరనందనుఁ గాంచి
యుత్కటుఁడై సాహసాస్యకవీక్ష్వరుండై
తరితయాగ్ని కైవడి భాసిల్లుచున్న వాఁ
డని యనేకాస్త్రంబు లడరఁజేయ
నవియు భాస్కరునిపైఁ గవియుచీకటిశర
ణంబులగతి విఫలంబు లైన
నలిగి పద్మజబాణ మడరింప నిశతంతు
బద్ధమ్ము గెంద్రించుచునది దానఁ

తే. గట్టువడి వీతభీతుఁ డై కపివరుండు
దానవులు దేర రావణస్థాని కరిగ
[illegible] రుద్రాంశసంభవు నతనిఁ గాంచి
[illegible] తంభరేఁ దాగుచు. 163

తే. ఈనిశావేళ లంకను నేఁగుదెంచి
తేమిగారణమున నిన్ను నెవ్వఁ డనిపెఁ
దస్కరుండవు వానర దండనంబు
సేయఁదగుఁగాక నినుఁ గృపసేయ నగునె. 164

వ. అనిన. 165

మ. నిను వాలంబునఁ గట్టి నీరధుల ని
క్షిద్రిస్థితిం ద్రిప్పి యుం
చినశక్రాత్మజు నొక్కబాణమున ను
స్థేమోన్నతిం బిట్టు గూ
ల్చిన యారాముని బంట వాయుజుఁడ నే
సీత న్విలోకించితిన్
హనుమంతుం డనువాఁడ నీసుతుని గ
ర్వాంధున్ వెసం ద్రుంచితిన్. 166

ఉ. హైహయవంశసంజనితుఁ
డర్జునుఁ డాజి జయించె నిన్నుఁ ద
ద్బాహుసహస్రముం దునిమె
భార్గవరాముఁడు తద్భుజాబలో
త్సాహముఁ గుంచె రాఘవుఁడు
దాదృశవిక్రమశాలితో మదన్
సాహసవృత్తి విక్రమము
సర్వద నెవ్వఁడు గాచు నిన్నిఁకన్. 167

ఉ. జీవిత మిష్టమేనియును
శ్రీరఘురాముని వే భజింపు మే
నీవిధి బుద్ధి దెల్పుటకు
హీనబలుం డగుమేఘనాదుచేఁ
జేవఁ దొలంగి పట్టువడి
చేరితి నాదగుపాణిఘట్టనన్
దేవగిరిం బగుల్తు నిఁక
దేవవిరోధులు నాకు నడ్డమే. 168

తే. లఙ్క నిశ్శఙ్క నీయచలంబుతోన
పెఱికి రామునిసన్నిధిఁ బెట్టువాఁడ
నోరి రావణ కళ్యాణకోరవాతుల
నీవు పరిశుద్ధిఁ జెందెద విది నిజంబు. 169

చ. అనవుడు దానవాగ్రణి య
హంకరణంబున వీనిఁ బట్టి వే
తునుముఁడు దనన్ విభీషణుఁడు
దూతలు వధ్యులు గా రటంచు నే
ర్పున [illegible] నార్లవగ
[illegible] కిలకిలల్
[illegible]
[illegible]వఙ్గన్. 170

తే. దానవులు చేలములు చుట్ట వానరేంద్రు
వాల మభివృద్ధిఁ బొందె యంబారిగతిఁ
నలరె ముప్పదియోజనంబులపొడవునను
వరుసఁ బదియోజనంబులవలముఁ గల్గి. 171

క. ఆలంకాపురిఁ గల్గిన
చేలము లన్నియును నేతిచేఁ దడుపుచుఁ ద
ద్వాలమునఁ జుట్టి వహ్ని
జ్వాలానందయోజనంబు సల్పిరి దనుజుల్. 172

ఉ. అంశుకము ల్హరించి వ్రిభ
యాపద పౌరులకుం ఘటించుచుం
బ్రాంశుశరీరుఁ డై తనదు
బంధము లన్నియుఁ ద్రెవ్వఁ జేసి యా
ద్వింశతిబాహుప్రోలు గని
వీరుఁడు కాల్పఁదొడంగెఁ బూర్ణ
శాంశునిలీల వాలమున
కాశిఖ చల్లఁదనంబుఁ గూర్పఁగన్. 178

చ. సలలితరామపాదజల
జాతము లాత్మఁ దలంచుచుండె స
ద్బలియుని కగ్ని చల్లనయి
భాసిలె శీతలచందనక్రియం

చెలువుగ రామనామసుధ
చేకొని త్రావుదువానికిన్ హాలా
హలవిలయాగ్నిమృత్యువడ
నావృతుఁడైనను భీతి గల్గునే. 174

సీ. హనుమంతుఁ డీగతి నాలంక యంతయు
హవ్యవాహార్పణం బాచరింపఁ
బౌరజనంబు లాబాలవృద్ధాతుర
సహితులై పురబహిఃస్థలి వసించి
కట్టినపుట్ట మొక్కటి దక్క నిఖిలమ్ము
ఖలమయ్యె ననుచు దుఃఖించువారు
క్రొవ్వి పోకార్చి నిక్కముగతి యుబ్బి తని
నెట్టన శాపముఁ దిట్టువారు

తే. నగ్నికిని రామదేవున కనిలజునకు
మొనసి చేదోయి మొగిడించి మ్రొక్కువారు
నైరి యారాత్రి శివరాత్రియంతమున న
ఖర్వజాగరణక్రియ గదురఁ జేయ. 175

తే. హరుఁడు పురములుమూఁటి నప్పగిది దహించి
కడలి వాలాగ్నిఁ జల్లార్చి కపివతంసు
మహిసుతాదత్త మగుశిరోమణి గ్రహించి
యుదధి లంఘించి హరివీరు లెదురుకొనఁగ. 176

క. వనచరులకు సుగ్రీవుని
వనిఁ జూఱకొనంగి భర్తవత్సలుఁ డగురా
మునిసన్నిధికిం జని కం
టిని సీత నటంచుఁ బల్కె డెందం బలరన్. 177

తే. అట్లు చేసినయుపకృతి కాత్మ మెచ్చి
కపివరుని రామచంద్రుండు కౌఁగిలించి
యాజలధిమధ్యమున శతయోజనంబు
లనఘ యేగతి దాఁటితి వనుచు నతఁడు. 178

తే. రామ నీనామ మొకపరి రహిఁ జపించి
జాల్కు లైనను భవవార్ధి సంతరింప
భద్రభవదంగుళీయకముద్రికలిమి
యంబునిధి క్రోఁతి గడచుట యద్భుతంబె. 179

క. అని నిజవృత్తాంతంబును
వనధిగభీరతయు లంకవైభవముం జ
య్యన విన్నవించుటయు న
య్యనఘుఁడు లంకపయిఁ జనఁగ నత్యుత్సుకుఁడై. 180

తే. అంగదుని నెక్కి లక్ష్మణుం డరుగుదేర
తాను మారుతిపై నెక్కి తరతరంబ
సకలవానరయూథపసమితి గొలువ
నరిగి మలయాద్రియును సహ్యగిరియుఁ గడచి. 181

మహాస్రగ్ధర.

కనియెం భూపాలుఁ డంతన్
ఘనతరముదితాఖండకూలంకషాలిం
గనమూద్యధ్వంగబాహా
గ్గళదళితలసత్కంకణోన్నిద్రముద్రన్
స్వనితాంతస్వానలీలా
శమితపృథుదిశాసామజాత్యుద్రినిద్రన్
జనతాశతాతిదత్సా
సమదినమణిరుక్సాంద్రభద్రున్ సముద్రున్.

తే. ఆసముద్రవేలాతటం బధివసించె
వానరబలంబు రెండవవార్ధిపోలె
రాజధర్మక్రమంబుఁ బురస్కరించి
యుదధిఁ బ్రార్థించె నపుడు రఘూద్వహుండు. 183

మ. రంగదభంగభంగరవ
రాజితమై చెలరేఁగి నింగికిం
బ్రాంగుచునుండెఁ గాని రఘు
పుంగవునిన్ గణియింప దయ్యె న
ద్వాంగలివార్ధి యట్లు పృథి
విన్ సుజనున్ హసియించుచున్ నిజా
మంగళవైభవంబె పలు
మాఱును జూపు జడాత్ముఁ డుద్ధతిన్. 184

తే. అంత రఘుపతి క్రోధరక్తాంతనయనుఁ
డగుచు వారిధియాలేప మడఁపఁ దలఁచి
శరము సంధించునాలోన శరధి తద్భ
రాగ్రమున మూర్తియనుగతి నంటికొనుచు. 185

క. శరణము వేఁడిన శరధిం
గరుణించి తదీయవచనగౌరవమున న
య్యురుభూజము గిరులఁ దరులన్
స్థిరసేతునిబంధనంబు సేయించె వెసన్. 186

ఉ. ఆవిభుఁ డాత్మచాపమున
నైన గుణంబున నైన నంబుధిం
దా వెసఁ గట్టి వానరుల
దాఁటఁగఁ జేయ వలంతి యయ్యు ను
ర్విభు లోకరక్షణము
సేయుటకై కనువారి బ్రహ్మహ
త్యాదినివారణార్థమున
నై వసధిం ఘటియించె సేతువున్. 187

తే. అధికబలుఁ డైన దుర్బలుఁ డైన ధనికుఁ
డైన నిర్ధనుఁ డైన భాగ్యంబుకలిమి
సేతు వారసి చూచి వీక్షించెనేని
[illegible] బ్రహ్మహత్యాదిదోషమునంటి. 188

క. సేతువు శ్రీశైలము శ్రీ
ఖ్యాతి స్థిలాచలంబుఁ గాశీశ్వరు సం
ప్రీతిన్ సందర్శించిన
పూతమతికి వాంఛితార్థములు సిద్ధించున్. 189

తే. అన్నఁ దొలఁగి విభీషణుం డన్నరేంద్రు
శరణము భజించె నాలోన శరధి దాఁటి
యద్రిసముధీరుఁడై సువేలాద్రి యెక్కి
లంక వీక్షించె వీతకలంకుఁ *డతఁడు. 190

వ. రావణుండును నొక్కమహోత్తుంగసౌధంబు నారోహించి
వానరవాహినిం గాంచి రామదేవుని గుఱుతుగా నాతుర
గం దలంచి శుకసారణు లనుచారణులం బనిచిన వారలు
సేనాసాగరంబుం బ్రవేశించి యరసి వచ్చి యి ట్లనిరి. 191

సీ. అచ్ఛభల్లాధీశుఁ డగుజాంబవంతుండు
నీల శ్వేతను పూర్ణ పాత్రిల నిలువ
ననిలపుత్త్రాంగదు లంఘ్రికంజద్వయార్చ
నదిక్షులవారల నిలిచి కొలువ
వినజుండు సౌమిత్రియును నంజలి ఘటించి
ప్రార్థిఁ గార్యము విన్నపంబు సేయ
నంశుకసంఘాటితాస్యుఁడై చెవిదండ
మసవిభీషణుఁడు మంతనము సలుపఁ

* దగుచు—ప్రా. ప్ర.

తే. గూటమున మృగశృతిపైఁ గూరుచున్న
యసితవర్ణుఁ డాజానుబాహార్గళుండు
రాముఁ డాతఁడు రాక్షసరాజవర్య
వాలిపై నిర్వదేండ్లవయసువాఁడు. 192

క. ఘోరాకారులు వానర
శూరులు గోటానకోట్లు చుట్టుం గొలువన్
మేరుధరాధరధీరుం
డారాముఁడు నిన్ను గెలువ నరుదెంచె వెసన్. 193

వ. ఇందులకుఁ బ్రతివిధానం బాచరింపు మని తెల్పునవస
రంబున. 194

తే. ఆ సువేలాద్రిపై నుండి యార్కసూనుఁ
డెగసి వచ్చి రావణునిపైఁ గల్గి విఱిచి
ముష్టిఘాతాహతుల నొంచి మురువడంచి
చనియె వెండియు రామునిసన్నిధికిని. 195

వ. ఆసమయంబున రావణుండు పురప్రాకారరక్షణార్థం బనే
క దైత్యదానవవీరుల నియోగించి తాను ననేకాక్షౌహిణీ
మూలబలసమేతంబుగా యుద్ధంబునకు నిర్గమించె నద్దా
నవుల నెదుర్కొని వానరవీరు లత్యంతదారుణం బైనర
ణంబు సేయుందొడంగి రందు దశగ్రీవు రాఘవుండును,
మేఘనాదుని లక్ష్మణుండును, ప్రహస్తుని సుగ్రీవుండును,
మహాకాయుని జాంబవంతుండును, నతికాయుని శరభుం

దును, మఱియు ననేకు లనేకులతోఁ దొడరి ద్వంద్వ
యుద్ధం బొనరింప నంత రామబాణపీడితుం డై భిన్నశ
రాసనుండును, నిహతారంభుండును నై రావణుండు
మరలి లంకకుం బఱచె జనకునిపలాయనంబుఁ గాంచి
మేఘనాదుం డత్యంతక్రోధంబునం గపిబలంబుల నెల్ల
నమయించి సౌమిత్రియుం దానును బోరొనరించుచు
నుండె నంత. 196

ఉ. ఆయుధధైర్యధుర్యనిశి
తాశుగవేగము నైపలేక పై
పోయనవీథి నిల్చి గహ
నాటుల గీటణఁగించి మించి య
చ్చాయకుఁ జేరి రాఘవుల
శాతశరాహతి నాత్మమాయలం
బాయఁగఁ జేసి ఘోరఫణి
పాశనిబద్ధులఁ జేసె వారలన్. 197

ఉ. ఈనెఱి రామలక్ష్మణుల
నిద్దఱ గాసి యొనర్చి లంకకున్
దానవనందనుం డరిగి
తద్విజయప్రద మైనహోమముం
బూని యొనర్ప నంత రఘు
పుంగవు లున్న తెఱంగుఁ గాంచి యు

సమరఁ గొనసరించెఁ దాను లక్ష్మణుఁడు నపుడు
నృత్రివాసవు లని సేయువిధము దోఁప. 202
(వ. వా రొనరింపం దొడంగి రంత.) 203
మ. శరసంధానము మోక్షణంబు యుగప
త్సంప్రాప్తిఁ జెన్నొంద నా
హరిశౌర్యంబు సుమిత్రపట్టి యని సే
యం గాంచి యబ్జోద్భవహో
శరవేగంబు సుపర్వసంతతికి ర
క్షశ్శ్రేణికిం గల్గ దీ
యురుతేజం గెలువంగఁ బోల దని తా
నూహించి వాఁ డత్తఱిన్. 204
క. సురవరులు నసురయోధులు
హరివీరులు గనఁగ రఘువానుజు నెమ్మే
శరవృష్టిఁ ముంచిన న
య్యురుభుజుఁ డజశరము వింట యోజించి వెసన్. 205
తే. అనఘుఁ డీరాముఁడు పరాత్ముఁ డయ్యెనేని
యవని యాతల్లి తా సాధ్వి యయ్యెనేని
దశరథున కేను సుతుఁడ నై తగుదునేని
ద్రుహిణసాయక మీదైత్యుఁ దునుముఁగాక. 206
చ. అని తెగ వాపఁ దత్త్రిదశ
మాదనుజుం దెగటార్చి పేర్చె నా

ఘనుపటుఁ బుష్పవర్ష మతి
గాఢముగా గురియించి దేవతల్
వినుతి యొనర్చి రంతఁ గని
వీరులు నృత్యము సల్పె మేఘునా
దునినిధనంబు దానవులు
దోడన తెల్పిరి దైత్యభర్తకున్. 207

ఆ. అతఁడు క్రోధదీప్తుఁ డై కుంభకర్ణునిఁ
బనిచె రాముతోడ నని యొనర్ప
సమ్మహోన్నతాంగుఁ డప్పురవరణంబు
గడవ దాఁటుమాడ్కిఁ గడచి చనియె. 208

శా. అరక్తోపరుఘోరకాయము ప్లవం
గానీక మూల్కొంచి యు
మ్మరుద్గ్రావము మందరంబో యటు
లిమ్ముఁ దాల్చి శిలావళిన్
సారోదారత నొంప వచ్చె నని దు
ష్పారవ్యథం గుందె దు
ర్వారాహంకృతి వానిమీఁదఁ దరులుం
గ్రావంబులుం బైచినన్. 209

చ. వనచరహస్తముక్తతరు
వ్రాతములుం ధరణీధరంబులుం

పెనుమల్లుపై నడంగుజల
బిందులచందము నొంది వండె న
ద్దనుజానురంబుఁ దాఁకి యట
తత్కపివీరుల మ్రింగఁజొచ్చె వాఁ
డనువుగ నిత్తుఖండములు
పోలి మొనంగుగజేంద్రుఁడై వడిన్. 210

తే. జాలికుఁడు జాలముల మీనసమితిఁబోలె
హస్తములఁ బట్టి వదనగుహాంతరమునఁ
జొనుప సద్దైత్యునాసికాశ్రుతిబిలముల
వెడలి వచ్చిరి కొందఱు వృతుచరులు. 211

క. సుగ్రీవముక్తభూమిరు
హాగ్రవిపాతజర్జరాంగుండై వాఁ
డుగ్రత గదఁ గొని వైచెన్
సుగ్రీవుఁడు మూర్ఛచే వసుంధర వ్రాలెన్. 212

క. ఇనజానిఁ దనభుజమున నిడి
కొని దైత్యుం డరిగె లంకకుం జెచ్చెర న
వ్వనచరపతిచందముఁ గని
హనుమత్ప్రముఖులు గలంక నందుచుఁ దమలోన్. 213

...న రక్షకు పునము
...శ్యామలపావనమానశాలి యా

యినజుఁ డవజ్ఞ గాఁగ మది
నెంచును దాన కతంగ దానవుం
డనుమఁగలం డవార్యబల
ధుర్యుఁడు ధైర్యధురంధరుం డితం
డని తలపోసి రంత సమ
రారియుఁ గ్రక్కున నేఁగ నీటికిన. 214

తే. అపుడు పౌరులు గంధసారాంబువులను
మందమకరందబిందునిష్యందికుసుమ
దామములు గుంభకర్ణుపైఁ ద్రోచి నిలిచి
రతనివిజయంబునకు హర్షితాత్ము లగుచు. 115

సీ. శీతలహిమజలసేచనక్రియ మూర్ఛఁ
దెలిసి శాఖామృగాధీశ్వరుండు
కరదంతములఁ గుంభకర్ణుకర్ణములు
ఘ్రాణంబు ఛేదించి గగనవీథిఁ
జనియె సద్దానవుంమును లజ్జితుం డయి
క్రమ్మఱ మరలెంచి కపులఁ జంపి
నిజకర్ణనాసాప్రనిర్ఝరధారలు
జాఱి మత్తగజంబురహిఁ దిరుగుచు
తే. నట విభీషణుఁ గాంచి రోయన్న తొలఁగు
మనుతవంశ్యులునకు నీవు దయంతరంబ

వసథు నే నిజశోణితం బానుకతన
నొరుల నాత్మీయుల నెఱుంగ కున్నవాఁడ. 216

తే. అనుచుఁ బల్కి విభీషణుం డట్లు తొలఁగ
నంత నద్దైత్యుపై రాముఁ డంపవాన
గురిసె శైలంబుపై వానగురియులీల
నది యతనిమేన గోమంబులట్ల యమరె. 217

మ. కదనం బీగతిఁ జెల్ల రాఘవుఁడు దో
ర్గర్వం బఖర్వంబుగా
గదఁ సారించుచు నేఁగుదేరఁ గని యా
కర్వ్యాదుచేదోయియుం
బదయుగ్మంబును గంతము న్నఱికె శుం
భద్బాణధారాహతిం
దివిదకు ల్విస్మితచిత్తులై నిలిచి సం
ప్రీతిం బ్రశంసింపఁగన్. 218

ఆ. ఇట్లు కుంభకర్ణుఁ డీల్గిన హతశేష
బలములోడఁ దాన బవరమునకుఁ
జనిమె నాపదబ్ధి మునిఁగియు ధైర్యంబు
కలిమికలిమిఁ బంక్తికంధరుండు. 219

కపులవిలసితము.
కపులును గిరులును దత్తుచరబీరుల్
[illegible]

ఖరపరశువులును *(గదలును) ఘోరో
త్కరములుఁ బఱపిరి గడగుచువారల్. 220

క. ఈరీతి నుభయబలములుఁ
బోరాడఁగఁ దనకు నెదురువోలఁదిండిపయిం
ధీరత రామమహీపతి
మారుతిపై నెక్కి పఱపె మార్గణవితతుల్. 221

తే. రామకార్ముకముక్తనారాచసమితి
నిటలమున నాఁటి మూర్ఛిల్లె నిర్జరారి
యల్గ సారథి యరదంబుఁ దోలఁగఁజేయ
నంతఁ దెలివొంది కినుక నిట్లనుచుఁ బలికె. 222

క. ఓరీ నను ధీరునిఁగ వి
చారించి రథంబు దేరఁ జనునే నీకున్
వైరులు గని నవ్వఁగ దు
శ్చారిత్రిక యపయశంబు సంధించితిగా! 223

తే. అనుచుఁ గ్రోధింప వాఁడు నద్దనుజుఁ గాంచి
దేవ యిది సూతకృత్యంబు దీని కలుగ
నగునె రాముని గెలువు మీ వనుచుఁ (బలికె)
నట్లు సన్నద్ధుఁ డై యతఁ డనికి నడిచె. 224

క. వృక్షచరవీరు లాలో
వృక్షంబుల శైలములును వివిధాస్త్రములన్

* [illegible]

రక్షోబలములఁ గడచిన
వీక్షించి యతండు రోషవివశుం డగుచున్ 225

ఉ. రాము నెదిర్చి ఘోరశర
రాజి నిగుడ్చిన నాతఁ డల్గి యు
ద్దామగతిం దదశ్వములఁ
దద్రథసూతుఁ దదీయచాపమున్
భీమశరంబులం దునిమి
పెల్లుగ *సాశుగవృష్టి ముంప న
గ్గాఢిదిరక్కసుండు భయ
కంపితుఁడై పఱచెన్ రయంబునన్. 226

వ. ఇట్లు రామబాణకృతవేదన సహింపలేక రణంబు విడిచి లంకాపురంబునకుం బఱచుచు నారావణుండు. 227

మ. కులశైలోపవనావనీరుహలతా
కుంజంబులన్ ఖేయసం
స్థల సాలాంతరసీమలన్ మఱి బహి
ర్ద్వారంబులన్ లంకలోఁ
గలసౌధంబుల వీథులన్ నిజగృహా
గ్రామంబులన్ రాము ను
జ్జ్వలబాణాంచితచాపపాణిఁ గనితాన్
సంత్రస్తభావంబునన్. 228

* సాయక—పా. భే.

మ. పరిశయుసంభోవనినాదమేదురధను
ర్జ్యాటంకృతుల్ మీఱఁ ను
జ్జ్వలకాండంబులు పెల్లుగాఁ గురియుచుం
జానొంది రక్తాంతవ
*ర్త్మలసల్లోచనుఁ డై పురంబు లదురం
జుర్దించు కంభుండు నాఁ
‡జెలు వౌ రామునిఁ బంక్తికంధరుఁడు గాం
చెం సర్వదిగ్భిత్తులన్. 239

క. జగమంతయు రామాత్మక
ముగఁ గని రావణుఁడు దీర్ఘముగ రోఁజె నభం
బగడొందుచుఁ గల గని భయ
ము గదుర నరునిగతి మిగుల మోహాతురుఁ డై. 230

క. తరుణులును సభాసదులును
గర మాశ్చర్యంబు నొంది కడు భీతుం డై
దురితతరుఁ డైనదనుజుఁడు
పారి నుబ్బుఁ దొలంగి వగలఁ బొగులుచు నుండెన్. 231

వ. అంత నారాఘవుండు నిజవిశ్వరూపంబు శారతింబు గా
వించినం బ్రకృతిస్థుం డై రావణుండు లజ్జావనతుండును
మందోదరీసమేతుండును నై యంతఃపురంబున కేఁగి
చింతించుచుండె నంత. 232

* వర్మ; ‡ జెలఁగుం రాముని.—వా.ప్ర.

గడిమి మందులగట్టు గాచి యేమఱకున్న
సురసంఘముల నెల్ల సురుఁగఁజేసె
క్రోధాద్రిఁ జెమ్మపోఁ * దొలివేలుపుల వార్థి
సహముఁ బదాహతిఁ బొదవడంచె

తే. బాహుపుంగాత్రములు సముద్రమున నైచి
నిఖిల లక్ష్మణు బ్రదికించి ద్రవ్యశైలంగ
ద్రోణధాత్రీధరము నిల్పెఁ దొంటిచోట
వాయువేగంబుచేత నవ్వాయుసుతుఁడు. 240

వ. యామత్రితయకాలమాత్రంబున నియ్యుద్యోగం బతండు గావించెఁ గుంభకర్ణమేఘనాదాతికాయాదియోధులు నిహతులైనను వెండియు సమరంబు సేయ నుద్యోగించెదవు రాజ్యతృష్ణం బాగులక సీతాదేవి యైనమృత్యుదేవిని విసర్జించి యవశిష్టబంధుజనంబులం బ్రతికింపుమని తెలిపిన నమ్మందోదరివచనంబులు విని యనాదరంబు సేసి యారావణుం డప్పుడు సేనాపరివృతుం డై వెడలి రామచంద్రునితో ఘోరసంగ్రామంబు సొనరుచుండె నంత.

తే. రాఘవుఁడు భువి రథముపై రావణుండు
నిలిచి యునికి సేయఁ గనుఁగొని బలవిభేది
ఘనతరాశుగధనుశ్శరకలిత మైన
రథము మాతలిచేఁ బంచె రాఘవునకు. 242

* దొలివేలుపుల—రాక్ష.

బు దిలిగ్య స్థితుడించె నాకుగతి నం
భోజాతజాతోత్సవముగా. 246

వ. అప్పారుణభాగంబున జగద్విద్రావణుం డగురావణుండు
నిహతుం డయ్యె నయ్యవసరంబున. 247

ప్రహరణకలిక. తిరముగ గెలిచెన్ దిశలు [illegible]
స్ఫురరుచి దనరెం గపిబల మలరెం
సురనికురుంబవర్గము శిరయుగ బం
ధురగతి సురదుందుభు లులిసె దివిన్. 248

చ. రణమున రావణుం డిల్కురగ
రావణు గెల్వగ నిర్జరావళుల్
ప్రణుతి యొనర్చి రచ్చరల
పాటలు నాట్యము గాట మయ్యె
మ్న్యణుడును రామునానతి స
చంచల వైఖరి లంకలో విభీ
షణు సభిషిక్తుఁ జేసె కపి
సంఘము లచ్చెరు వొంది చూడగన్. 249

తే. రవియు శశియును భువియును రాముకథయు
నెంతపర్యంత ముండు నీ వంతదనుక
నెలవు నిశ్చింత నీలంక నేలు మనుచు
నతని దీవించి మనుజరాజ్యమున నిల్పె. 250

సీ. అపుడు రామునియాన నగచరవరు లశో
కారామమున నున్న యవనిజాతఁ
దోడ్తేర నాఁ బత్త్రియ్యలిఁ గనుఁగొని
ప్రీత్యయుం బొనరింపఁ బనుప నదియు
సీతాంగనాకృతిచే లంకఁ జొచ్చితి
నే మృత్యుదేవత నిక్క మరయ
నేమహామహానిమాయామహాబ్ధి మునింగి
పారంబుఁ గనలేరు పద్మజాదు
తే. లట్టి రామునిచేఁ బరమాత్ముచేత
ననుపమప్రీతి నాకార్య మయ్యె నను చ
సకలలోకంబులు వినంగఁ జాటిచెప్పి
చనియె మృత్యువు తనరూపు సవదరించి. 251
తే. సకల దైవతవిమతుల సంహరించి
సమరహతు లైనశాసనచరుల మునిచి
యినసుతవిభీషణాదిసమేతుఁ డగుచు
నపుడు రాముఁ డయోధ్యకు సరుగఁ దలఁచి. 252
క. నిజసీతాసంగతుఁ డై
యజరులు [illegible] పుష్పకారూఢుం డై [illegible]
ప్రజవగతి నరిగెఁ బ్లు [illegible]
ధ్వజనీసముదయ [illegible] 253

* కారామమునున్న [illegible]

తే. కామగమ మైన యాపుష్పకము రయమున
సరిగి కిష్కింధఁ జేరఁ దారాదివనచ
రాంగనల నందు నెక్కించి యర్థి సరణిఁ
జని యుతం డమ భరద్వాజమునికి మ్రొక్కి. 254

క. నందిగ్రామమునకుఁ జని
యనుజన్ముగ భరతాదిసహితుఁ డై నిబిడజటా
బృందము విడిచి యమందా
నందమతిం జెలఁగుచు రఘునందనుఁ డంతన్. 255

సీ. సమలంకృతం బయి సంతుష్టరాజన
మాన్వితం బగునయోధ్యాపురంబు
మహిమఁ బ్రవేశించి మణిమయసింహాస
నారూఢుఁ డై యమాత్యానుమతిని
బట్టాభిషిక్తుఁ డై భరతశత్రుఘ్నల
క్ష్మణాధరానందనావహితుఁ డగుచు
నిలఁ బదాకొండువేలేఁడులు నిష్కంట
కంబుగా నేలి భోగములఁ దనిసి

తే. వివిధసుఖములు పెక్కు గావించి సుతుల
రాజ్యమున నిల్పి సద్ధర్మరతి నెలంగ
వెనుక నాసన్నిధికి వచ్చు విమలకీర్తి
రామచంద్రుండు సుగుణాభిరాముఁ డగుచు. 256

వ. అని చెప్పి యీశ్వరుఁడు. 257

గీ. మన్మథోత్పత్తి యైన యీమహితదివ్య
కథ పఠించిన శుభములు గలుగుఁ గలుష
వితతు * లెల్ల నాశఁ దప్పరోవితలి గొలువ
నంతసుఖమున మగ్నదంబున నధివసించు. 258

ఆ. వేదసమ్మితము పవిత్రంబు దురితఘ్న
మైనరామచరిత మనఘమూర్తి
వామలూరుభవుఁడు వాల్మీకి యనుమౌని
రచనసేయఁగలఁడు ప్రచురశక్తి. 259

తే. అతఁడు మును పుళిందుఁ డయ్యు వసిష్ఠోప
దేశమునఁ దెలంగి ద్విజతఁ గాంచి
యాదికవి యనంగ నలరు మహాముని
పుట్టలోనఁ బుట్టి భూమిమునఁగ. 260

వ. అని యానతిచ్చి శివాసమేతుండై శివుండు నిజధామం
బు ప్రవేశించె నిక్కథ నద్దేవునివలన నాకర్ణించితి నని
చెప్పి నారదుండు వసిష్ఠాదుల కిట్లనియె. 261

క. మును నే వాల్మీకాంతిక
మునఁ జరియించుచును వింటి మునులారా రా
మునినాథు డిపుడు మీరున్
ఘనగతి వింటి రది యరయఁగాఁ దగు నిచటన్. 262

వ. అనిన వసిష్ఠాదు లిట్లనిరి. 263

---

* లెల్ల—వ్రా. ప్ర.

క. శివరాములచారిత్రము
దివిజమునిశ్రేష్ఠ నీవు దెల్పఁగ వినుటన్
భవనములు సఫలతఁ జెందెన్
శ్రవణానందంబు మాకు సంధిల్లెఁ గదన్. 264

వ. అని యుగ్రసేనమునిం బూజించి యతండును దారును ఖనిత్రప్రముఖసాధనంబులు గొని వల్మీకప్రాంతంబునకు నరిగి చిరకాలావృతం బైన యప్పుట్టం గ్రొచ్చి యందు. 265

సీ. స్ఫుటసూక్ష్మశోభితభూరిప్రభాసాంద్ర
నవనవల్కలనివసనావృతాంగుఁ
జాటలస్ఫుటజటాపటలాంతశోభితు
రామనామాసక్తరమ్యరసను
సద్గురువరపాదజలజార్పితేక్షణు
దీవ్యమానానలదివ్యతేజు
నవిదితబాహ్యలోకానీకవర్తను
శ్రీరామచరణాబ్జచింతనాత్ము

తే. బద్ధపద్మాసనస్థుఁ దపఃప్రదీప్తు
మునివరు నొకనిఁ గాంచి యమ్మునులు వివిధ
విధుల బోధించి వెసిది రాద్విజుఁడు వారి
పలుకు వినఁ దమ్మె నిశ్చలభావమునను. 266

క. ఈఋషిరసనాగ్రంబున
భారతి నటియింప మధురభణితి నితండు దా
శ్రీరామాయణదివ్యక
థారచన యొనర్చు సుకవితానిధి యగుచున్. 280

ఆ. వేదవేద్యుఁ డైన విష్ణుండ నేను శ్రీ
రామరూపమునఁ గరం బలరఁగ
వసుధ వేద మితనివదనాంబుజమున రా
మాయణాఖ్యచేత నవతరించు. 281

వ. రామాయణశ్రవణపఠనంబు లాచరించినమానవుండు బ్ర
హ్మహత్యాదిసకలపాపనిర్ముక్తుం డై చంద్రునిచందంబు
నొంది జీవన్ముక్తుం డగు నెందియు నిమ్మ్యసీఁదుర్గసకు
సకలలోకసంచరణపాటవంబు గలుగు నని వరం బొసంగా
నంత నతని వాల్మీకిమహాముని యని యందఱుం గొని
యాడి రిట్లు లబ్ధవరుం డైన యావాల్మీకి యవ్విష్ణుదేవుని
నిట్లని స్తుతియించె. 282

క. విశ్వాత్మ విశ్వరూపక
శశ్వద్వైకుంఠనిలయ చక్రధర విహం
గేశ్వరతురంగ శశిహారి
ధశ్వేశుం నతి యొనర్తు నచ్యుత నీకున్. 283

ధరఁ దనయుతోఁ బల్కు పలుకులుఁ

గురుఁ డనురక్తి వినుస్తు గాను నానుతులన్. 289

క. మానసవాక్కాయములన్

జ్ఞానాజ్ఞానగతిఁ జేయు సకలాఘములం

బూని క్షమియించి ననుఁ జె

ల్వారం గరుణించియు నేలు మఖిలాధిపతీ. 290

పుష్పమాలికాబంధము.

క. కనకనయనహార ధరధర

వనజనయన సురదరహార వరదరకర ధీ

జనజలజవారఖరకర

సనయనలినజాతగీతశాతనిలయా. 291

గోమూత్రికాబంధపద్మబంధపుష్పమాలికాబంధాటవెలఁది.

శోదశాదభేదరాగమోదదప్రద

శ్రీదపాదవేదవాదమోద

శాదభేదయాదవాదకీదర్పద

భేదవాదసూదనాదవాద. 292

ఖడ్గబంధోత్సాహవృత్తము.

హేమవాస వాసవాద్యధీశ మానిశేఖరా

రామ మైత్రి నీలజలదరమ్య కాంతిభాసురా

రామ నిరంజనాత సేతి రక్షితాఖిలామరా

రామ మమ్ముఁ బ్రోవు రాజరాజ కైకశీశ్వరా. 293

క. శ్వేతద్వీపంబున బర
రీతరుమండమున మానిహృదయములన్ వి
ఖ్యాతిగ క్షీరోదంబున
నాతత వైకుంఠనగరి నలరుదు వీశా. 294

వ. అని యిట్లు వివిధవిధుల నొనరించుస్తోత్రంబు లంగీక
రించి యవ్వాల్మీకిమహామునికి వెండియు ననేకవరంబు
లొసంగి యద్దేవుండు దేవగణసమేతుండై నిజధామంబు
ప్రవేశించె నంత. 295

క. ధీరుం డగువాల్మీకియు
గౌరవ మొప్పార రామకథ యఖిలంబున్
నారదమునివలన న్విని
శ్రీరామాయణ మొనర్చెఁ జిత్రఫణితులన్. 296

వ. అని చెప్పి సూతుండు రామనామప్రభావంబు నాకుఁ
దోఁచినకరణి వర్ణించితి నని వెండియు శౌనకాదులం
జూచి. 297

చ. కొమరుగ రామనామ మొక
కోటి జపించిన మానవుండు బా
నమరఁగ రాఘవుండె యగు
నం దొకలక్ష జపించు చంత భూ
మ్యమరుల దక్షిణాం దనిపి
యన్న మొసంగఁ దగున్ మహామతిం

గ్రిమమున జాపకుండు భవ
కంధిం దరించు వరించు సంపదల్. 298

గీ. ప్రథమకోటి జపించిన బ్రహ్మసదన
మంత రెండవకోటిచే హారనివాస
మట్లు మూఁడవకోటిచే నబ్జనాభ
పదముఁ గను రామనామజాపకుఁడు నియతి. 299

వ. యావజ్జీవజాపకుల కైనను సంఖ్యానియమంబు లేక
శుభంబు నెందదు మఱియును. 300

మ. శివనామంబు త్రికోటిజాపకునకుం
జేకూర్చుఁ దల్లోక మా
శివరామాఖ్య త్రికోటిజాపకునకున్
శ్రీశాభ్రికేశాత్మతా
దివి శేషంబులఁ జేర్చు వెండి భగవ
ద్గీతాజపాసక్తుఁడున్
శివగీతాపఠనాపరుండును సుఖ
శ్రీ దాఁటు జన్మాంబుధిన్. 301

వ. మఱియు శివవిష్ణుసహస్రనామంబులును, దేవీమాహా
త్మ్యంబును సంతతంబును జపియించువాఁడు జీవన్ముక్తుం
డగు నని చెప్పిన విని శౌనకాదులు భగవద్గీతామహత్వ
ప్రభావం బెఱింగింపు మని యడిగిన సూతుం డిట్లనియె. 302

సీ. మున్ను యుగాంతరంబునఁ గాలమందరి
లను భూసురాత్మజు లనఘచరితు
లన్యోన్యహితమిత్రు లఖిలధర్మజ్ఞులు
తీర్థయాత్రికు నేఁగి ధృతి సశేష
పుణ్యాపగాస్నానపూతాంగులై కుముదా
యగ్రహారస్థవిప్రాలయమున
నవ్విప్రుచేతఁ గృ*తాతిథ్యులై తపో
యాలయవేదిక నధివసించి

గీ. దేశకాలపరిసంగంబు దిగిచి యందుఁ
దగఁ బరస్పరమును వివాదంబు సల్పి
శాస్త్ర మిడుక్కొని పైశాచరూపధారు
లై వసించిరి యొకరావి నాశ్రయించి. 303

వ. అంతం గొంతకాలం బరిగిన యనంతరంబ వారలజనకులు పుత్త్రాన్వేషణతత్పరులై పెక్కుదేశంబులు గ్రుమ్మరి జాడ లరయుచు నయ్యగ్రహారంబు చేరి యతిథిపూజాపరుం డగు నవ్విప్రునింట నాతిథ్యంబు గొని వితర్దికాతలంబునం గూర్చుండి రయ్యవసరంబునఁ బ్రసంగవశంబున నవ్విప్రుండు వారల కిట్లనియె. 303

చ. ఇననిభతేజు లైన యొక
యిద్దఱు భూసురు లేఁగుదెంచి ప్రా

* తాటిద్యుఁ జై—వ్రా. ప్ర.

మునుకుల సత్ప్రసంగమున
మిన్నక పో శానరించి రోషముల్
పెనఁగొన శాపతప్తు లయి
పిప్పలవృక్షము నాశ్రయించినా
రెనయఁ బిశాచవేషముల
నెచ్చటివారలొ యన్మహామహుల్. 804

గీ. అనిన వారు నిజాత్మజు లగుట దప్ప
దనుచు నిశ్చయ మొనరించి యుజుగుఁజేంచి
యుగ్రతప మాచరింప నవ్యగ్రలీల
నతఁడు ప్రత్యక్షమై వరం బడుగుఁ డనుడు. 805

వ. నిజపుత్త్రిల నొసంగు మనుటయు సంభోజసంభవుం డి
ట్లనియె. 806

చ. వటతరుమూలవాసి యగు
వాఁ డొకశూద్రుఁ డవంతి యను పురిం
జటి యనువధూతవేషమున
సంచరణం బొనరించు వానికిం
బటుతరశిష్యసంచయము
పంచశతంబు సెలంగు నమ్మహా
నటనముఁ డేఁగుదేర నిజ
నందనలాభము గల్గు మీ కిలన్. 807

క. వాని నశ్వత్థతరుప్రాంతంబునకుం దెచ్చుయత్నం బొన

రింపుఁ డని బ్రహ్మ చనిన వారలు నట్ల యుజ్జయినీ
పురంబున కేఁగి యిక్క యరసి యస్థిమాలికాధరుం
డైన యాయవధూతం గాంచి చిరకాలంబు ప్రార్థించి
తమయింటం గుడువ రమ్మని తోడితెచ్చి యక్కుంజ
రాశనభూజంబు సమీపంబున నిల్చిన. 308

. వానిఁ గనుమాత్ర భూసుర
సూనులు నిజరుచిరరూపశోభితు లగుచుం
బూన చనుదెంచి యనిరి మ
హానందార్ణవనిధిఁ దేలి ప్రాంజలు లగుచున్. 309

. అసఘు నీదర్శనము సేయు నంతమాత్ర
శాపము దొలంగి వికటాకారవిగ్ర
హతఁ దొలంగుచు జన్మదేహములు దాల్చి
యరుగుదెంచితి మేము మహానుభావ.

. అనిన నజ్జటాధరుం డత్యంతవిస్మితుండై వారలం జూచి.

. స్నానసంధ్యావిహీనుఁడ మేన భసిత
మలఁది చరియింతు నేను శూద్రాన్నుండ
. మాపిశాచాంగములు వోవ మీకు నిట్టి
మెట్టిమహిమంబుచే నాకు నెలసెఁ జెప్పుఁడ. 311

. అనుడు వారిజనకు లజ్ఞానాజ్ఞచే నిన్నుఁ
దేరవలసె నొందు తెలుఁగు గాను

జండదీధితి జగముల బెండుపఱుప
నిండె వేసవి పాంథులగుండె లగల. 321

వ. అక్కాలంబున. 322

క. బహులాతపోష్మభీతిం
మహీసురుఁడు నదీతటమున మహనీయగతిం
స్నుహావృక్షద్వయికుఱఁగట
సహారహముం జదువుకొనుఁ దదధ్యాయంబుల్. 323

వ. ఇట్లు చదువుచుండఁ దత్పాఠశ్రవణప్రభావంబున నావృక్షంబులు సంత్యక్తదురితంబులై రాజకులంబున రాజులై జనియించి సర్వలక్షణలక్షితులును, జాతిస్మరణసంపన్నులు నై రాజ్యంబు సేయుచు (శ్రీమద్భగవద్గీతామధ్యగతాధ్యాయద్వయనిరంతరపఠనుండును) విష్ణుసమానుండును నగు నవ్విప్రపుంగవుం గాంచి నమస్కరించి యిట్లనిరి.

ఉ. ఓ ధరణీసురాన్వయప
యోనిధిపూర్ణసుధామయూఖ నీ
వీధరఁ బూజనీయుఁడవ
హీనగుణాఢ్యుఁడ విద్ధబుద్ధి మా
మాధవమాసవేళ గిరి
మా స్నుహావృక్షయుగంబునీడ స
ద్బోధను విశ్వరూపము వి
భూతియు నీవు పఠింపఁ జెప్పుచున్. 325

గీ. మును దదధ్యాయయుగళంబు వినుటఁజేసి
జెముడుమాఁతులు రెండుఁ బాపము దొఱంగి
భవ్యభూతివివేకసంపదఁ జెలంగి
యవనివిభులై జనించె ధరామరేంద్ర. 327

క. అమ్మహీభుజులము మేమే
చుమ్మీ వితరణగుణంబు శూరత యశముం
గొమ్మలుఁ గరితురగమ్ములు
నిమ్మగుసంపదలుఁ గలిగె నిదె నీకరుణన్. 328

గీ. స్వామి జాతిస్మృతియు మాకు సంఘటిల్లె
ప్రాప్తరాజ్యులమై ధర్మరతిఁ జెలంగి
యుద్ధభోగావళియు సంగ్రహింపఁ గంటి
మిన్నిపుణ్యంబులకు నీవె హేతు వరయ. 329

క. అని యతని సబాంధవముగఁ
గొని చని తమధరకు నరిగి గురుతరభక్తిన్
మన మలరఁ బూజఁ దనుపుచు
నొనరఁగ సుఖవంతు లగుచు నుండిరి వరుసన్. 330

వ. అని చెప్పి సూతుండు. 331

క. గాయత్రియు మఱి రుద్రా
ధ్యాయముఁ జండీస్తవంబు హరిహరగీతా
ధ్యాయంబు లొకటి కొకటియు
సాయుజ్యం బొసఁగు నిరతజపశీలునకున్. 332

వ. వాల్మీకిచరిత్రం బయిన యీపుణ్యాఖ్యానంబు వేదవ్యాస
విరచితంబు మీకు సవిస్తరంబుగా నెఱింగించితి దీనిని
శ్రద్ధాభక్తి సమన్వితులై పఠించువారలు వినువారలును
విప్రహత్యాదికల్మషంబులం దొఱంగి సకలకామంబు
లం బొంది శతవర్షంబులు జీవింతురు. ౮౮౩

సీ. హరిహరామేయమహత్త్వశోభితమును
సకలధర్మవితానసంగ్రహంబు
సర్వవేదమయంబు సర్వోపనిషదాత్మ
కము నగు నీధర్మఖండ మర్థి
నర్థార్థులకు నిఖిలార్థప్రదంబును
పుత్త్రకాములకు సుపుత్త్రదంబు
నాయుష్యకరముఁ బుణ్యాస్పదంబును యశ
స్కరముఁ జతుర్వర్గసాధనంబు
ఘోరసంసారసాగరతారకంబు
నగు నిరంతరభక్తి సమంచితముగ
వినిన చదివిన వ్రాసిన మనుజులకును
బ్రహ్మవిదులార యిది వ్యాసభాషితంబు. ౮౮౪

గీ. పొత్తమున వ్రాసి యిక్కథ పూజసేయు
నన్వయంబున వర్ధిల్లు నచలభూతి
యఖిలతీర్థాస్పదంబు శుభాకరంబు
నగుచు విలసిల్లు తద్గేహ మనఘులార. ౮౮౫

గీ. అవని నధ్యాయ మైనఁ దదర్థ మైన
నందు శ్లోకార్థమయినఁ దదర్ధమైన
హాళిఁ జదివిన రాజసూయాశ్వమేధ
ఫలము గలిగించు స్కాందంబు పాఠకులకును. 886

శా. దేవా నీకరుణాకటాక్షమున ను
ద్దీపించు విద్వన్నుత
శ్రీవాగ్వైఖరి ధర్మఖండ మను నీ
చిత్రప్రబంధంబు నా
భావప్రౌఢిని గద్యపద్యములచేఁ
బాటించి యర్పించితిన్
శ్రీవాల్లభ్యమునం గ్రహింపు మిలమిన్
శ్రీశైలమల్లేశ్వరా. 887

శా. గంగాతుంగతరంగసంగతదళ
*త్కంజభ్రమన్మత్తసా
రంగీగానవిలోలకర్ణయుగళీ
♦రంగద్విలాసాత్త త
ద్గంగామంగళదూతికాభ్రమనమూ
త్తుంగవ్యదాత్మీయవా
మాంగా‡దీంద్రసులోపలాలనపరా
హారీకృతాహీశ్వరా. 888

---

* కంజాతిమన్మత్త; ♦ రంగద్విలాసంత; ‡ దింద్ర—జా. ప్ర. వ).

క. పత్త్రీకృతమాహాత్రియు
పత్త్రివిభువాహ బాణ పాలితబాణా
పాత్రీకృతవిధిమస్తక
సత్త్రాశనవంద్యమానచరణాబ్జాతా. 339

మంగళమహాశ్రీవృత్తము.
శ్రీకర నిశాకరణశేఖర యమమారమణ
సింధుతనయారమణ బాణా
పాకపరిపంథిమణిభాగళ మనీషిమణి
బాంధవ పతాంబోధిమణిభూగా
ప్రాకటశుభాచరణ పన్నగపశాధారణ
భక్తజనతారణవిలోలా
శ్రీధరవాస వరచిన్మయవిలాస హార
సిద్ధనుత మంగళమహాశ్రీ. 340

గద్య. ఇది శ్రీమద్గురుకరుణాతిశయలబ్ధవిశాలభవ
యోదులపల్లి శంకరమంత్రితనూభవ సుధీజన
విధేయ భవానీశనామధేయప్రణీతంబైన
ధర్మఖండం బనుప్రబంధపరిపూర్తి
న వ మా శ్వా స ము.



# ముఖ్యపాఠభేదములు

| పుట. | పంక్తి. | పాఠభేదము. |
|---|---|---|
| 482 | 11 | సీ. శునియందు (ప్రతులన్నిట నిట్లే) |
| 577 | 3 | భక్తయశస్క రాయ |
| 674 | 7, 8 | పూజితులగుదు, బాలుఁడు లేచట |
| 691 | 2 | గాంచిరప్పుడస్వప్న |
| 697 | 10 | ధవళకరవిభాసద్వ్రజ |
| 799 | 17 | చాయన్ డాయుడు |
| 800 | 18 | డించి యూరక |
| 801 | 1 | బ్రిహస్త్రశస్త్ర బాధచేఁ బఱచుశ్రాహానురుఁ |
| 806 | 18 | డించుటకుఁ (బ్రో) |
| 821 | 10 | యమర్త్యాద్రు |
| 848 | 4, 5 | రక్తాంతవ, ద్వలనన్ |
| 852 | 20 | సుధ వారి |
| 858 | 12 | మాన మొదలు |
| 862 | 4 | నిరగా వరక్షేవ |

[illegible] 866 [illegible] పుట 800 పద్యమునకుఁ దిక్రిందిపద్యము నున్నది.

తే. గీ. [illegible] బాల్యకౌమారయౌవనవార్ధ
క [illegible] నందెన రామనామము జపింప